# శ్రీ ఆది శంకరాచార్య

(జీవిత విశేషాలు, సిద్ధాంతం - సంక్షిప్తంగా)



కళానిధి సత్యనారాయణ మూర్తి

డా॥ రేమెళ్ళ అవధానులు

శ్రీ వేదభారతి

శ్రీ శంకర భగవత్పాదాః విజయంతే॥

# శ్రీ ఆది శంకరాచార్య

## (జీవిత విశేషాలు, సిద్ధాంతం - సంక్షిప్తంగా)


**కళానిధి సత్యనారాయణ మూర్తి**

విశ్రాంత న్యాయశాఖ కార్యదర్శి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

"సంస్కృత మిత్ర"

**డా॥ రేమెళ్ళ అవధానులు,**

M.Sc.(Nuclear Physics), M.A., Ph.D.(Sanskrit), M.A., Ph.D.(Jyotisha)

Dy. Director(Computers), (Retd)., NIMS, Hyderabad.



**శ్రీ వేదభారతి**

**హైదరాబాదు**

**2013**

# శ్రీ ఆది శంకరాచార్య

**(జీవిత విశేషాలు, సిద్ధాంతం - సంక్షిప్తంగా)**


**కళానిధి సత్యనారాయణ మూర్తి**

**డా॥ రేమెళ్ళ అవధానులు**



ప్రథమ ముద్రణ : డిసెంబర్, 2013





వెల : **రూ. 25/-**

ప్రతులకు

**1. శ్రీ వేద భారతి**

"H" Block-34, Madhuranagar, Hyderabad - 500
Ph. : 040-23812577
Cell : 098494 59316
e-mail : shrivedabharathi@gmail.com
www.shrivedabharathi.in
www.shrivedabharathi.org

2. Sri K.S.N. Murthy,
D-118, Madhuranagar, Hyderabad - 500 038
Ph: 040-23810590, Cell: 94902 95269

ముద్రణ : **సంహిత గ్రాఫిక్స్**
అమీర్‌పేట్, హైదరాబాద్ - 500 016.
ఫోన్: 040-23731620, 23741620

# కృతజ్ఞతలు

శ్రీ వేదభారతి ఆవిర్భవించినప్పటినుండి

చేపట్టిన కార్యక్రమాలన్నింటిని ప్రోత్సహిస్తూ,

అన్నివిధాలా ఆదుకుంటున్న

**శ్రీ పి.వి. ప్రభాకర రావు** గారికి

(ప్రముఖ పారిశ్రామికవేత్త)

కృతజ్ఞతలు తెలియజేస్తూ,

వారికి, వారి కుటుంబ సభ్యులకు

పరమేశ్వరుడు పరిపూర్ణ అనుగ్రహమును ప్రసాదించుగాక!

అని ప్రార్థిస్తున్నాము.

**డా॥ రేమెళ్ళ అవధానులు**

శ్రీ వేదభారతి

"విజయ కార్తిక పౌర్ణమి"

17.11.2013

# శ్రీ ఆది శంకరాచార్య

## విషయసూచిక


**1వ అధ్యాయం**

1. జననం–విద్యాభ్యాసం 1
2. కార్యోన్ముఖులైన శంకరులు 3
3. గోవిందపాదుల ఆశ్రమంలో 4
4. కాశీక్షేత్రానికి ప్రయాణం 5
5. దిగ్విజయ యాత్ర 7

**2వ అధ్యాయం**

1. గౌడపాదులు 13
2. శంకర భగవత్పాదులు 15
3. శంకరుల రచనలు 16

**3వ అధ్యాయం**

1. అద్వైతం 19
2. బ్రహ్మము 23

3. బ్రహ్మము - జ్ఞాన స్వరూపము 27

4. బ్రహ్మము - సత్యము 29

5. జగన్మిథ్య 34

6. బ్రహ్మము - ఈశ్వరుడు - జీవుడు 39

7. బంధము - మోక్షము 46

8. ఈశ్వరుడు - సృష్టి 51

9. మాయ-అవిద్య 56

10. ప్రమాణాలు - జ్ఞాన సముపార్జన 59

11. ఆస్తికత 62

**4వ అధ్యాయము**

1. ఇతర సిద్ధాంతాలు 65

2. ఇతర అద్వైత సిద్ధాంత ప్రవర్తకులు 67

3. శ్రీ శంకరుల కృషి - తరతరాలకు స్ఫూర్తిదాయకం 70

**ఉపయుక్త గ్రంథాలు** 71

# మా ధ్యేయం

శ్రీ ఆదిశంకరుల అద్వైతం, భగవద్రామానుజుల విశిష్టాద్వైతం, శ్రీ మధ్వుల ద్వైతం ప్రసిద్ధమైన సిద్ధాంతాలు. ఈ మూడు సిద్ధాంతాలకు అనుయాయులు గణనీయంగానే ఉన్నారు. అయితే ఈ అనుయాయులలో చాలా మందికి 'నేనీ సిద్ధాంతానికి చెందిన వాడిని' అని తెలుసునే తప్ప, తమ తమ సిద్ధాంతాలలోని మౌలికాంశాలు గాని, తమ సిద్ధాంతం ఇతర సిద్ధాంతాలలోని ఏయే విషయాలతో ఏకీభవిస్తుంది లేక విభేదిస్తుంది అనే విషయాల మీద గాని అవగాహన లేదు. ఇది యాంత్రిక జీవితం వల్ల, తెలుకోవాలనే ఆక్షాంక్ష లేక పోవడం వల్ల, ఈ సిద్ధాంతాల మీద గ్రంథాలు జటిలంగా ఉండడం వల్ల సంభవించింది. సిద్ధాంతకర్తల జీవిత విశేషాలు కూడా చాలా మందికి తెలియవు. ఇది సామాన్యుల పరిస్థితి. జిజ్ఞాసతో అధ్యయనం చేసే వారికి, పండితులకు చెప్పవలసిందేమీ లేదు.

అలాంటి సామాన్యులకు, ముఖ్యంగా జిజ్ఞాస ఉన్నా విపులమైన, జటిలమైన గ్రంథాలను అధ్యయనం చేయడానికి సమయం లేనివారికి, వారి వారి సిద్ధాంతాల మీద కనీస అవగాహన కలిగించాలనే ఉద్ధేశ్యంతో శ్రీవేదభారతి 'శ్రీ ఆదిశంకరాచార్య', 'భగవద్రామానుజాచార్య', 'శ్రీ మధ్వాచార్య' అనే మూడు చిన్ని పుస్తకాలను ప్రచురించింది. సంక్షిప్తంగా ఆయా సిద్ధాంత కర్తల జీవిత విశేషాలను, సిద్ధాంతాలను కేవలం పరిచయం చెయ్యడమే ఈ చిన్ని పుస్తకాల ధ్యేయం. ఇది చదివిన తరువాత ఆయా సిద్ధాంతానికి చెందిన వారు ప్రభావితులై వారి వారి ఆచార్యుల జీవిత చరిత్రలను, సిద్ధాంతాలను సమగ్రంగా అధ్యయనం చేస్తారని ఆక్షాంక్షిస్తూ...

– ప్రకాశకులు

# శ్రీ ఆది శంకరాచార్య

(జీవిత విశేషాలు, సిద్ధాంతం - సంక్షిప్తంగా)

# 1వ అధ్యాయం

# జీవిత విశేషాలు

**విదితాఖిల శాస్త్ర సుధాజలధే**
**మహితోపనిషత్కథితార్థనిధే,**
**హృదయే కలయే విమలం చరణం**
**భవ శంకర దేశిక మే శరణమ్**

## 1. జననం - విద్యాభ్యాసం

భారతీయ తత్త్వశాస్త్ర వినీలాకాశంలో ధ్రువతారగా ప్రకాశించే మహామనీషి శ్రీ ఆదిశంకరాచార్య. హిందూమతం విపత్కర పరిస్థితులను ఎదుర్కొంటున్న కాలంలో, వేదాన్ని ప్రమాణంగా స్వీకరించి, తన ప్రతిభా విశేషాలతో, వాదనా పటిమతో, కార్యదీక్షతతో, దాన్ని పరిరక్షించి గత వైభవాన్ని సంతరించిపెట్టిన చారిత్రక పురుషుడు, ప్రస్థానత్రయ వ్యాఖ్యాత, అద్వైత సిద్ధాంత ప్రవక్త, శ్రీ శంకర భగవత్పాదులు.

కేరళ రాష్ట్రంలోని పూర్ణానదీ తీరంలో గల 'కాలటి' అనే గ్రామంలో (దీనినే కాలడి అని కూడా అంటారు) నంబూద్రి బ్రాహ్మణ కుటుంబంలో క్రీ.శ. 788లో వైశాఖ శుద్ధ పంచమి నాడు పునర్వసు

నక్షత్రంలో శ్రీ శంకరులు జన్మించారు. ఆయన ఎప్పుడు జన్మించారు, ఎప్పుడు ఎక్కడ ఎలా సిద్ధి పొందారనే విషయాలు వివాదగ్రస్తమైనా చాలామంది పండితులు ఆమోదించినది ఆయన జీవిత కాలం క్రీ.శ. 788-820 అని. తల్లి ఆర్యాంబ, తండ్రి శివగురువు, మహాపండితుడు. వారి అనన్య శివభక్తి మూలంగా వీరికి శివాంశతో శ్రీ శంకర భగవత్పాదులు జన్మించారు. అందువల్ల శివగురువు ఆయనకు, శంకరుడని నామకరణం చేశారు.

శంకరులు బాల మేధావి. ఆయన మూడవ ఏటనే తండ్రి తనువు చాలించాడు. తల్లి మూడవ ఏటనే ఉపనయనం చేయించి గురువుల వద్దకు పంపింది. గురుకులంలో ఆయన అనతికాలంలోనే వేద వేదాంగాలు, కావ్యాలు అధ్యయనం చేసి వాటిని కరతలామలకం చేసుకున్నారు. గురుకులంలో ఉన్నప్పుడే ఆయన ఒక రోజున భిక్షకు వెళ్ళి ఒక బీద బ్రాహ్మణ స్త్రీ ఇంటి ముందర నిలబడ్డారు. ఇంటిలో ఏమీ లేదు. ఒక ఉసిరికాయ ఉంటే సిగ్గుతో అదే భిక్షగా ఇచ్చింది. ఆమె బీదరికాన్ని గ్రహించి ఆయన అప్పుడు ఆశువుగా, 'కనకధారా స్తవాన్ని' చెప్పి శ్రీ మహాలక్ష్మిని స్తుతిస్తే ఆ గృహిణి ఇంట్లో బంగారు ఉసిరికాయలు వర్షించి ఆమె దారిద్ర్యం తీరిందంటారు. ఇది ఆయన చేసిన మొదటి అద్భుతం.

తరువాత, తల్లి రోజూ పూర్ణానదిలో స్నానం చేసి రావడానికి అశక్తురాలుగా ఉంటే నదీదేవతను ప్రార్థించారు. మరుసటి రోజు ఆ నది నుండి ఒక పాయ వారి ఇంటి ముందర ప్రవహించిందట ! ఇది ఆయన చేసిన రెండవ అద్భుతం. శంకరుల ప్రతిభ దశదిశలా వ్యాపించింది. స్వతహాగా మంచి పండితుడైన కేరళ రాజు

సత్కరించుదామని, ఏనుగు మీద సగౌరవంగా తొడ్కొని రమ్మని తన మంత్రిని శంకరుల వద్దకు పంపాడు. కాని బ్రహ్మచారి ఇలాంటి సత్కారాలు స్వీకరించకూడదని సున్నితంగా తిరస్కరించారు. ఆయన వైరాగ్యానికి ఈ సంఘటన ఒక ప్రబల నిదర్శనం.

## 2. కార్యోన్ముఖులైన శంకరులు

హిందూమతం విపత్కర పరిస్థితులలో పడినప్పుడల్లా ఒక మహానుభావుడుదయించి హిందూమతాన్ని రక్షిస్తూ ఉండడం చారిత్రక సత్యం. అలాంటి కారణజన్ములే శంకరులు. శంకరుల కాలంనాటికి వేద ప్రామాణ్యాన్ని తిరస్కరించి నాస్తిక వాదాన్ని ప్రవేశపెట్టిన బౌద్ధ, జైన మతాలు ప్రబలంగా ఉండి హిందూమతాన్ని బలహీన పరుస్తున్నాయి. దీనికి తోడు చార్వాకుని భౌతిక వాదం, నాస్తిక వాదం కూడా ప్రచారంలోనే ఉంది. ఇక హిందూమతంలో కర్మకాండకు ఇచ్చే ప్రాధాన్యం, జ్ఞానకాండకు ఇవ్వడం లేదు సరికదా కాపాలికాది దుష్ట సంప్రదాయాలు, మూఢనమ్మకాలు కూడా ప్రబలంగానే ఉన్నాయి.

ఈ పరిస్థితులలో శంకరుల ముందర రెండు సవాళ్ళు ఉన్నాయి. మొదటిది భౌతిక, నాస్తిక వాదాలను ఖండించడం, రెండవది హిందూమతాన్ని సంస్కరించి జ్ఞానమార్గంలో నడపడం. ఈ సవాళ్ళను ఆయన స్వీకరించి, కార్యోన్ముఖుడై ముందుగా సన్యసించి దేశాటనం చేసి తన ఆదర్శాలు సాధించాలని కృతనిశ్చయులయ్యారు.

అయితే ఒక్కగానొక్క కొడుకు సన్యసించడానికి తల్లి అంగీకరించలేదు. ఒక రోజున తల్లితో శంకరులు నదీ స్నానానికి వెళ్ళారు. అక్కడు ఆయన్ని ఒక మొసలి పట్టుకుని ప్రవాహంలోనికి

ఈడ్చుకుపోవడానికి ప్రయత్నిస్తుంది. తల్లి కంగారు పడిపోయింది. అప్పుడు శంకరులు "అమ్మా! నేను అల్పాయుష్కుడనని జ్యోతిష్కులు చెప్పారు కదా! ఈ మొసలి (సంసారం) నన్ను నదిలోనికి లాగేస్తుంది. నేను సన్యసించడానికి నువ్వు ఒప్పుకుంటే ఈ మకరం నన్ను విడిచిపెడుతుందేమో. సన్న్యసించిన తరువాత అది మరొక జన్మకదా! అప్పుడు కొంత కాలం జీవిస్తాను" అన్నారు. తల్లి విధిలేక ఒప్పుకుంది. బయటకు వచ్చి సన్యసించారు. కోరినప్పుడు తల్లికి దర్శనమిస్తానని చెప్పి, పాదాభివందనం చేసి నిష్క్రమించారు.

## 3. గోవింద భగవత్పాదుల ఆశ్రమంలో

కాషాయం ధరించి, చేతిలో దండం పుచ్చుకుని అనేక పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ నర్మదా నదీతీరంలో గల గోవిందపాదుల ఆశ్రమం చేరారు. గోవిందపాదులు గౌడపాదుల శిష్యుడు. ఆయన ఒక చిన్న గుహలో ఉండేవారు. శంకరులు ఆ గుహ చుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేసి, గుహకు ఇవతల నిలబడ్డారు. 'నీవెవరవు' అని గుహ లోపలనుండి గోవింద భగవత్పాదులవారు అడిగితే, "అయ్యా! నేను, పంచభూతాలలో ఏ ఒక్కరిని గాని, వాటిలోని గుణాలను గాని కాను! జ్ఞానేంద్రియాలను గాని, మనస్సునుగాని కాను ! కేవలం ఆనంద స్వరూపుణ్ణి' అన్నారు శంకరులు. అతని అద్వైత జ్ఞానానికి సంతసించి గోవిందపాదులు తన శిష్యుడుగా చేర్చుకున్నారు. ఆయన వద్ద శంకరులు బ్రహ్మసూత్ర భాష్యం, మహావాక్యాల విశేషార్థం అభ్యసించారు. గౌడపాదులు అద్వైతి గనుక గోవిందపాదుల ఉపదేశం అద్వైతపరంగానే సాగిఉంటుందని అనుకోవాలి.

ఆశ్రమంలో ఉండగా ఒకరోజు నర్మదకు విపరీతంగా వరదలొచ్చి చుట్టుప్రక్కల గ్రామాలను కూడా ముంచుతూ ఉంటే శంకరులు 'జలాకర్షణ మంత్రాన్ని' పఠిస్తూ ఆ నదీ జలాన్నంతా తన కమండలంలో నిక్షిప్తం చేశారట ! ఇది మూడవ అద్భుతం.

## 4. కాశీక్షేత్రానికి ప్రయాణం

ఒకసారి వ్యాసులవారు తమ బ్రహ్మసూత్రాలకు, నర్మదానది వరదలను ఆపగలవాడే భాష్యం వ్రాయగలడని అన్నారట ! దాన్ని పురస్కరించుకొని గోవిందపాదులు శంకరులను కాశీక్షేత్రం వెళ్ళి అక్కడ బ్రహ్మసూత్ర భాష్యాన్ని వ్రాయమన్నారు. శంకరులు కాశీక్షేత్రంలో కొంతకాలం ఉన్నారు. ఆ రోజులలో కాశీక్షేత్రానికి భారతావని నలుమూలల నుండి పండితులు వచ్చి అనేక శాస్త్ర విషయాల మీద చర్చించేవారు.

కాశీక్షేత్రంలో చోళదేశానికి చెందిన విష్ణుశర్మ అనే బ్రాహ్మణుడు శంకరుల శిష్యుడయ్యాడు. తరువాత కాలంలో అతనే పద్మపాదులని ప్రసిద్ధులయ్యారు. శంకరుల తేజస్సును, విద్వత్తును చూసి కాశీక్షేత్ర వాసులందరు ఆకర్షితులయ్యారు.

ఒకరోజు శంకరులు గంగలో స్నానం చేసి వస్తుండగా ఒక పంచముడు నాలుగు కుక్కలను పట్టుకుని దారికడ్డంగా వస్తున్నాడు. శంకరులు అతన్ని 'ప్రక్కకు తప్పుకో' అంటే, దానికి అతడు 'అయ్యా! నన్ను తప్పుకోమంటున్నారు, అంటే నా దేహాన్ని తప్పుకోమంటున్నారా లేక నా ఆత్మనా' అని అడిగాడు. తాను బోధించే అద్వైతం ఆచరణలో

పెట్టాలనే సత్యాన్ని గ్రహించి శంకరులు 'మనీషాపంచక'మనే ఐదు శ్లోకాలను చెప్పారు. అందులో అద్వైత తత్త్వం నిబిడీకృతమయి ఉంది. పంచముడు మాయమయ్యాడు. అతని స్థానంలో విశ్వేశ్వరుడు ప్రత్యక్షమై శంకరుల నాశీర్వదించి అంతర్ధానం అయ్యాడు. ఆ రోజులలోనే శంకరులు భజగోవింద శ్లోకాలను కూడా ఆశువుగా చెప్పారు.

ఒకరోజు శంకరులు సూత్రభాష్యాన్ని బోధిస్తూ ఉంటే వ్యాసులవారు ఒక వృద్ధ బ్రాహ్మణ రూపంలో వచ్చి వాదంలోకి దిగారు. తరువాత శంకరులు పద్మపాదుని జోక్యంతో ఆ వృద్ధ బ్రాహ్మణుడు వేదవ్యాసుడని గ్రహించి, ఆయన ముందు మోకరిల్లి ఆశీర్వదించమని వేడుకున్నారు. అప్పుడు వ్యాసుల వారు 'నీ భాష్యం సమగ్రంగా ఉంది. గ్రంథస్థం చెయ్యి' అన్నారు. అలా మనకు శంకరులు సూత్రభాష్యం అనుగ్రహించారు. ఇదే మొదటి సూత్రభాష్యం.

## 5. దిగ్విజయ యాత్ర

తరువాత శంకరులు పూర్వమీమాంసా ప్రభావం వల్ల ప్రజలు యజ్ఞయాగాదులకే పరిమితమవ్వడం చూసి, జ్ఞానమార్గం వైపు నడిపించడానికి ప్రయత్నం మొదలు పెట్టారు. మొదట ప్రయాగ (అలహాబాదు) వద్ద కుమారిలభట్టును అగ్నికి ఆహుతి అయ్యే ప్రయత్నంలో ఉండగా చూశారు. అతన్ని ఆ ప్రయత్నం నుండి విరమింపజేయడానికి ప్రయత్నించారు. భట్టు సూచన మేరకు మండన మిశ్రునితో వాదించి అతని పూర్వ మీమాంసా తత్త్వాన్ని ఖండించి

“బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః” అనే ఉత్తర మీమాంసా తత్త్వాన్ని బలంగా ప్రతిష్ఠాపించారు. మండనమిశ్రుని భార్య ఉభయభారతి కామశాస్త్రంపై ప్రశ్నిస్తే, అమరుకుడనే రాజుయొక్క శరీరంలోకి పరకాయ ప్రవేశం చేసి, ఆ శాస్త్రానికి సంబంధించిన విషయాలను అవగాహన చేసుకొని, తిరిగి వచ్చి, ఉభయభారతిని కూడా ఓడించారని గాథలు ఉన్నాయి. తరువాత మండనమిశ్రుడు శంకరులకు శిష్యుడై ‘సురేశ్వరాచార్యులు’గా ప్రసిద్ధి పొందారు.

ఆ రోజులలో కాపాలికులనే వారు ‘నరబలి’ వంటి నికృష్టమైన కృత్యాలు చేస్తూ ఉండేవారు. శంకరులు ధ్యాన సమాధిలో ఉండగా ఆయనను ఒక కాపాలికుడు బలి ఇవ్వడానికి ప్రయత్నించాడు. అప్పుడు నృసింహస్వామి హిరణ్యకశిపుడి వక్షస్థలం చీల్చినట్లే, పద్మపాదులు కాపాలికుడి వక్షస్థలం చీల్చి శంకరులను కాపాడారు.

తరువాత ఆయన గోకర్ణంలో శివుణ్ణి సేవించి, దక్షిణాదిన మూకాంబిక చేరుకుని అక్కడ ప్రభాకరుడనే కర్మిష్ఠిని కలిశారు. ఆయన కుమారుడు మూగవాడు. వింతగా ప్రవర్తించేవాడు. దీనితో తండ్రి ఖిన్నుడై ఉండగా శంకరులు చూచి అతనికి ఆత్మజ్ఞానం కరతలామలకమని, అందుచేత అలా ప్రవర్తిస్తున్నాడని గ్రహించి, అతణ్ణి ఉద్ధరించి తన శిష్యునిగా చేర్చుకున్నారు. అతనే హస్తామలకుడు.

తరువాత శంకరులు శృంగేరి చేరుకున్నారు. ప్రసవించబోతున్న ఒక కప్పకు ఒక త్రాచుపాము పడగవిప్పి, రక్షణ

కల్పిస్తున్న అపూర్వ సంఘటనను చూసి, ఆ స్థల మాహాత్మ్యాన్ని గుర్తించి, అక్కడ శారదా పీఠాన్ని స్థాపించారు. అక్కడే కాలనాథుడనే యువకుడు శంకరులకు శిష్యుడై, వారికేది కావాలో ఆలోచించి సేవిస్తూ ఉండేవాడు. ఒకరోజు అసూయాగ్రస్తులైన ఇతర శిష్యులు అతన్ని గేలిచేస్తే, అతను సంస్కృతంలో అతికష్టమైన తోటకవృత్తంలో తన గురువైన శంకరులను స్తుతించాడు. అప్పటినుండి అతను తోటకాచార్యులుగా ప్రసిద్ధుడయ్యారు.

ఇలా శంకరులకు పద్మపాదుడు, సురేశ్వరాచార్యులు, హస్తామలకుడు, తోటకాచార్యులు అనే నలుగురు ప్రధాన శిష్యులయ్యారు. ఇతరులు అనేకులు.

శంకరులు నిర్గుణోపాసనకు జ్ఞానమార్గాన్ని ఉపదేశిస్తూనే, సగుణోపాసనకు అనుకూలంగా విష్ణు, శివ, శక్తి, గణపతి, కుమారస్వామి, సూర్యుడు, ప్రధాన దేవతలుగా ఉండే ప్రసిద్ధ పూజావిధానాలను ఏర్పరచారు. అందుకే వారిని షణ్మత స్థాపనాచార్యులు అంటారు. ఆయన మతానికి, మతవిశ్వాసాలకు వ్యతిరేకి అనుకోకూడదు. ఆయన తన జైత్రయాత్రలో అనేక దేవాలయాలను సందర్శించారు. కైలాసం నుండి స్ఫటిక లింగాలను సేకరించి చిదంబరంలో మోక్షలింగం, కేదారంలో ముక్తిలింగం, నేపాలులోని నీలకంఠంలో వరలింగం, కంచిలో యోగలింగం, శృంగేరిలో భోగలింగాలను ఏర్పరచారు. అనేక శక్తి స్థలాలను సందర్శించారు. తిరుపతిని, శ్రీశైలాన్ని సందర్శించి, అక్కడి అర్చామూర్తులను సేవించారు. దివ్య క్షేత్రాలలో వారు ఉన్న సందర్భాలలో భజగోవిందం, అన్నపూర్ణాష్టకం, మహిషాసురమర్దని

స్తోత్రం మొదలైన అనేక ప్రసిద్ధమైన స్తోత్రాలను రచించారు. శ్రీశైలంలో మూడు నెలలు ఉండి తపస్సు చేసుకున్నారని, అప్పుడే సౌందర్యలహరిని రచించారని చరిత్ర ద్వారా తెలుస్తోంది. అద్వైత సిద్ధాంత కర్తగానే గాక కవిగా, దైవ భక్తుడుగా కూడా మనం ఆయన్ను గమనించాలి.

శృంగేరిలో నుండగా తల్లికి ఆరోగ్యం బాగా క్షీణించిందని దివ్యదృష్టితో తెలుసుకొని వెంటనే 'కాలటి' చేరుకున్నారు. అవసానకాలంలో ఆమెకు ఆధ్యాత్మిక విషయాలను బోధించారు. అనతి కాలంలో ఆమె శివ సాయుజ్యం పొందింది. గ్రామస్థులు సహకరించకపోవడంతో, యోగాగ్నితో ఆయన తల్లి దహన సంస్కారాలు ఇంటి వెనుకనే నిర్వహించారు. తిరిగి శృంగేరి చేరుకున్నారు.

శృంగేరిలో మఠానికి సురేశ్వరాచార్యులను పీఠాధిపతిని చేశారు, ద్వారకలో మఠాన్ని స్థాపించి దానికి హస్తామలకుణ్ణి పీఠాధిపతిని చేశారు, బదరికి సమీపంలోని జోషీమఠ్‌లో జ్యోతిర్మఠాన్ని స్థాపించి దానికి తోటకాచార్యులను పీఠాధిపతిని చేశారు, పూరీలో గోవర్ధన మఠాన్ని స్థాపించి దానికి పద్మపాదుణ్ణి పీఠాధిపతిని చేశారు. ఇలా దేశంలో నలువైపులా మఠాలను స్థాపించి దేశసమైక్యతను సాధించారు.

చివరగా ఆయన కాశ్మీరం చేరుకున్నారు. అక్కడ ప్రసిద్ధ పండితుడు అభినవగుప్తుణ్ణి వాదంలో ఓడించారు. అంతకు పూర్వం ఏ పండితునికి సాధ్యంకాని సర్వజ్ఞ పీఠాన్ని దక్షిణద్వారం ద్వారా

# శ్రీ ఆది శంకరుల దిగ్విజయ యాత్ర - కొన్ని మార్గస్థలాలు

1. కాలడి (కేరళ) – జన్మస్థలం
2. ఓంకారేశ్వర్ (గుజరాత్)
   – శ్రీ గోవింద భగవత్పాదులవారి వద్ద శిష్యరికం
3. వారణాసి – భాష్యరచన, పద్మపాదుల శిష్యరికం
4. బదరీనాథ్ – సూత్రభాష్యం
5. ప్రయాగ – కుమారిల భట్టు దర్శనం
6. మాహిష్మతి (బీహార్)
   – మండన మిశ్రుని ఓటమి–సురేశ్వరాచార్యులుగా శిష్యరికము.
7. శ్రీశైలం – సౌందర్యలహరి రచన
8. గోకర్ణం (కర్నాటక)
9. మూకాంబిక – హస్తామలకుని శిష్యరికం
10. శృంగేరి – శారదాపీఠం స్థాపన, తోటకాచార్యుల శిష్యరికం.
11. కాలడి – మాతృమూర్తికి అంత్యక్రియలు
12. రామేశ్వరం – దిగ్విజయ యాత్ర ప్రారంభం
13. కాంచీపురం – కామాక్షీదేవి దర్శనం
14. తిరుపతి –
15. ద్వారక – శంకరమఠం స్థాపన
16. ఉజ్జయిని – మహాకాలేశ్వరుని దర్శనం
17. కామరూప (అస్సాం) – నవగుప్తునితో సంవాదము
18. పూరీ (ఒరిస్సా) – మఠం స్థాపన
19. కాశ్మీర్ – సర్వజ్ఞపీఠం అధిరోహణ
20. బదరీనాథ్
21. కేదారనాథ్ – అంతర్ధానం

ప్రవేశించి అధిరోహించారు.

బదరిలో బదరీనాథుణ్ణి, కేదారంలో కేదారనాథుడిని సేవించుకొని, కైలాసం చేరి తన 32వ ఏట బ్రహ్మైక్యం చెందారు.

కొందరు చరిత్రకారులు ఆయన చివరగా కంచి చేరి అక్కడ సిద్ధి పొందారని వ్రాశారు. శంకర విజయం పేరుతో అనేక గ్రంథాలున్నాయి. కొన్ని విషయాలలో విబేధించినా, ఆయన కేరళలోని 'కాలటి'లో జన్మించారని, గోవిందపాదాచార్యులవారి వద్ద శిష్యరికం చేశారని, విరివిగా దేశాటనం చేసి అద్వైతానికి వ్యతిరేకమైన సిద్ధాంతాలనన్నింటిని సమన్వయించారని, నాలుగు మఠాలను స్థాపించారని, ప్రస్థాన త్రయానికి భాష్యం వ్రాశారని, మహామేధావి, కవి, జ్ఞాని అని, అతి పిన్న వయస్సులో సిద్ధిపొందారనే విషయాలపై ఏకాభిప్రాయం ఉంది.

శ్రీ ఆది శంకరులు భారతదేశాన్ని అనేక పర్యాయాలు పాదయాత్రలతో చుట్టివచ్చారని గాథలు ఉన్నాయి. మాధవ విద్యారణ్యస్వామి 15వ శతాబ్దంలో సంకలనం చేసిన శంకర దిగ్విజయం అనే గ్రంథాన్ని రామకృష్ణ మఠానికి చెందిన స్వామి తపస్యానంద అనువదించారు. దాని ఆధారంగా శంకరుల యాత్రా మార్గస్థలాలను కొన్నింటిని గుర్తించడం జరిగింది. ఆ చిత్రాన్ని ఇక్కడ అందించడం జరుగుతోంది.

# 2వ అధ్యాయము

# ఆలోచనా పద్ధతులు

## 1. గౌడపాదులు

అద్వైత సిద్ధాంతానికి అతి ప్రముఖులైన గౌడపాదులు క్రీ.శ. 800 ప్రాంతం వారని చరిత్రకారుల అభిప్రాయం. వీరు శ్రీశుకుల శిష్యులని అంటారు. గౌడపాదుల శిష్యులు గోవిందపాదులు, వారి శిష్యులు శ్రీ శంకరులు.

గౌడపాదులు అనేక రచనలు చేసినట్లు చెప్తున్నా, మాండూక్యోపనిషత్తు మీద వారి కారికలు అద్వైత సిద్ధాంతానికి పునాదులు వేశాయనడం నిర్వివాదాంశం. వీరి కాలంలో విశేష ప్రచారంలో నున్న బౌద్ధం వల్ల వీరు ప్రభావితమయ్యారని, అద్వైతానికి వ్యతిరేకంకాని బౌద్ధమత సిద్ధాంతాలను ఆయన అంగీకరించారని కొందరు విమర్శకుల అభిప్రాయం.

వారి మాండూక్యకారికలు నాలుగు భాగాలుగా విభజింపబడ్డాయి. మొదటిది ఆగమ ప్రకరణం. దీనిలో ఆయన మాండ్యూకోపనిషత్తుకు అర్థవివరణ చేసి, తాను ప్రతిపాదించిన పరమార్థతత్త్వం వేదవిహితమని, హేతుబద్ధమని నిరూపించడానికి ప్రయత్నం చేశారు. ఇందులోనే ఓంకార తత్త్వాన్ని కూడా నిరూపించారు. రెండవది వైతథ్యప్రకరణం. 'వితథ' అంటే వాస్తవ

స్వరూపం కంటే భిన్నంగా కనిపించడం. 'వైతథ్యము' అంటే అనిత్యమైనది అని అర్థం. దీని ద్వారా ప్రపంచ మిథ్యాత్వాన్ని ప్రతిపాదించారు. మూడవది అద్వైత ప్రకరణం. దీనిలో అద్వైత సిద్ధాంతం వివరించబడింది. నాల్గవది అలాతశాంత ప్రకరణం. వేద ప్రమాణాన్ని అంగీకరించని బౌద్ధం మొదలైన సిద్ధాంతాలు ఇందులో ఖండించబడ్డాయి.

వీరు అద్వైత సిద్ధాంతంలోని ప్రధానాంశాలయిన జీవబ్రహ్మైకత్వాన్ని, మాయావాదాన్ని, ప్రాతిభాసికసత్యం (super-imposed Truth), వ్యావహారిక సత్యం(emperical Truth), పారమార్థిక సత్యం(ultimate Truth), అనే సత్య విభజనను, మోక్షానికి జ్ఞానమొకటే మార్గమని ప్రతిపాదించారు.

వీరు కార్యం కారణంలో ఉండదనే న్యాయ-వైశేషికులు ప్రతిపాదించిన అసత్కార్యవాదాన్ని, కార్యం కారణంలో ఉంటుందనే సాంఖ్యుల సత్కార్యవాదాన్ని, బౌద్ధుల విజ్ఞాన వాదాన్ని ఖండించారు. సృష్టికి 'అజాత' వాదాన్ని ప్రవేశపెట్టారు. విశ్వం ఎప్పుడూ పుట్టలేదని, అది పరమాత్మలోనే ఉందని, దానిని వ్యక్తం చేయడం పరమాత్మ స్వభావం అన్నారు. 'మాయ' అంటే ఆయన దృష్టిలో పరమాత్మ యొక్క అద్భుత శక్తి.

జాగృత్, స్వప్న, సుషుప్త్యవస్థలు దాటిన తరువాత తురీయంలో ఆత్మానుభవం కలుగుతుందని ఆయన సిద్ధాంతం.

గౌడపాదుల శిష్యులు గోవిందపాదులు. వీరివద్ద శంకరులు అద్వైత సిద్ధాంతాన్ని అధ్యయనం చేశారు.

# 2. శంకర భగవత్పాదులు

శంకరులు అద్వైత సిద్ధాంతాన్ని తమ అనేక గ్రంథాల ద్వారా అతి విస్తృతంగా వివరించారు. ప్రస్థానత్రయం మీద, అంటే ఉపనిషత్తుల మీద, బ్రహ్మసూత్రాల మీద, భగవద్గీత మీద వారు అద్వైతపరంగా వ్యాఖ్యానాలు వ్రాశారు. వివేకచూడామణి, ఆత్మబోధ వంటి ప్రకరణ గ్రంథాలన్నీ అద్వైత పరంగా రచించారు. ఇంకా వారి స్తోత్రాలలోను, అపారమైన వారి ఇతర రచనలలోనూ ప్రతిచోట అద్వైత భావాలు గోచరిస్తూనే ఉంటాయి.

వారి ఈ రచనలలో నిక్షిప్తమైన అద్వైత సిద్ధాంతాన్ని క్రోడీకరించి ఒక క్రమమైన సిద్ధాంతంగా లేక దర్శనంగా రూపకల్పన చేసి, శ్రీ సాయణమాధవాచార్యులవారు వారి సర్వదర్శన సంగ్రహంలో లోకానికందించారు. ఇది సంస్కృత గ్రంథం. దీన్ని మహామహోపాధ్యాయ, పద్మశ్రీ ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారు తెలుగు భాషలోనికి అనువదించి ఆంధ్ర పాఠకులకు మహోపకారం చేశారు. ప్రస్తుతం తెలుగు భాషలో దర్శనాలమీద ఇంతకంటే ప్రామాణికమైన గ్రంథం మరొకటి లేదనే చెప్పవచ్చు. కాని ఈ గ్రంథం పండితులకే పరిమితం అని చెప్పక తప్పదు. ఈ మాధవాచార్యులే సన్న్యసించిన తరువాత విద్యారణ్యస్వామిగా ప్రసిద్ధులయ్యారు. వీరు రచించిన వేదాంత పంచదశిలో కూడ అద్వైత సిద్ధాంతం విపులంగా వివరించబడింది.

మహామహోపాధ్యాయ కపిస్థలం దేశికాచార్య స్వామివారు, వారి సిద్ధాంతత్రయ సంగ్రహంలో, అద్వైత సిద్ధాంత సారసంగ్రహాన్ని ఏక శ్లోక రూపంలో అందించారు.

## 3. శంకరుల రచనలు

శంకరులు గొప్ప వేదాంతిగానే గాక అసామాన్య రచయితగా, కవిగా కూడా ప్రసిద్ధులయ్యారు. అత్యల్ప జీవితకాలంలోనే అశేష రచనలు చేశారు. ప.పూ.స్వామి ముఖ్యానంద విరచిత 'శ్రీ శంకరాచార్య – జీవితము, సిద్ధాంతము' (అద్వైత అశ్రమ ప్రచురణ)లో శంకరుల రచనల సమగ్రజాబితా ఇచ్చారు. దాని ప్రకారం శంకరులు రచించిన భాష్య గ్రంథాలు 23, ప్రకరణ, ఉపదేశ గ్రంథాలు 54, స్తోత్ర–స్తుతి గ్రంథాలు 76, మొత్తం:153. కేవలం 32 సంవత్సరాల జీవితంలో, నిరంతర దేశాటనం చేస్తూ, వాద ప్రతివాదాలు చేస్తూ, అవైదికమైన ఇతర మతాలను ఖండిస్తూ, వేలమంది శిష్యులకు గురుత్వం వహిస్తూ, దేశం నలుమూలలా మఠాలను స్థాపించి వైదిక మత ప్రచారానికి, పటిష్ఠతకు కృషి చేస్తూ 153 గ్రంధాలు రచించి రాబోయే తరాలను ఉజ్జీవింప జేశారంటే ఆయన సాధించింది మానవాతీతంగానే కనిపిస్తూంది, గాని అది నిజం, మానవాళి అదృష్టం. ఇవి చదివి అర్థం చేసుకోవడానికి ఒక జీవిత కాలం చాలదు. కొన్ని ప్రసిద్ధ రచనలను మాత్రం పరామర్శిద్దాం.

దశోపనిషత్తుల మీద, బ్రహ్మసూత్రాల మీద, భగవద్గీత మీద మొదటి సారి సమగ్ర వ్యాఖ్య వ్రాసింది శంకరులే. ఈ వ్యాఖ్యలు అద్వైతపరంగా రచించారు. ఈ వ్యాఖ్యల ప్రాముఖ్యం ఇంతింతని చెప్పరానిది. శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రం మీద కూడా మొదట వ్యాఖ్య వ్రాసింది వారే.

ఇక ప్రకరణ గ్రంథాలలో వివేక చూడామణి మకుటాయమానమైనది. దీనిలో 582 శ్లోకాలున్నాయి. ముందుగా గురువు గోవిందపాదులకు నమస్కరించి గ్రంథారంభంలోనే చెప్పిన శ్లోకం ఈ విధంగా ఉంది.

**శ్లో॥ జన్తూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా**
**తస్మా ద్వైదికధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్**
**ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి**
**ర్ముక్తిర్నో శతకోటిజన్మసు కృతైః పుణ్యైర్వినా లభ్యతే**

జీవులలో నరుడుగా పుట్టడం దుర్లభం, అందులోనూ, పురుషుడుగా, విప్రుడుగా, వైదిక కర్మ మార్గానువర్తిగా, విద్యాంసుడుగా, ఆత్మానాత్మ వివేచనా పరుడుగా పుట్టడం మరీ దుర్లభం; జన్మజన్మాల సాధన వల్ల, పుణ్యఫలం వల్ల మాత్రమే ముక్తి సాధ్యం సుమా! అని ఆయన చెప్పవలసినదంతా మొదటి శ్లోకంలోనే క్లుప్తంగా చెప్పడంలోనే ఆయన ప్రతిభ కనిపిస్తుంది. మానవుడిగా పుట్టడం, మోక్షం మీద ఇచ్ఛ ఉండడం, మహాపురుషుల ఆశ్రయం అంటే సత్సంగం అనేవి భగవదత్తాలు మాత్రమే అని ఆయన చెప్పిన ఈ గ్రంథానికి 'వివేకచూడామణి' అనేపేరు సార్థక నామం అయింది.

తరువాత ఆయన ప్రకరణ గ్రంథాలలో, నిర్వాణషట్కం, సాధనపంచకం, మనీషాపంచకం ఆత్మబోధ, సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహం మొదలైనవి ప్రసిద్ధాలు.

ఇక ఆయన స్తోత్రాలలో శ్రీ కనకధారాస్తవం, శ్రీ లక్ష్మీనృసింహ కరావలంబస్తోత్రం, దక్షిణామూర్తి స్తోత్రం, జగన్నాథాష్టకం, గంగాస్తోత్రం ప్రసిద్ధాలు. భజగోవింద శ్లోకాలు విస్తృత ప్రచారంలో ఉన్నాయి. అవి శంకరులు, వారి శిష్య బృందం కలిసి చెప్పినవి.

ఇక ఆయన స్తోత్రసాహిత్యంలోనే అత్యంత ప్రాముఖ్యం పొందింది సౌన్దర్యలహరి. ఇందులో 100 శ్లోకాలున్నాయి. మొదటి 41 శ్లోకాలను ఆనందలహరి అని తరువాతి 59 శ్లోకాలను సౌందర్యలహరి అని అంటారు. ఆనందలహరిలో శ్రీవిద్య, చంద్రకళావిద్య, కుండలిని విద్య, శ్రీచక్రార్చన మొదలైనవి ఉన్నాయి. సౌందర్యలహరిలో దేవీ వైభవము, ఆ తల్లి మహిమలు, ఆమె కరుణాకటాక్షాలు వర్ణించబడ్డాయి. ఇందులో కొన్ని ఉపాసనలు, యంత్ర విశేషాలు ఉన్నందువల్ల మంత్ర శాస్త్రంలో ప్రవేశమున్నవారు మాత్రమే దీన్ని విశ్లేషించగలరు.

# 3వ అధ్యాయం
# అద్వైత సిద్ధాంతం
# (ప్రశ్నలు, సమాధానాల రూపంలో)

## 1. అద్వైతం

**1. ప్ర. అద్వైతం అంటే ఏమిటి?**

**స.** అద్వైతం అంటే 'రెండు లేనిది' అని అర్థం. 'జీవాత్మ', 'పరమాత్మ' అనే రెండు తత్త్వాలు లేవని, నిజానికి బ్రహ్మము ఒకేటే ఉందని ప్రతిపాదితమైన సిద్ధాంతం.

**2. ప్ర. అద్వైత సిద్ధాంతములోని ప్రధాన అంశాలు ఏమిటి?**

**స.** 1. బ్రహ్మమొక్కటే త్రికాలములందు ఉండే వస్తువు (సద్వస్తువు).

2. ఇతరములన్ని మాయా కల్పితాలే. అవి నిజమైనవి కావు (అసద్వస్తువులు).

3. బ్రహ్మం ఒక్కటే అయినా, ఉపాధి బేధం వల్ల జీవుడు, ఈశ్వరుడు అనే భేదాలు కన్పిస్తాయి.

4. పూర్వజన్మ వాసన విశేషాల వలన జీవులలో, ఈ పనిని నేను చేస్తున్నాను. (కర్తృత్వ భావము), దీనిని నేను అనుభవిస్తున్నాను (భోక్తృత్వ భావము) అనే భావాలు బయలుదేరి సంసారులు అవుతున్నారు.

5. దీనివలన జనన మరణ వలయంలో చిక్కుకుంటున్నారు.

6. ఇదంతా అజ్ఞానము వలన ఏర్పడుతోంది. ఈ అజ్ఞానం (భ్రాంతి) తొలగితేనే ముక్తి.

7. ఆ భ్రాంతి తొలగాలంటే జీవాత్మ, పరమాత్మల అభేదాన్ని బోధించే – అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి – వంటి వేదాంత వాక్యాలను శ్రవణం చేసి, వాటిని మననం చేసి, అద్వైత జ్ఞానాన్ని సముపార్జించాలి.

**3. ప్ర. అద్వైతాన్ని ఈ విధంగా చెప్పే శ్లోకం ఏమిటి?**

**శ్లోకం: బ్రహ్మైకం పరమార్థవత్, తదితరన్మాయామయత్వాన్మృషా**
**బ్రహ్మైవై క ముపాధిబింబిత, మతోజీవేశభావం గతమ్ ।**
**భ్రాంతిస్సంస్మృతిరస్య, తత్ప్రశమనం ముక్తిః, తదప్యాత్మనో**
**బ్రహ్మైక్యావగమాత్ శ్రుతి శ్రవణజాత్, ఇత్యాహురద్వైతినః ॥**

(శ్రీ కపిస్థలం దేశికాచార్య స్వామి వారు)

**4. ప్ర. అద్వైతాన్ని ఇంకా సంగ్రహంగా చెప్పే వాక్యం ఏమిటి?**

**స.** బ్రహ్మ సత్యం జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః.

బ్రహ్మం ఒక్కటే సత్యము. జగత్తు మిథ్య. జీవుడు బ్రహ్మమే. వేరొకటి కాదు.

**5. ప్ర. అద్వైతాన్ని బోధించే ఉపనిషత్తులలోని ప్రముఖమైన వాక్యాలు ఏవి?**

**స.** ఏకం సత్, విప్రా బహుధా వదంతి
ఏకమేవ అద్వితీయం బ్రహ్మ
అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి,
అయమాత్మా బ్రహ్మ మొ॥నవి.

**6. ప్ర. తత్త్వమసి అనే మహావాక్యం ఏ సందర్భంలో కనిపిస్తుంది?**

**స.** ఉద్దాలకుడు కుమారుడైన శ్వేతకేతువుకి ఉపదేశం చేసే సమయంలో పలికిన మహావాక్యం 'తత్త్వమసి'.

**7. ప్ర. తత్త్వమసి అంటే ఏమిటి?**

**స.** 'తత్' ఆ సద్వస్తువు, 'త్వం' నీవే, 'అసి' అయి ఉన్నావు అని అర్ధం.

**8. ప్ర. 'త్వం' అంటే ఏమిటి ?**

**స.** శ్వేతకేతువులో రెండు తత్త్వాలున్నాయి – ఒకటి జడమైనది, మరొకటి చైతన్యమైనది. ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి – ఈ పదునేడింటిని సూక్ష్మశరీరం అంటారు. ఇది స్వయం ప్రకాశం కాదు. దీనికి చేతన శక్తినిచ్చి క్రియాశీలకంగా చేసే ఒక చేతన శక్తి ఉంది – అదే జీవుడు. ఈ రెండు కలిపి శ్వేతకేతువు అవుతున్నాడు, ఇతను మనందరికి ప్రతీక.

మనలో ఉన్న జీవుడు శరీరంలో ఉన్నాడు గనుక ఈ ప్రపంచ వ్యవహారంలో పడి, అనేక కర్మలను చేస్తూ, దాని ప్రభావంలో

జనన మరణ సంసారంలో ఉన్నాడు, 'త్వం' అంటే అలాంటి జీవుడు.

**9. ప్ర. తత్ అంటే ఏమిటి?**

**స.** 'తత్' అంటే 'అది' అని అర్థం – ఈ సర్వనామం సద్వస్తువైన బ్రహ్మమును సూచిస్తుంది. ఈ బ్రహ్మమే శరీరాన్ని సృష్టించి దానిలో ప్రవేశించింది. దీన్ని తెలుసుకుంటే ఇంక తెలుసుకోవలసిందేమీ ఉండదు.

**10. ప్ర. అసి అంటే ఏమిటి?**

**స.** 'అసి' అయి ఉన్నావు. అంటే 'తత్' శబ్దం సూచించే ఆ సత్పదార్థమే అయి ఉన్నావు అని అర్థం. శరీరంలో ఉండి, దానితో తాదాత్మ్యం చెంది ఉన్న జీవుడు నిజానికి ఆ బ్రహ్మమే. అందుచేత జీవుడు, బ్రహ్మము ఒకటేగాని రెండు కావు.

**11. ప్ర. ఉపనిషత్తులను పరావిద్యగా ఎందుకు నిర్ణయించారు?**

**స.** పారమార్థిక సత్యాన్ని దర్శింపజేసేది పరావిద్య. అదే బ్రహ్మవిద్య. దానిని దర్శింపజేసేది ఉపనిషత్తులు కనుక వాటిని పరావిద్యగా పరిగణించారు.

## 2. బ్రహ్మము

**12. ప్ర. బ్రహ్మము యొక్క పర్యాయపదాలు ఏమిటి? దీనిని ఎట్లు వ్రాయాలి? ఎట్లు పలకాలి?**

**స.** బ్రహ్మ, పరబ్రహ్మ, ఆత్మ, పరమాత్మ – ఇవన్నీ బ్రహ్మము యొక్క పర్యాయపదాలు.

సంస్కృతభాషలో "బ్రహ్మ" అని వ్రాస్తారు, పలుకుతారు.

"బ్రహ్మే" అనే పదానికి త్రిమూర్తులలో ఒకరైన, సరస్వతీదేవికి భర్తయైన, చతుర్ముఖ బ్రహ్మ అని అర్థము.

**13. ప్ర. పరబ్రహ్మం యొక్క స్వరూప లక్షణములు** (essential characteristics) **ఏమిటి?**

**స. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ.**

1. బ్రహ్మము సత్యము (Truth)
2. జ్ఞానము (knowledge)
3. అనంతము (infinitude) అనేవి స్వరూప లక్షణములు.
4. శంకరులు బ్రహ్మమును ఈ క్రిందివిధంగా వర్ణిస్తూ ఉంటారు.
5. బ్రహ్మము నిత్య శుద్ధము (ever pure)
6. బ్రహ్మము నిత్య బుద్ధము (ever awakened)
7. బ్రహ్మము నిత్య ముక్తము (ever free)

**14. ప్ర. బ్రహ్మము యొక్క ఇంకా కొన్ని విశేషాలు ఏమిటి?**

**స.** 1. బ్రహ్మము నిరవయవము

2. నిర్గుణము

3. రూప రహితము

4. వికార రహితము

5. స్వగత, సజాతీయ, విజాతీయ భేద రహితము

**15. ప్ర. బ్రహ్మము యొక్క ఇంకా కొన్ని విశేషాలు ఏమిటి?**

**స.** 1. బ్రహ్మము అపరిచ్ఛిన్నము (unlimited)

2. అవిభాజ్యము (indivisible)

3. పరిపూర్ణము (full)

4. నిత్యము (eternal)

5. అమలినము (pure)

6. సూక్ష్మము (subtle)

**16. ప్ర. ద్వైతులు, విశిష్టాద్వైతులు ప్రతిపాదించిన బ్రహ్మము ఎటువంటిది?**

**స.** 1. సాకారము (ఆకారము కలది)

2. బ్రహ్మము సగుణము (గుణములతో కూడినది)

పరమాత్మ దివ్య మంగళ స్వరూపుడు, సకల సద్గుణ సమన్వితుడు.

**17.** ప్ర. **అద్వైతుల దృష్టిలో బ్రహ్మము ఎటువంటిది?**

**స.** బ్రహ్మము సగుణము, నిర్గుణము కూడా.

**18.** ప్ర. **శంకరులు ఏ విధమైన ఉపాసనను అంగీకరించారు?**

**స.** శంకరులు సగుణోపాసనను అంగీకరిస్తానే, నిర్గుణోపాసనను ప్రతిపాదించారు.

**19.** ప్ర. **ప్రపంచంలోని వస్తువులకు ఉన్న ఆరు పరిణామ, వికార లక్షణములు ఏమిటి?**

**స.** యాస్కుడు నిరుక్తంలో (1. 1. 3) ఇలా అన్నాడు.

**షడ్ భావ వికారా భవన్తీతి వారా&ష్యయణిః – జాయతే, అస్తి, విపరిణమతే, వర్ధతే, అపక్షీయతే, వినశ్యతీతి** – జన్మిస్తుంది, ఉంటుంది, పరిణామం చెందుతుంది, పెరుగుతుంది, క్షీణిస్తుంది, నశిస్తుంది – అనేవి ఆరు రకాల పరిణామ వికారాలు (మార్పులు).

**20.** ప్ర. **బ్రహ్మమునకు ఆరు రకాల వికారాలు ఉంటాయా?**

**స.** ఉండవు.

**21.** ప్ర. **భేదాలు ఎన్ని రకాలు? అవి ఏమిటి?**

**స.** భేదాలు మూడు రకాలు. అవి స్వగత, సజాతీయ, విజాతీయ భేదాలు.

**22.** **ప్ర. స్వగతభేదం అంటే ఏమిటి?**

**స.** చెట్టు ఒకటే అయినా, దానిలోని ఆకులను, పువ్వులను, పండ్లను వేరుగా చూస్తాము. ఇది స్వగత భేదం.

**23.** **ప్ర. సజాతీయభేదం అంటే ఏమిటి?**

**స.** చెట్లు అన్నీ "వృక్షాలు" అనే జాతికి చెందినవి అయినా మామిడి చెట్టును, చింతచెట్టును వేరుగా చూస్తాము. ఇది సజాతీయ భేదం.

**24.** **ప్ర. విజాతీయభేదం అంటే ఏమిటి?**

**స.** చెట్టు నుండి కొండను వేరుగా చూస్తాము. ఇది విజాతీయ భేదం.

**25.** **ప్ర. బ్రహ్మకు ఈ రకమైన భేదాలు ఉన్నాయా?**

**స.** ఈ భేదాలన్నీ వ్యావహారిక భేదాలు. బ్రహ్మ వ్యావహారిక లక్షణాలకు అతీతమైనది. అందుచేత ఈ భేదాలు బ్రహ్మకు లేవు.

## 3. బ్రహ్మము - జ్ఞాన స్వరూపము

**26.** **ప్ర. ఆత్మ, బ్రహ్మ – ఈ రెండు ఒకటేనా లేక వేరువేరా?**

**స.** ఈ రెండూ ఒకటే. అవి ఒకదానికొకటి పర్యాయపదాలు.

**27.** **ప్ర. బ్రహ్మం యొక్క స్వరూపము ఏమిటి?**

**స.** బ్రహ్మం జ్ఞాన స్వరూపము.

**28.** ప్ర. **ప్రవృత్తి అంటే ఏమిటి?**

**స.** మానవులలో ప్రతి వ్యక్తికి ఎంతో కొంత జ్ఞానము ఉంటుంది. ఆ జ్ఞానం ఆధారంగా ఏదైనా ఒక పనిని చేద్దామని సంకల్పిస్తాడు. దీనిని ప్రవృత్తి అంటారు.

**29.** ప్ర. **ప్రవృత్తికి వివరణ ఇవ్వండి?**

**స.** ప్రవృత్తి వ్యావహారికమైన పనులకు వర్తిస్తుంది. ఈ పనులకు మొదలు ఉంటుంది. మధ్య ఉంటుంది. చివర ఉంటుంది. ఇటువంటి పనులను అనిత్యములు అంటారు. అందుచేత ప్రవృత్తి అనిత్యములైన పనులకు వర్తిస్తుంది.

**30.** ప్ర. **ప్రవృత్తికి మూలము ఏమిటి?**

**స.** సర్వ ప్రవృత్తికి అహంకారము మూలము. అది దుఃఖ హేతువు. కోరికలతో కూడినది.

**31.** ప్ర. **బ్రహ్మకు ప్రవృత్తి ఉంటుందా?**

**స.** ఉండదు. ప్రవృత్తి, స్వభావముచే అనిత్యము. అందుచేత ఆత్మకు ప్రవృత్తి లేదని శంకరుల వాదము.

**32.** ప్ర. **ఆత్మకు ప్రవృత్తి ఎందుకు ఉండదు?**

**స.** ఆత్మ సంపాదించవలసినదిగాని, విసర్జించవలసినదిగాని ఏమీ లేదు. అందుచేత ఆత్మకు ప్రవృత్తి ఉండదు. (భారతీయ తత్త్వ శాస్త్రము – రాధాకృష్ణ పండితుడు, వాల్యూం 4, పేజి 298 అనువాదం – విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు – తి.తి.దే. ప్రచురణ.)

**33.** ప్ర. **కర్తృత్వ, భోక్తృత్వములు దేనిపై ఆధారపడతాయి?**

**స.** ఇవి ద్వైతభావంపై అధారపడతాయి.

**34.** ప్ర. **ఉపనిషద్ వాక్యములోని సత్యము అంటే ఏమిటి?**

**స.** సత్యం అంటే శాశ్వతమైనది, ఎప్పుడూ (మూడు కాలాల్లోను) ఉండేది. దీనికే సత్తా అని పేరు ఉంది. దీనినే సద్వస్తువు అని కూడా అంటారు.

**35.** ప్ర. **సత్తా, జ్ఞానము – వీటి సంబంధం ఏమిటి?**

**స.** సత్తా (సత్యం – అనగా, ఉండుట), జ్ఞానము – ఈ రెండును కలిసే ఉంటాయి. జ్ఞానము లేనిదే, సత్తా కాజాలదు. సత్తా లేనిదే జ్ఞానమే లేదు.

**36.** ప్ర. **ఆనందం అంటే ఏమిటి?**

**స.** సర్వ దుఃఖ విముక్తియే ఆనందము.

## 4. బ్రహ్మము - సత్యము

**37.** ప్ర. **బ్రహ్మము సత్యము అని ఎందుకు అంటారు?**

**స.** బ్రహ్మము కాలాతీతమైనది. దానికి భూత భవిష్యత్ వర్తమానాలు ఉండవు. అది మూడు కాలాల్లోను ఉంటుంది. అందుచేత బ్రహ్మము సత్యమైనది.

**38.** **ప్ర. సృష్టి లక్షణము ఏమిటి?**

**స.** సృష్టికి మొదలు, మధ్య, చివర ఉంటాయి. సృష్టి బ్రహ్మము నుండి ఆవిర్భవిస్తుంది. బ్రహ్మము చేత పోషించబడుతుంది. బ్రహ్మములోనే లయమవుతుంది. అందుచేత సృష్టి అసత్యమైనది.

**39.** **ప్ర. అసత్యాన్ని గౌడపాదుల వారు ఏ విధంగా వర్ణించారు? లేక అసత్యం అంటే ఏమిటి?**

స. **ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా**
**వితథైః సదృశాః సన్తోఽవితథా ఇవ లక్షితాః**

ఏది ఆద్యంతాలలో లేదో అది మధ్యలో ఉన్నా లేనట్లే.దానిని అసత్యం, లేక మిథ్య అని అంటారు.

**40.** **ప్ర. నామరూపాత్మకమైన ఈ ప్రపంచం ఉన్నట్లు మనకు ఎవరి మూలంగా కనిపిస్తోంది?**

**స.** నామరూపాత్మమైన ఈ ప్రపంచం ఉన్నట్లుగా మనకు మాయా శక్తి వల్ల అనిపిస్తోంది.

**41.** **ప్ర. మాయయొక్క ప్రధాన లక్షణాలు ఏమిటి?**

**స.** మాయకు రెండు ప్రధానమైన లక్షణాలు ఉన్నాయి.

1. ఆవరణ శక్తి (veiling power)
2. విక్షేప శక్తి (power of projection)

**42.** **ప్ర. మాయ ఆవరణ శక్తి ద్వారా ఏమి చేస్తోంది?**

స. మాయ ఆవరణ శక్తి ద్వారా సత్యాన్ని కప్పి పుచ్చుతుంది.

**43. ప్ర. మాయ విక్షేప శక్తి ద్వారా ఏమి చేస్తోంది?**

స. మాయ విక్షేప శక్తి ద్వారా అసత్యమైనదాన్ని మనకు కనిపింపజేసి, అదే సత్యమని నమ్మిస్తుంది.

**44. ప్ర. ఈ రెండు శక్తులను ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారు ఏ విధంగా వివరించారు?**

స. ''అనాదియైన అజ్ఞానంచేత బ్రహ్మస్వరూపం కప్పివేయబడుతుంది. జగత్తు ప్రదర్శింపబడుతుంది. ఈ విధంగా అజ్ఞానానికి ఆవరణశక్తి, విక్షేపశక్తి (లేనిదానిని చూపించే శక్తి) అను రెండు శక్తులుంటాయి. శుక్తరజతాది స్థలాలలో కూడా ఉన్న శుక్త్యాదికం కప్పివేయబడుతుంది, లేని రజతాదికం చూపబడుతుంది. ఆవరణ శక్తి ప్రధానంగా ఉన్న అజ్ఞానం అవిద్య అని, విక్షేప శక్తి ప్రధానమైనది మాయ అని చెప్పబడుతుంది. ఈ విధంగా పేర్లలో భేదమే తప్ప వస్తువులో భేదం లేదని అర్థం (సర్వదర్శన సంగ్రహః – పే. 729).

**45. ప్ర. అసత్యమైనదానిని సత్యమైనదిగా అనుకొనడాన్ని ఏమంటారు? లేక, లేనిదానిని ఉన్నట్లుగా అనుకొనడాన్ని ఏమంటారు?**

స. దీనిని భ్రమ లేక భ్రాంతి లేక అధ్యాస అంటారు.

**46. ప్ర. భ్రాంతికి ఉదాహరణలు ఇవ్వండి?**

**స.** 1. ఎండలో ఉన్న ముత్యపు చిప్ప (శుక్తి) వెండి (రజతం) వలె ప్రకాశిస్తూ ఉంటుంది. అక్కడ నిజానికి ఉన్నది ముత్యపు చిప్ప మాత్రమే. అది సత్యమైన విషయం. కాని అక్కడ కనిపించిన వెండి అసత్యమైన విషయం. దీనినే శుక్తిమీద రజతం అధ్యాస అని అంటారు. అందుచేత వెండి నిజం కాదు.

2. మరీచిక లేక ఎండమావి. నీళ్ళే లేనిచోట్ల నీళ్ళు ఉన్నట్లు కనిపిస్తాయి. ఎండమావిలో నీళ్ళు ఉన్నట్లుగా భ్రమపడతాం.

3. సర్పరజ్జు – రజ్జువు అంటే త్రాడు. త్రాడు, చీకట్లో పాము వలె అనిపిస్తుంది.

**47. ప్ర. బ్రహ్మమునకు ఉన్న ఇంకొక ప్రధాన లక్షణము ఏమిటి?**

**స.** బ్రహ్మమునకు తనను తానే సృష్టించుకొనే శక్తి ఉంది. దీనిని స్వయంస్థితి అంటారు.

**48. ప్ర. బ్రహ్మముయొక్క అవిభాజ్య లక్షణాన్ని వివరించండి?**

**స.** బ్రహ్మము జీవులందరిలోనే కాక విశ్వమంతా వ్యాపించి ఉంటుంది. ఇది అన్నింటిలోను ఒకే తత్త్వంగా వ్యాపించి ఉంటుంది. కనుక దానిలో ముక్కలుగా విడిపోయే

స్వభావం (పృథక్త్వ లక్షణం) లేదు. అది తప్ప మరొకటి లేని తత్త్వం అది.

**49. ప్ర. బ్రహ్మమునకు ఉన్న లక్షణాలను ఏ విధంగా వ్యక్తం చేస్తారు?**

**స.** బ్రహ్మమునకు ఉన్న లక్షణాలు –

1. సత్ (existence)
2. చిత్ (consciousness)
3. ఆనంద (bliss)

ఇవి ఆయన స్వరూప లక్షణాలే, అవి ఆయన గుణాలు కావు.

**50. ప్ర. బ్రహ్మమును ఇంకా ఏమని వర్ణించారు?**

**స. "సూక్ష్మశ్చ, మహాంతశ్చ, ప్రత్యగాత్మ భూతశ్చ"**

సూక్ష్మమైనవాడు, అత్యంత శక్తివంతుడు, ప్రత్యగాత్మగా అన్ని జీవులలోను ఉండేవాడు అని వేదాంతులు వర్ణించారు.

**51. ప్ర. ఇన్ని శక్తులు ఉన్న పరబ్రహ్మ మనకు ఎందుకు కనిపించట్లేదు? దీనికి గౌడపాదుల వారు ఇచ్చిన సమాధానము ఏమిటి?**

**స. కల్పయత్యాత్మ నాఽఽత్మానమాత్మాదేవః స్వమాయయా,**
**స ఏవ బుధ్యతే భేదానితి వేదాన్తనిశ్చయః**

(వైతథ్య ప్రకరణం – 12)

స్వయంగా పరమాత్మే తన అధీనంలోని మాయచేత తనను తానే ఈ నామరూప ప్రపంచంలో కప్పివేసుకొని మనకు కనబడడం లేదు.

**52. ప్ర. కనిపిస్తున్న ఈ విశ్వానికి ఆధారం ఎవరు?**

**స.** కనిపిస్తున్న ఈ విశ్వానికి బ్రహ్మమే ఆధారం.

**53. ప్ర. సత్త్వ రజస్తమో గుణాలు పరబ్రహ్మకు ఉంటాయా?**

**స.** సత్త్వ రజస్తమో గుణాలు ప్రకృతిలో ఉంటాయి. బ్రహ్మము నిర్గుణుడు. అందుచేత పరబ్రహ్మకు ఈ గుణాలు ఉండవు. అంతేగాక గుణాలు వస్తు లక్షణాలు. బ్రహ్మము వస్తువు కాదు. జ్ఞానము ఆయన స్వరూపమేగాని గుణము కాదు.

**54. ప్ర. అతిశయ శక్తి అంటే ఏమిటి?**

**స.** మట్టి కారణం, కుండ కార్యం. ఈ కార్యం బహిర్గతం అవడానికి ముందు కారణంలో ఉంది, మానవ ప్రయత్నం వల్ల జరిగేది కేవలం కారణాన్ని కార్యంగా మలచడమే. ఇలా కారణం నుండి కార్యం ఉద్భవించడం, మళ్లీ ఆ కార్యం కారణంలో కలవడం నిరంతరం జరిగే ప్రక్రియ. కుండ ఎప్పటికైనా మళ్ళీ మట్టిగా మారవలసిందే. అయితే ఈ కారణానికి కార్యంగా మారే నిగూఢమైన శక్తి ఉంది. దాన్ని 'అతిశయశక్తి' అన్నారు శంకరులు.

## 5. జగన్మిథ్య

**55. ప్ర. జ్ఞానాన్ని సంపాదించడానికి వినియోగించే సాధనాన్ని ఏమంటారు?**

**స.** జ్ఞానాన్ని సంపాదించడానికి వినియోగించే సాధనాన్ని ప్రమాణం అంటారు.

**56. ప్ర. ప్రమాణాలకు కొన్ని ఉదాహరణలు తెలుపండి?**

**స.** ప్రత్యక్ష ప్రమాణం, అనుమాన ప్రమాణం, శబ్ద ప్రమాణం, సాదృశ్య ప్రమాణం మొ॥నవి.

**57. ప్ర. అన్ని ప్రమాణాలలోకి శ్రేష్ఠమైనది ఏది?**

**స.** అన్ని ప్రమాణాలలోకి శ్రేష్ఠమైనది ప్రత్యక్ష ప్రమాణం. కంటికి కనిపించే విషయాన్ని ప్రత్యక్ష ప్రమాణం ద్వారా తెలుసుకున్నాము అంటారు.

**58. ప్ర. అద్వైత సిద్ధాంతంలో సత్యాన్ని ఎన్ని రకాలుగా వర్గీకరించారు?**

**స.** సత్యాన్ని మూడు విధాలుగా విభజించారు. ప్రాతిభాసిక సత్యం, వ్యావహారిక సత్యం, పారమార్థిక సత్యం అని.

**59. ప్ర. ప్రాతిభాసిక సత్యం అంటే ఏమిటి?**

**స.** ప్రాతిభాసిక సత్యం అంటే భ్రాంతి కలగడం మూలంగా, ఒక వస్తువు వేరొక వస్తువులా అనిపించి ఆవిధంగా

ప్రవర్తించడం జరుగుతుంది. దీనినే అసలు వస్తువుపై వేరొక వస్తువును ఆరోపించడం అంటారు. ఆ భ్రాంతి ఉన్నంతసేపు, ఆరోపించబడిన వేరొక వస్తువు యొక్క జ్ఞానమే ఉంటుంది. దీనినే 'ప్రాతిభాసికజ్ఞానం' లేక 'ప్రాతిభాసిక సత్యం' అని అంటారు. కొన్ని పరిస్థితుల మూలంగా, ఆ భ్రాంతి తొలగిన తరువాత ఇంతవరకు కనిపించిన ఆ వేరొక వస్తువు నిజంకాదు, అసలు వస్తువు ఇది అనే జ్ఞానం ఏర్పడుతుంది. ఉదాహరణకు తాడుమీద పాము ఆరోపితమవ్వడం. పాము ఒక మిథ్య. దానిమీద దీపపుకాంతి ప్రసరింపజేస్తే ఆ మిథ్య తొలగిపోయి సత్యమైన తాడు కనిపిస్తుంది. ఇలా ఆభాసను మనం తొలగించుకొని సత్యాన్ని అవగతం చేసుకోవచ్చు. ఇది సులభమే.

**60. ప్ర. వ్యావహారిక సత్యం అంటే ఏమిటి?**

**స.** ఇంద్రియాల ద్వారా మనం గ్రహిస్తున్న జ్ఞానాలన్నీ వ్యావహారిక ప్రపంచానికి చెందినవే. వాటిని సత్యముగానే భావించి, మన వ్యవహారాలను నడుపుకుంటాం. దీన్ని 'వ్యావహారిక సత్యం' అంటారు.

**61. ప్ర. పారమార్థిక సత్యం అంటే ఏమిటి?**

**స.** ఇంద్రియగోచరం కాకుండా ఉండి, "ఈ జగత్తును వ్యక్తపరిచే మూలకారణమైన పరబ్రహ్మము మాత్రమే సత్యము" అనే జ్ఞానాన్ని 'పారమార్థిక సత్యము' అంటారు.

అయితే, వ్యావహారిక సత్యము అయిన ఈ ప్రపంచము లేక జగత్తు బ్రహ్మము మీద ఆరోపితమయ్యింది. ఇది కూడా ఒక రకమైన భ్రాంతియే. ఈ భ్రాంతి ఉన్నంతసేపు, ప్రపంచము నిజమే అనే భావన మనలో కలుగుతునే ఉంటుంది. అయితే ఈ భ్రాంతి తొలగే పరిస్థితులు ఏర్పడినప్పుడు, మనం ఇంతవరకు నిజమని భావించిన ఈ ప్రపంచము నిజము కాదని, పరబ్రహ్మము మాత్రమే నిజమని తెలుస్తుంది. అంటే జగత్తు మిథ్య అని తెలిసివస్తుంది. దీనినే పారమార్థిక సత్యాన్ని దర్శించడం అంటారు.

**62.** ప్ర. **ఈ ప్రపంచాన్ని, లేక విశ్వాన్ని ఎట్లా తెలుసుకోగల్గుతున్నాము?**

**స.** ఈ ప్రపంచాన్ని, లేక విశ్వాన్ని ప్రత్యక్ష ప్రమాణం ద్వారా తెలుసుకోగల్గుతున్నాము.

**63.** ప్ర. **విశ్వము సత్యమా? లేక, అసత్యమా?**

**స.** విశ్వము ఇంద్రియాల ద్వారా ప్రత్యక్ష ప్రమాణం చేత తెలుసుకోబడుతోంది. అందుచేత అది వ్యావహారిక సత్యమే. వ్యావహారిక సత్యాన్ని వ్యావహారికంగానే భావించి ప్రవర్తించాలి.

కాని, తాత్త్వికంగా చూస్తే విశ్వం అసత్యమే. ఏది ఆదిలోను అంతంలోను లేకుండా మధ్య మాత్రమే గోచరిస్తుందో అది అసత్యం లేక మిథ్య. విశ్వానికి అవిర్భావం అనేది ఉంది –

అంటే అంతకు ముందు లేదు. దానికి లయం కూడ ఉంది – అంటే ప్రళయం తరువాత ఉండదు. మధ్యలో మాత్రమే ఉంటుంది. అంతేకాకుండా దీనికి నిత్య పరిణామ శీలం కూడా ఉంది – అంటే ఎల్లప్పుడూ మార్పు చెందుతూ ఉంటుంది. అందుచేత అది తాత్త్వికంగా చూసినపుడు అసత్యమే!

**64. ప్ర. ప్రత్యక్షంగా కనిపించే విశ్వాన్ని మిథ్య అని శంకరులు ఎందుకు అన్నారు?**

**స.** శంకరులు సరిగానే చెప్పారు. వ్యావహారిక సత్యాన్ని మరియు, పారమార్థిక సత్యాన్ని చక్కగానే నిర్వచించారు. వారి దృష్టిలో ఈ విశ్వం వ్యావహారికంగా సత్యమే. తాత్త్వికంగా అసత్యము.

కాని మనం వారి తాత్విక సిద్ధాంతాన్ని, వ్యావహారిక సత్యాన్ని కలగాపులగం చేసి మాట్లాడుతున్నాము. ప్రపంచాన్ని వ్యావహారికంగా కూడా అసత్యం అని శంకరులు అన్నారని మనం తప్పుగా అర్థం చేసుకుంటున్నాం. దీనివల్ల వారి సిద్ధాంతాన్ని గురించి దురభిప్రాయాలు, అపోహలు ఏర్పడుతున్నాయి.

**65. ప్ర. జిజ్ఞాస అంటే ఏమిటి?**

**స. "జ్ఞాతుం ఇచ్ఛా జిజ్ఞాసా"**

తెలుసుకోవాలనే కోరికను జిజ్ఞాస అంటారు.

**66.** **ప్ర. దిధ్యాస, నిదిధ్యాస అంటే ఏమిటి?**

**స. "ధ్యాతుం ఇచ్ఛా దిధ్యాసా"**

**"నితాంతం ధ్యాతుం ఇచ్ఛా నిదిధ్యాసా"**

ధ్యానం చేయాలనే కోరికను దిధ్యాస అంటారు.

తీవ్రంగా (నితాంతం) ధ్యానం చేయాలనే కోరికను నిదిధ్యాస అంటారు.

**67.** **ప్ర. పారమార్థిక సత్యాన్ని దర్శించడం ఎలా?**

**స.** ఇది అంత సులభమైనది కాదు. దీనికి యాజ్ఞవల్క్యుడు చెప్పిన ఈ ఉపదేశమే శిరోధార్యం :

"ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోత్రవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయి!" "మైత్రేయి ! ఆత్మను అనుభవ పూర్వకంగానే తెలుసుకోవాలి. దానికి ముందుగా గురువు నాశ్రయించి శ్రుతులలో చెప్పిన సత్యస్వరూపం మీద ఉపదేశాన్ని అవగతం చేసుకోవాలి, దానిని మననం చేసుకోవాలి, తరువాత దానిని తీవ్రంగా ధ్యానం చేయాలి." ఇలా వ్యావహారిక సత్యాన్ని దాటి పారమార్థిక సత్యాన్ని దర్శించవచ్చు. దీన్ని అపవాదం అంటారు. ఇదీ సంగ్రహంగా శంకరుల జగన్మిథ్యా వాదంలోని ఆంతర్యం.

## 6. బ్రహ్మము - ఈశ్వరుడు - జీవుడు

**68. ప్ర. అద్వైత సిద్ధాంతంలో ఒక ప్రధానమైన అంశం ఏమిటి?**

**స.** అద్వైత సిద్ధాంతంలో ఒక ప్రధానమైన అంశం 'జీవాత్మ'.

**69. ప్ర. జీవుడు, బ్రహ్మము ఒక్కటే అనే విషయాన్ని జీవుడు ఎందుకు గుర్తించలేక పోతున్నాడు?**

**స.** జీవుడు శరీరంతో తాదాత్మ్యం చెందడం మూలంగా ఒక్కటే అనే విషయాన్ని తెలుసుకోలేకపోతున్నాడు. దీన్నే ఉపాధి దోషం అంటారు.

**70. ప్ర. జీవుడు, బ్రహ్మము ఒక్కటే అనే విషయాన్ని తెలియజేసే ఉపనిషత్తులోని వాక్యం ఏమిటి?**

**స.** ఈ విషయాన్ని ముండకోపనిషత్తు ఇలా వివరించింది.

**తదేతత్ సత్యం యథా సుదీప్తాత్ పావకాద్**
**విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః ।**
**తథాక్షరాద్ వివిధాః సోమ్య భావాః**
**ప్రజాయంతే తత్ర చైవాపి యంతి ॥**

"ఓ సౌమ్యుడా ! ప్రజ్వలిస్తున్న అగ్నిజ్వాల నుండి నిప్పురవ్వలు ఎలా ఎగసిపడుతున్నాయో అలాగే బ్రహ్మము నుండి నానావిధ జీవజాలం ఉద్భవిస్తుంది. ఆ జీవజాలంలో అంతర్నిహితంగా ఉన్నది బ్రహ్మమే. మళ్ళీ ఆ జీవజాలం బ్రహ్మంలోనే లయం అవుతుంది. ప్రజ్వలించే అగ్ని,

అందులోనుండి బయటకు వచ్చిన నిప్పురవ్వలు – రెండూ ఒకటే – రెండూ కాంతిమంతంగానే ఉంటాయి. దహనశక్తి కలిగి ఉంటాయి. వేరుగా కనిపిస్తున్నా అగ్ని నుండి ఉద్భవించిన నిప్పురవ్వలు అగ్నికంటే వేరు కాదు. అలాగే బ్రహ్మము నుండి ప్రభవించిన జీవులు, బ్రహ్మము ఒకటే గాని రెండు వేరు వేరు తత్త్వాలు కాదు" అని ఉపదేశం.

**71. ప్ర. ఆత్మ, జీవాత్మ, పరమాత్మ అనే పదాల విషయంలో శంకరుల అభిప్రాయ ఏమిటి?**

**స.** శంకరులు ఆత్మను (బ్రహ్మం) జీవాత్మ పరమాత్మ అనే రెండు విధాలుగా చూడనేలేదు. ఆయన దృష్టిలో 'ఆత్మ' అంటే అనన్యమైన బ్రహ్మము మాత్రమేనని అర్థం.

**72. ప్ర. ఆత్మ, జీవాత్మ, పరమాత్మ అనే పదాల విషయంలో శంకరుల అభిప్రాయాన్ని రాధాకృష్ణ పండితులు ఎట్లా విశ్లేషించారు?**

**స.** "... శంకరుని యాత్మయనగా జీవాత్మయని పొరపడరాదు. అనాత్మ విముక్తమైనట్టియో లేక అనాత్మకు వ్యతిరేకమైనట్టియో జీవాత్మాస్తిత్వమును శంకరుడు స్థాపింపబూనుకున్నచో నాతడు పరిచ్ఛిన్న విషయ రహితములగు ననేక జీవాత్మలనో, లేకున్న శుష్కమైన విశ్వాత్మ భావమునో గాంచియుండును. శంకరుని ఆత్మ జీవాత్మయుగాదు, తత్సముచ్చయముకాదు. జీవాత్మ జాలమంతయు బరమాత్మపై నాధారపడియున్నది.

......... అందు ద్వైతములేదు అది (ఆత్మ) యందరిలో సమానముగా నున్నది. అందెట్టి పృథక్త్వమున కవకాశము లేదు; విశ్వజీవ భాగస్వాముల మగుట చేతనే మనము జీవించుచున్నాము."

**73. ప్ర. ఈ భావాన్ని శంకరులు తమ ఆత్మబోధలో ఏ విధంగా వివరించారు?**

**స.** ఈ భావాన్ని శంకరులు "ఆత్మబోధ"లో పదవ శ్లోకంలో ఇలా వివరించారు :

**యథాకాశో హృషీకేశ ః నానోపాధిగతో విభుః ।**
**తత్ భేదాత్ భిన్నవద్భాతి తన్నాశే కేవలో భవేత్ ॥**

నిజానికి ఆకాశం (space) ఒకటే. అది అవిభాజ్యమైనది (indivisible). కాని కుండలో ఉండే ఆకాశాన్ని మనం ఘటాకాశం అంటున్నాం. దానికి కారణం ఉపాధి (limiting adjunct). ఇలా బ్రహ్మము ఏ ఉపాధిలో ఉంటే ఆ ఉపాధికి పరిమితంచేసి చూస్తున్నాం. కాని కుండపగిలిపోతే అంతా మహాకాశమే కదా ! ఇక్కడ ద్వైతం ఎక్కడ ఉంది? హృషీక + ఈశః, ఇంద్రియాలను నియంత్రించి వాటిని అంతర్ముఖం చేసిన సాధకుడు ఉపాధిదోషాన్ని దాటి బ్రహ్మమే అయిపోతున్నాడు.

**74. ప్ర. బ్రహ్మం నిష్క్రియుడు కదా ! మరి ఆయనకు ఈ సృష్టిని చేసి జీవులలో ప్రవేశించవలసిన అవసరం ఏమి వచ్చింది?**

**స.** ఈ సృష్టికి కారణం మాయ యొక్క ప్రేరణ అని వేదాంతం సమాధానం.

**75. ప్ర. మాయ ఎన్ని రకాలు?**

**స.** మాయ రెండు రకాలు, ఒకటి శుద్ధసత్త్వ ప్రధానమైనది, రెండవది మలినసత్త్వ ప్రధానమైనది.

**76. ప్ర. ఈశ్వరుడు, జీవుడు అనే పదాలను వివరించండి?**

**స.** బ్రహ్మము శుద్ధసత్త్వ ప్రధానమైన మాయలో ప్రతిబింబించి ఈశ్వరుడవుతున్నాడు. మలిన సత్త్వ ప్రధానమైన మాయనాశ్రయించి (దీన్ని అవిద్య అంటారు) జీవరూపంలో శరీరంలో ప్రవేశిస్తున్నాడు.

**77. ప్ర. జీవునికి, బ్రహ్మానికి అభేదస్థితి ఎట్లా వస్తుంది?**

**స.** ఈశ్వరుడు, జీవుడు – వీటిలోని రెండు రకాల మాయలను ప్రక్కన బెడితే మిగిలేది శుద్ధసత్త్వమైన బ్రహ్మమే. ఇలా ఉపాధి భేదాన్ని ప్రక్కన బెడితే బ్రహ్మానికి (సద్వస్తువునకు), జీవునికి చైతన్యాంశంలో అభేద స్థితి ఏర్పడుతుంది.

**78. ప్ర. మాయను ఇంకా ఏ విధంగా వర్ణిస్తారు?**

**స.** కొందరు అవిద్య (మాయ) రెండు రకాలని, అవి కారణావిద్య, కార్యావిద్య అని, అందులో మొదటి దానిలో ప్రతిబింబించిన వాడు ఈశ్వరుడని, రెండవ దానిలో ప్రతిబింబించిన వాడు జీవుడని, అంటారు.

**79.** ప్ర. **ఈశ్వరునికి, జీవునికి ఉన్న అనుబంధం ఎటువంటిది?**

**స.** ఈశ్వరుడొక్కడే, జీవులు అనేకులు. జీవులకన్నా ఈశ్వరుడు ఉత్కృష్టుడు. జీవునికి ఈశ్వరుడు పూజనీయుడు, ఆశ్రయించిన జీవుల కోరికలను తీరుస్తాడు. ఇక్కడ నుండి సగుణారాధన ప్రారంభం అవుతుంది.

**80.** ప్ర. **ఉపాదాన కారణం అంటే ఏమిటి?**

**స.** ఒక వస్తువును తయారు చేయడానికి కావలసిన ముడి సరుకులను ఉపాదాన కారణం అంటారు. ఉదాహరణకు కుండకు మట్టి ఉపాదాన కారణం.

**81.** ప్ర. **నిమిత్త కారణం అంటే ఏమిటి?**

**స.** ఒక వస్తువును చేయడానికి కావలసిన సాధనాలను, ఆ వస్తువును చేసే వ్యక్తులను నిమిత్త కారణం అంటారు.

**82.** ప్ర. **విశ్వానికి ఉపాదాన కారణం ఏమిటి? నిమిత్త కారణం ఏమిటి?**

**స.** విశ్వానికి ఉపాదానకారణం, నిమిత్తకారణం రెండూ కూడా బ్రహ్మమే.

**83.** ప్ర. దేనిని నిర్గుణ బ్రహ్మం అంటారు? దేనిని సగుణ బ్రహ్మం **అంటారు?**

**స.** బ్రహ్మాన్ని నిరుపాధిక లేక నిర్గుణ బ్రహ్మమని, అంటే ప్రాకృతిక

లక్షణాలు లేని బ్రహ్మమని, ఈశ్వరుణ్ణి సోపాధిక లేక సగుణబ్రహ్మమని, అంటే ప్రాకృతిక లక్షణాలన్నీ గల బ్రహ్మమని అంటారు.

**84. ప్ర. బ్రహ్మము - మాయ అని రెండు ఉన్నాయని చెప్పడం, బ్రహ్మము తప్ప మరొకటి లేదని చెప్పే అద్వైత సిద్ధాంతానికి వ్యతిరేకం కాదా?**

**స.** కాదు. మాయ బ్రహ్మములోని విడదీయరాని శక్తి,. బ్రహ్మము తన మాయాశక్తితో (ఈ శక్తి త్రిగుణాత్మకమైనది) విశ్వాన్ని సృష్టించి, అందులో అంతర్వర్తిగా (immanent) ఉన్నప్పుడు ఈశ్వరుడని, విశ్వాన్ని దాటి సర్వోత్కృష్టంగా (transcen-dental) ఉన్నప్పుడు, పరబ్రహ్మమని పిలువబడుతున్నాడు. ఈశ్వరుడు విశ్వానికి అంతర్యామి, శరణాగతి చేసి ఆయన్ని ప్రేమతో మనం చేరుకుని ఆయన దయకు పాత్రులం కాగలం. ఇది సాకారబ్రహ్మోపాసన, దీన్ని శంకరులు సమర్థించారు. ఈ విధంగా బ్రహ్మము, మాయ అనే రెండు పదాలను వాడినా, మాయ బ్రహ్మలోని అంతర్భాగమే కనుక, "ఉన్నది ఒక్కటే " అందుచేత బ్రహ్మము, మాయ అనే రెండు పదాలను ప్రయోగించడము అద్వైత సిద్ధాంతానికి వ్యతిరేకం కాదు.

**85. ప్ర. సాకార తత్త్వాన్ని ఏ విధంగా దాటి నిర్గుణ తత్త్వానికి జేరవచ్చు?**

**స.** అనేక జన్మలలోని తపస్సమాధి నిష్ఠల ద్వారా సాకార తత్త్వాన్ని దాటి నిర్గుణ తత్త్వానికి జేరవచ్చు.

**86. ప్ర. సాధనపంచకంలోని శంకరుల ఉపదేశం ఏమిటి?**

**స.** శంకరులు ఇలా ఉపదేశించారు:

**శ్లో : వాక్యార్థశ్చ విచార్యతాం శ్రుతిశిరః పక్షః సమాశ్రీయతాం
దుస్తర్కాత్సువిరమ్యతాం శ్రుతిమతస్తర్కోనుసంధీయతామ్ ।
బ్రహ్మాస్మీతి విభావ్యతాం అహరహర్గర్వః పరిత్యజ్యతాం
దేహోఽహంమతిరురఝ్యతాం బుధజనైః
వాదఃపరిత్యజ్యతామ్॥**

**స.** మహావాక్యాల అర్థం తెలుసుకొని వాటి మీద మననం చెయ్యాలి. వితండవాదాలకు స్వస్తి చెప్పి వేద ప్రతిపాదిత తర్కాన్ని అనుసరించాలి. మనస్సును బ్రహ్మమయంచేసి, గర్వాన్ని, దేహాభిమానాన్ని వదలిపెట్టి సాధన చెయ్యాలని సాధన పంచకంలో శంకరులు చెప్పారు.

**87. ప్ర. శంకరులు అంగీకరించినది ఏమిటి? తిరస్కరించినది ఏమిటి?**

**స.** శంకరులు సాకార బ్రహ్మాన్ని, నిరాకార బ్రహ్మాన్ని ఒకటిగానే చూశారు. ఆయన ఒప్పుకోనిదల్లా నిరాకార బ్రహ్మాన్ని తిరస్కరించే సిద్ధాంతాలను మాత్రమే.

**88. ప్ర. భౌతికవాదం అంటే ఏమిటి? దానిపై శంకరుల అభిప్రాయం ఏమిటి?**

**స.** మన కంటికి కనిపించేదంతా నిజమని, ఏది కనిపించదో అది అసత్యమని, దానికి అస్తిత్వమే లేదని భౌతిక వాదులంటారు. దీనిని శంకరులు నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. దృగ్గోచరమైనదంతా నిజం కాదు, కనిపించనిది లేదనుకోవడం పొరపాటు. కనిపించేదంతా నిజమైతే స్వప్నజగత్తు కూడా నిజం కావాలి కదా ? జగత్తుకు ఆధారం బ్రహ్మపదార్థం. అది ఇంద్రియగోచరం కాదు. దాన్ని తెలుసుకోవడమే బ్రహ్మ విద్య అని శంకరులు అభిప్రాయం.

## 7. బంధము - మోక్షము

**89. ప్ర. జీవునికి బంధం ఏ విధంగా ఏర్పడుతుంది?**

**స.** శరీరగ్రస్తుడైన జీవుడు శరీరానికి పరిమితమై తన నిజ స్వరూపాన్ని తెలుసుకోలేక పోతున్నాడు. దానికి కారణం మనోబుద్ధుల ప్రభావం. దాని వల్ల కర్తృత్వ, భోక్తృత్వ భావాలు, అహంకార మమకారాలు సంభవిస్తాయి. పర్యవసానంగా అనేక కర్మల నాచరించి, వాటి ఫలితాల ననుభవించడానికి జన్మలనెత్తుతూ, జనన మరణ చక్రంలో చిక్కుకొని ఏదో ఉపాధిలో బంధించబడుతూ ఉంటాడు. దీనినే బంధం లేక, సంసార బంధం అని అంటారు.

**90. ప్ర. జీవునికి బంధ విముక్తి అంటే ఏమిటి?**

**స.** సంసార బంధం నుండి జీవుడు విముక్తిని పొందడాన్ని బంధ

విముక్తి అంటారు. అంటే మనోబుద్ధ్యహంకారాల ప్రభావాన్ని దాటి, తన స్వస్వరూప జ్ఞానాన్ని పొంది జనన మరణ చక్రం నుండి బయట పడడమే.

**91. ప్ర. యజ్ఞయాగాది కర్మలకు, భక్తికి ఉపనిషత్తులు మరియు అద్వైతం వ్యతిరేకమా?**

**స.** ఉపనిషత్తులు గాని అద్వైతం గాని యజ్ఞయాగాది కర్మలను, భక్తిని నిరసించవు. వీటివల్ల ఇంద్రియ నిగ్రహం వస్తుంది. మనస్సు పరిశుద్ధమౌతుంది. తరువాత గురూపదేశాన్ని అనుసరించి తపస్సమాధినిష్ఠల ద్వారా బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందవచ్చు. ఇది ముక్తి.

**92. ప్ర. సాధన చతుష్టయం అంటే ఏమిటి?**

**స.** 1. నిత్యానిత్యవస్తు వివేకము (ఆత్మ శాశ్వతత్వం, దేహం యొక్క అశాశ్వతత్వం)

2. ఇహాముత్ర ఫలభోగ విరాగము (ఇహలోక, పరలోక సుఖాల మీద అనాసక్తి)

3. శమదమాది షట్కర్మ సాధన సంపత్తి (అంతరింద్రియ నిగ్రహం, బహిరింద్రియ నిగ్రహం, క్షమాబుద్ధి, గురువుల మీద విశ్వాసం మొదలైనవి)

4. ముముక్షుత్వము (అంటే మోక్షము పైన తీవ్రమైన ఇచ్ఛ)

ఈ నాలుగింటిని సాధనచతుష్టయం అంటారు.

**93. ప్ర. సాధన చతుష్టయం యొక్క ఆవశ్యకత ఏమిటి?**

**స.** సాధన చతుష్టయం ఉన్న వ్యక్తి మాత్రమే మోక్ష మార్గంలో ప్రయాణించడానికి అర్హుడు.

**94. ప్ర. సాధన చతుష్టయం ఏ రకంగా మోక్షానికి అర్హతను పెంచుతుంది?**

**స.** సాధన చతుష్టయం ఉన్నవాడే 'తత్త్వమసి', 'అయమాత్మాబ్రహ్మ' మొదలైన వేదాంత వాక్యాల వివరణను శ్రవణం చేసి, మననం చెయ్యడానికి అధికారం పొందుతాడు.

శ్రవణం వల్ల పరోక్షజ్ఞానం (indirect perception) లభిస్తుంది. మనన నిదిధ్యాసములచే సమాధి నిష్ఠలో అపరోక్ష జ్ఞానం లభిస్తుంది.

**95. ప్ర. క్రమముక్తి అంటే ఏమిటి?**

**స.** యజ్ఞయాగాది కర్మల ద్వారా ఇంద్రాది దేవతల అనుగ్రహంతో బ్రహ్మలోకం, సత్యలోకం చేరి, అక్కడి లోక వాసులతో కలిసి సంపాదించే ముక్తిని క్రమముక్తి అంటారు.

**96. ప్ర. జీవన్ముక్తి అంటే ఏమిటి?**

**స.** జీవించి ఉండగానే జ్ఞానమార్గంలో మహర్షులు పొందే ముక్తిని సద్యోముక్తి లేక జీవన్ముక్తి అంటారు.

**97.** ప్ర. **విదేహముక్తి అంటే ఏమిటి?**

**స.** శరీరత్యాగం చేసిన తరువాత పొందే ముక్తిని విదేహముక్తి అంటారు.

**98.** ప్ర. **భిన్న, అభిన్న స్థితులు అంటే ఏమిటి?**

**స.** నిప్పునుండి నెరుసులు బయల్వెడలుతూ ఉంటాయి. రెండూ వేర్వేరుగా భిన్నంగా కన్పిస్తూ ఉంటాయి. కాని వస్తుతః రెండు ఒకటే, కాని అభిన్నమే.

అలాగే పరమాత్మ, జీవాత్మ వేరువేరుగా కనిపిస్తారు. అది భిన్నస్థితి. కాని ఈ రెండింటికి ఒకే చైతన్యం ఉంది. చైతన్యాంశలో ఆ రెండూ ఒకటే. అది అభిన్నస్థితి.

**99.** ప్ర. **మోక్షం ఎప్పుడు లభిస్తుంది?**

**స.** జీవుడు తన స్వస్వరూపాన్ని తెలుసుకున్నప్పుడు, అంటే తాను పరమాత్మకంటే చైతన్యాంశలో భిన్నం కాదని తెలుసుకున్నప్పుడు మోక్షం లభిస్తుంది.

**100.** ప్ర. **అవిద్య అంటే ఏమిటి?**

**స.** జీవుడు ఉపాధిలో నున్నప్పుడు మనో బుద్ధుల తోను, శరీరంతోను చేరి ఉండడం వల్ల తన స్వస్వరూపాన్ని తెలుసుకోలేక, తాను ఈ శరీరమేననే అపోహలో ఉంటాడు. అదే అవిద్య.

**101.ప్ర. అవిద్య తొలగిన వెంటనే ఏమవుతుంది?**

**స.** కుండ పగలగానే ఘటాకాశం మహాకాశంలో ఐక్యమైనట్లు, అవిద్య తొలగిన వెంటనే జీవుడు పరమాత్మే అయిపోతున్నాడు.

**102.ప్ర. సద్గతికి, మోక్షానికి తేడా ఏమిటి?**

**స.** యజ్ఞయాగాదులు చేస్తే స్వర్గం వస్తుంది. అది మనం సంపాదించే సద్గతి. మరి మోక్షం అనేది మనం సంపాదించేది కాదు, స్వస్వరూప జ్ఞానంతో సంభవించేది.

దేహాత్మాభిమానం ఉన్నంతవరకు కర్మలు చేస్తూ ఉంటాం. కర్మఫలాలననుభవించడానికి మళ్ళీ జన్మను పొందుతాం. ఈ 'పునరపిజననం, పునరపిమరణ' మే బంధం. దీన్నే సంసార బంధం అంటారు. ఈ బంధం నుండి విముక్తే మోక్షం.

**103.ప్ర. స్వస్వరూప జ్ఞానం ఎలా వస్తుంది ?**

**స.** శ్రవణ, మనన, నిదిధ్యాసల ద్వారా, అంటే వేదాంత శ్రవణం, ఆ విషయాల మీద మననం చెయ్యడం, వాటిని మీద ధ్యానం చెయ్యడం. ఈ ధ్యాన మార్గం ద్వారా బ్రహ్మజ్ఞానం కలుగుతుందని అద్వైత సిద్ధాంతం బోధిస్తోంది.

ఈ జ్ఞానం జీవితకాలంలోనే లభిస్తే అది జీవన్ముక్తి, తనువు చాలించిన తరువాత లభిస్తే విదేహముక్తి.

కర్మాచరణ వల్ల స్వర్గం లభిస్తుంది గాని, 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' - పుణ్యం క్షీణించగానే పునర్జన్మ సిద్ధిస్తుంది అని భగవద్గీత (9-21) చెప్తోంది గనుక అద్వైతం కర్మాచరణకి అంత ప్రాధాన్యం ఇవ్వలేదు.

అద్వైతం భక్తికి వ్యతిరేకం కాదు. భక్తి ఇంద్రియ నిగ్రహాన్ని మనో నైర్మల్యాన్ని ప్రసాదించి సాధకుడిని జ్ఞానమార్గానికి సిద్ధం చేస్తుందని శంకరులు భక్తిని ప్రోత్సహించారు.

చివరకు, ధ్యానమార్గం ద్వారా బ్రహ్మజ్ఞానం సిద్ధిస్తుంది.

## 8. ఈశ్వరుడు - సృష్టి

**104.ప్ర. విశ్వం పరిణామశీలం గలది. బ్రహ్మమునకు పరిణామశీలం లేదు. అలాంటప్పుడు ఈ విశ్వం ఎలా వచ్చింది?**

**స.** ఈ సమస్యను అద్వైతం సగుణ బ్రహ్మము లేక ఈశ్వరుడు ద్వారా పరిష్కరించింది.

బ్రహ్మము మాయ, లేక ప్రకృతితో కలిసినప్పుడు సగుణ బ్రహ్మం లేక, ఈశ్వరుడు అని సంబోధించబడతాడు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సృష్టి, స్థితి, లయాలను కలిగించే శక్తులు గలవాడు. అందుచేత ఈ విశ్వం ఈశ్వరుని మూలంగా ఏర్పడింది.

**105.ప్ర. ఈశ్వరునికి, జగత్తుకు ఉన్న సంబంధం ఎటువంటిది?**

స. ఈశ్వరుడు జగత్తుకు ఉపాదాన కారణం, మరియు నిమిత్త కారణం కూడా. మట్టి కుండకు ఉపాదాన కారణం (material cause) మట్టి అచేతనం. ఉపాదాన కారణం ఎప్పుడూ అచేతనమే. మరి చేతనుడైన ఈశ్వరుడెలా ఉపాదాన కారణం అవుతాడనే ప్రశ్నకు తావులేదు. ఎందుచేతనంటే మన వ్యావహారికానుభవం విశ్వసృష్టికి అనువర్తించకూడదు. దానికి శ్రుతి ప్రమాణాన్నే అంగీకరించాలి గాని మన అనుభవ జ్ఞానం కాదు.

విశ్వం ఈశ్వరుడి నుండి పుట్టి మళ్ళీ ఈశ్వరుడిలోనే లయం అవుతుంది. మరి విశ్వానికున్న జడత్వం, ద్రవ్యత్వం, మౌఢ్యం మొదలైన లక్షణాలు కూడా ఈశ్వరునిలో జేరి ఆయన్ను కలుషిత పరుస్తాయా? ఈ ప్రశ్నకు "కాదు" అని శంకరులు సమాధానం చెప్పారు. నగలను కరిగించినపుడు మలినాలునశించి స్వచ్ఛమైన బంగారం ఎలా వస్తుందో విశ్వం లయం అయ్యేటపుడు దానిలోని అవలక్షణాలన్నీ పోతాయంటారు శంకరులు. ఇలా ఈశ్వరుడి లో లయం అయిపోయి మళ్ళీ అనుభవంలోకి రాని జీవుల కర్మానుభవానికి పున:సృష్టి చేస్తాడు ఈశ్వరుడు. ముక్త జీవులకు పునర్జన్మ ఉండదు.

**106.ప్ర. కొందరిని కష్టజీవులుగా మరి కొందరిని దు:ఖ భాగులుగా సృష్టిస్తూన్న ఈశ్వరుడు నిష్పక్షపాతి అని ఎలా అనగలం?**

**స.** జీవుల సృష్టి వారి వారి కర్మానుసారం జరుగుతుంది తప్ప దానికి ఈశ్వరుడు బాధ్యుడు కాదంటుంది అద్వైతం.

**107.ప్ర. ఈశ్వరుడు ఏ విధంగా సృష్టి చేస్తాడు?**

**స.** ఈశ్వరుడు ఏ ఉపకరణాలు లేకుండా తన అద్భుత శక్తితో సృష్టి కార్యం చేస్తునే ఉంటాడు. జీవులు ఈశ్వరుని యొక్క అంశలే – కారణం ప్రకృతి ఆయనలోనే ఉంది, దాని నుండి పుట్టిన వారే జీవులు గనుక. కల్పాంతంలో విశ్వం మూలప్రకృతిలో కలిసినప్పుడు జీవులు పున:సృష్టి జరిగే వరకు నిరుపాధికులై సుప్తస్థిచి ఉంటారు. తరువాతి కల్పాదిలో మరల సృష్టి ప్రారంభమవుతుంది.

**108.ప్ర. గౌడపాదులు, శంకరులు ఇద్దరూ అంగీకరించిన వాదం ఏమిటి?**

**స.** గౌడపాదులు, శంకరులు అంగీకరించిన వాదం పేరు "వివర్తవాదం".

**109. ప్ర. వివర్తం అంటే ఏమిటి?**

**స.** కారణం కంటే విలక్షణమైన వస్తుజాలం కార్యరూపంగా ప్రభవించినప్పుడు, దాన్ని 'వివర్తం' అంటారు.

ఉన్న ఒకే ఒక సత్యమైన బ్రహ్మం, అసత్యమైన అనేక రూపాలలో దర్శనమివ్వడాన్ని 'వివర్తం' అంటారు. సృష్టి ఈ విధంగా ప్రవర్తిస్తుంది అనే ఈ వాదాన్ని 'వివర్తవాదం' అంటారు.

ఉదాహరణకు –

సముద్రంలోని నీరు నీటి తుంపరులుగాను, బుడగలుగాను, తరంగాలుగాను కూడా కనిపిస్తుంది. వేరవేరుగా కనిపిస్తున్నా అవన్నీ సముద్రపు నీటియొక్క వివిధ రూపాంతరాలు, మరియు అవి తాత్కాలికాలు. అక్కడ సముద్రము మాత్రమే నిజం.

అదేవిధంగా మృత్తిక నుండి తయారు అయ్యే వస్తువులు – కుండ, మూకుడు వంటివి – అవి ఏవీ నిజం కాదు. మృత్తిక మాత్రమే నిజం.

ఆ విధంగా బ్రహ్మం ఒక్కటే నిజం. ఈ నామరూపాదికమైన విశ్వం ఆ బ్రహ్మం మీద ఆరోపితమైనది. కారణము ఆ బ్రహ్మము. అది త్రికాలాలలోనూ ఉండేది. అది సత్యం. కార్యం (కుండవంటివి) అశాశ్వతం, అందుచేత అసత్యం అని దీని అర్థం.

**110. ప్ర. వివర్తవాదాన్ని గురించి ఆచార్య వాచస్పతి ఏమన్నారు?**

**స.** ఆచార్య వాచస్పతి ఇలా అన్నారు :

**"వివర్తస్తు ప్రపంచోఽయం బ్రహ్మణోఽపరిణామినః**
**అనాదివాసనోద్భూతో న సారూప్యమపేక్షతే"**

బ్రహ్మం పరిణామ శీలమైనది కాదు. అద్వైతంలో బ్రహ్మం శాశ్వతమైన, మార్పుకు లోనుకాని తత్త్వం. అది కారణం. నామరూపాత్మక విశ్వం కార్యం, ఇది అశాశ్వతం. అందుచేత

విశ్వం వివర్తం, అంటే ఆరోపితమైన సర్పం, తాడు యొక్క నిజస్వరూపాన్ని కప్పిపుచ్చినట్లు, విశ్వం బ్రహ్మము యొక్క నిజ స్వరూపాన్ని కప్పి పుచ్చి నామ రూపాత్మకంగా గోచరిస్తుంది. దీన్ని వివర్తవాదం అంటారు (doctrine of apparent transformation).

మాయ బ్రహ్మంలోని విడదీయ రాని శక్తి. అందుచేత విశ్వసృష్టికి కారణం బ్రహ్మమే.

**111. ప్ర. అనిర్వచనీయ ఖ్యాతి అంటే ఏమిటి?**

**స.** పారమార్థిక దృష్టితో నిజానికి లేని విశ్వం , వ్యావహారిక దృష్టితో కంటికి ప్రత్యక్షంగా కనిపించడాన్ని 'అనిర్వచనీయఖ్యాతి' (apprehention of the indefinable) అంటారు.

**112. ప్ర. సృష్టి అనాది అని ఏ విధంగా చెప్పవచ్చు?**

**స.** కారణకార్యాలు ఒకే వస్తువు యొక్క రెండు రూపాలు (two sides of the same coin) అని శంకరుల నిర్ణయం. దీని పర్యవసానం – ఈ రెంటిలో ఏది ముందు అనే ప్రశ్న ఉత్పన్నమే కాదు, దానికి త్రికాలాబాధితమైన బ్రహ్మమే ఉపాదాన కారణం అని సిద్ధాంతీకరించారు. అంటే మొదటి సృష్టి ఎప్పుడు జరిగింది అంటే చెప్పలేం. అందుచేత సృష్టి అనాది.

# 9. మాయ-అవిద్య

**113. ప్ర. అద్వైత తత్త్వంలో మాయ యొక్క ప్రాధాన్యత ఏమిటి?**

**స.** అద్వైత తత్త్వంలో మాయా సిద్ధాంతం ప్రధానమైనది. మాయ పరమాత్మ యెక్క ఒక శక్తి. ప్రపంచం నామరూపాలు గలది. ఇలా ఈశ్వరునిలో అవ్యక్తంగా నున్న జగత్తును వ్యక్తం చెయ్యడానికి ఉపకరించేది ఈశ్వరునిలో నున్న శక్తియే. అదియే "మాయ".

**114. ప్ర. 'ఏకమేవ అద్వితీయం బ్రహ్మ' ఉన్నది బ్రహ్మము ఒక్కటే, రెండవది లేదు అని శ్రుతి వాక్యం. మరి రెండవది లేనప్పుడు – బ్రహ్మంకంటే వేరుగా కనిపించే ఈ నామరూప ద్వంద్వాలు గల ఈ విశ్వం ఎలా వచ్చింది ?**

**స.** నిరాకార, నిర్గుణమైన బ్రహ్మము పారమార్థిక సత్యం అని పై వేదాంత వాక్యాలు ఘోషిస్తున్నాయి. సాకార సగుణ విశ్వం మాయ వలన ఏర్పడిందని అద్వైతం చెబుతుంది.

బ్రహ్మం సత్య స్వరూపం. ఆ సత్యస్వరూపాన్ని కప్పిపుచ్చి మాయ విశ్వాన్ని ఆవిర్భవింపజేస్తుంది. అయితే ఈ విశ్వానికి ఆధారం లేక అధిష్ఠానం బ్రహ్మమే. బ్రహ్మము లేకపోతే విశ్వమూ లేదు. అందుచేత విశ్వం బ్రహ్మము మీద ఆధారపడింది తప్ప, దానికి స్వతంత్ర ప్రతిపత్తి లేదు. ఈ దృష్టితోనే విశ్వాన్ని మిథ్య అన్నారు. అయితే విశ్వం బ్రహ్మము మీద ఆధారపడి ఉండడంవల్ల బ్రహ్మమునకు వచ్చిన లోటేమీ ఉండదు.

మాయ అనేది ఒక శక్తి మాత్రమే గాని ద్రవ్యం కాదని అందరు ఒప్పుకున్న విషయం.

**115. ప్ర. బ్రహ్మం నుండి మాయ ద్వారా విశ్వం ఉద్భవించినపుడు, విశ్వం బ్రహ్మమని అనవచ్చునా?**

**స.** అవుననీ కాదనీ కూడా సమాధానం చెప్పవచ్చును. బ్రహ్మముకంటే వేరు కాదు గనుక అవునని అనవచ్చును. కాని బ్రహ్మమునకు సృష్టి, స్థితి, లయాలు లేవు. అవి విశ్వమునకున్నాయి. ఆ దృష్టిలో విశ్వం బ్రహ్మము రెండు ఒకటి కాదు అని అనవలసి వస్తుంది.

**116. ప్ర. అవిద్యకు, మాయకు గల భేదమేమిటి?**

**స.** సాధారణంగా మనమందరమూ ఈ విశ్వాన్ని సత్యంగానే నమ్ముతాం. కారణం దానితో వ్యవహరిస్తున్నాం గనుక. ఇలా వ్యక్తిగతంగా ఉండే అజ్ఞానాన్నే 'అవిద్య' అన్నారు. వ్యక్తిగత స్థాయిలో, "ప్రపంచం మిథ్య" అనే జ్ఞానం కలుగగానే, 'అవిద్య' నశిస్తుంది.

మరి మాయ అనేది విశ్వానికి సంబంధించింది. అది విశ్వం ఉన్నంత వరకు ఉంటుంది. కల్పాంతంలో విశ్వం బ్రహ్మములో లయం అయిన తరువాత మళ్ళీ విశ్వ సృష్టి జరిగే దాకా నిద్రాణంగానే ఉంటుంది. ఈ విధంగా చూసినప్పుడు 'మాయ' విశ్వావిర్భావం నుండి విశ్వం లయం అయ్యేంత వరకు ఉంటుంది.

**117. ప్ర. మాయ, అవిద్య అనే పదాలను ఎవరెవరు ఏ విధంగా వినియోగించేరు?**

**స.** 'శంకరులు 'మాయ' 'అవిద్య' అనే పదాలను సమానార్థకాలుగా వాడినా తదనంతరాద్వైతులు 'మాయ' ఈశ్వరోపాధిమయమనియు, అవిద్య జీవోపాధిమయమనియు చెప్పిరి' అని రాధా కృష్ణపండితులు చెప్పారు. కాని ఇప్పుడు పండితులందరు 'మాయ', 'అవిద్య' అనే పదాలను శంకరులననుసరించి సమానార్థకాలుగానే వాడుతున్నారు.

## 10. ప్రమాణాలు - జ్ఞాన సముపార్జన

**118. ప్ర. అంతఃకరణం ఏయే రూపాలలో ఏ విధంగా పనిచేస్తుంది?**

**స.** బాహ్య ప్రపంచంలోని విషయాలను స్వీకరించి క్రమబద్ధీకరించి వ్యక్తపరిచే శక్తి అంతఃకరణానికి మాత్రమే ఉంది. ఈ అంతఃకరణ మనలోపలే ఉండి ఆత్మప్రకాశంతో పనిచేసే శక్తి. అదే చైతన్యశక్తి. అది ఇంద్రియం కాదు, కంటికి కనిపించదు.

ఇది నాలుగు విధాలుగా పనిచేస్తుంది. సంకల్ప వికల్పాలు కలిగినప్పుడు "మనస్సు"గా, నిర్ణయం తీసుకునేటప్పుడు "బుద్ధి"గా, ఆత్మాభిమానంతో పనిచేసే సమయంలో "అహంకారం"గా, ఏకాగ్రత సాధించడం, విషయాలను స్మరణకు తెచ్చుకోవడంలో "చిత్తం"గా పనిచేస్తుంది.

**119. ప్ర. జ్ఞానం అందరిలోను ఒకే విధంగా ఎందుకు ఉండదు?**

**స.** జీవులయొక్క పూర్వ సంస్కారాలను బట్టి, వారివారి అంతఃకరణలు వేరువేరుగా ఉంటాయి. శుద్ధచైతన్యం అంతఃకరణంతో కలిసే జ్ఞానాన్ని సృష్టిస్తుంది, అందరి అంతఃకరణలూ ఒకే విధంగా ఉండవు. అందుచేత జ్ఞానం అందరిలోనూ ఒకే మాదిరిగా ఉండదు.

**120. ప్ర. జ్ఞానాన్ని పొందడంలో ప్రమాణాలయొక్క ఉపయోగం ఏమిటి?**

**స.** బయటనుండి వచ్చిన సమాచారాన్నంతా ఎక్కడ నుండి, ఎట్లా వచ్చిందో విచారించి జ్ఞానాన్ని గ్రహించాలి. అందుకు ప్రమాణాలు (means of proof) ఉపయోగపడతాయి. శాస్త్ర చర్చలలో విషయం యొక్క సత్యనిరూపణకు ప్రమాణాలు ఉపయోగిస్తాయి.

వేదాంతం లౌకిక జీవితాన్ని విస్మరించి సత్యాన్వేషణకు ఉపక్రమించిందని అనుకోకూడదు. లౌకిక జీవితంలో కానివ్వండి, అధ్యాత్మిక జీవితంలో కానివ్వండి అనేక విషయాలుంటాయి. అందులో వేటిని నమ్మాలి, వేటిని నమ్మకూడదు అనే నిశ్చయానికి రావడానికి ప్రమాణాలు ఉపయోగిస్తాయి.

**121. ప్ర. వేదాంతంలో ఏయే ప్రమాణాలను అంగీకరించారు?**

**స.** వేదాంతంలో ప్రమాణాలు అనేకం. వాటిలో ప్రత్యక్షం (direct perception), అనుమానం (inference), ఆప్తవాక్కు లేక శబ్ద ప్రమాణం (vedic sayings), సాదృశ్యం (simili) – వీటిని శంకరులు ఆమోదించారు.

**122. ప్ర. ఈ ప్రమాణాల ద్వారా ఆత్మావలోకనం సాధ్యం అవుతుందా?**

**స.** ఈ ప్రమాణాల ద్వారా ఆత్మావలోకనం సాధ్యం కాదంటుంది వేదాంతం. ఆత్మ మనలో ఉండే కర్తయే (subject) గాని, బాహ్యప్రపంచంలో ఉండే వస్తువు (object) కాదు. అందుచేత ప్రత్యక్షంగా చూడడం సాధ్యం కాదు.

మనిషి చనిపోతే అతనిలో నుండి ఆత్మ నిష్క్రమించిందని అనుమాన ప్రమాణంతో గ్రహిస్తాం. అంతేగాని ఆత్మను మనం చూడలేం. అందుచేత అనుమాన ప్రమాణం చేత కూడా ఆత్మను దర్శించలేం.

ఇక వేదవేదాంగాలన్నీ అపరావిద్య (lower knowledge) అని, అనుభవం మాత్రమే పరావిద్య అని, ముండకోపనిషత్తు చెప్పింది. అందుచేత వేదశాస్త్రాల పాండిత్యంతో అంటే శబ్ద ప్రమాణంతో ఆత్మావలోకనం సాధ్యం కాదు.

ఆత్మతో పోల్చదగిన వస్తువు వేరొకటి ఏదీ లేదు. అందుచేత సాదృశ్యం కూడా పనికిరాదు.

ఆత్మ అనుభవైక వేద్యం – దానికి శ్రవణ మనన నిదిధ్యాసలే మార్గం. ఆత్మ ఈ ప్రమాణాలకతీతం.

# 11. ఆస్తికత

**123. ప్ర. ఆస్తికులు అంటే ఎవరు? నాస్తికులు అంటే ఎవరు?**

**స.** దేవుడు ఉన్నాడు అని నమ్మేవారిని ఆస్తికులని, దేవుడు లేదని భావించేవారిని నాస్తికులని మనం సామాన్యంగా వ్యవహరిస్తూ ఉంటాము. కాని అది సరియైన నిర్వచనం కాదు.

వేదం యొక్క ప్రామాణ్యాన్ని అంగీకరించేవారిని ఆస్తికులు అని అంటారు. వేదం యొక్క ప్రామాణ్యాన్ని అంగీకరించని వారిని నాస్తికులు అంటారు.

**124. ప్ర. శంకరుల కాలంలో ప్రచారంలో ఉన్న వాదాలు ఏమిటి?**

**స.** శంకరుల కాలంలో చార్వాకం, బౌద్ధం, జైనం మొదలైన నిరీశ్వరవాదాలు బహుళ ప్రచారంలో ఉండేవి. సాంఖ్యంకూడా నిరీశ్వర వాదాన్నే సమర్థించింది.

**125. ప్ర. ఆస్తికత దేనిమీద ఆధారపడి ఉంది?**

**స.** ఆస్తికత వేదాల పట్ల మన శ్రద్ధ మీద ఆధారపడి ఉంది.

**126. ప్ర. వేదాలను ఎందుకు ప్రమాణంగా తీసుకోవాలి?**

**స.** మహర్షుల ఆత్మానుభూతి శబ్ద రూపంలో, అనగా వేదాల రూపంలో వెలువడింది. ఆ అనుభూతి భాషకతీతమైనది గనుక, వ్యంగ్యంగానే సూచించడానికి వీలవుతుంది గనుక,

అతి తక్కువ పదాలతో అనల్ప అర్థాన్నిచ్చేలా మంత్రాల రూపంలో వారు చేసిన ప్రకటనల సంపుటీకరణమే శ్రుతి అని శంకరులు నమ్మారు. అనుభవపూర్వకమైనది గనుక శ్రుతి శిరోధార్యమని, ప్రామాణికమని వారి అభిప్రాయం.

అనుభవం స్వతహాగా ప్రమాణ యుక్తం. వేదార్థ నిర్ణయానికి తర్కం కూడా అవసరమని ఆయన భావించారు. అయితే వేదాలకు వ్యతిరేకంగా ఉండే కుతర్కాన్ని వారు అంగీకరించలేదు. ఇలా ఈశ్వరాస్తిత్వాన్ని నిరూపించడానికి వేదమే పరమప్రమాణం గాని హేతువాదం కాదని ఆయన ప్రగాఢ విశ్వాసం. అనుభవపూర్వకంగా మహర్షులు, సిద్ధపురుషులు చెప్పడమే కారణం.

**127. ప్ర. ఆత్మ సాక్షాత్కారానికి ప్రధానమైన అర్హత ఏమిటి?**

**స.** అతి చేరువగానున్న భగవంతుణ్ణి దర్శించాలనే పూర్ణజిజ్ఞాసతో బాటు సాధన చతుష్టయం ఆత్మసాక్షాత్కారానికి ప్రధానమైన అర్హత.

**128. ప్ర. సత్యం యొక్క లక్షణం ఏమిటి?**

**స.** సత్యం సార్వ జనీనం. ఒక్కొక్కనికి ఒక్కొక్క సత్యం ఉండదు. అయితే సాక్షాత్కార సాధన విధానంలో వ్యక్తికి వ్యక్తికి మధ్య తేడా ఉండవచ్చు.

ప్రపంచంలో అనేక విషయాలున్నాయి. వాటిని అనుభవపూర్వకంగా తెలుసుకుంటున్నాం. కాని అది కేవలం

లౌకిక జ్ఞానం మాత్రమే. సత్య సాక్షాత్కారానికి ఇంద్రియాలను బాహ్యప్రపంచం నుండి మరలించి, అంతర్ముఖం చెయ్యాలి. అంతర్దృష్టి వలన, తెలుసుకొనే వాడు, తెలియబడేది, తెలుసుకోవడం అనే భేదం నశించి పరమార్ధ సత్యం అనుభవంలోకి వస్తుంది. ఆధ్యాత్మికంగా చర్చించేటప్పుడు అనుభవజ్ఞానం అంటే ఆత్మానుభవజ్ఞానమే. మనలో నిగూఢంగా ఉండి, మనోబుద్ధులను, ఇంద్రియాలను, పంచప్రాణాలను చైతన్యవంతం చేసే ఆత్మతత్త్వమే తెలుసుకోవలసింది. అదే వేదసారమని, అదే సత్య దర్శనమని, అదే జీవిత పరమార్థమని శంకరుల సందేశం. అదే ఆస్తికత.

# 4వ అధ్యాయము

## 1. ఇతర సిద్ధాంతాలు

**129. ప్ర. గౌడపాదుల కాలంనాటికి సృష్టిని గురించి ఏ విధమైన అభిప్రాయాలు ఉండేవి?**

**స.** గౌడపాదుల కాలం నాటికి సృష్టి క్రమం మీద అనేక సిద్ధాంతాలు, అభిప్రాయాలు ప్రచారంలో ఉండేవి. కొందరు సృష్టి పరమాత్మ విభూతి అన్నారు, కొందరు స్వప్న తుల్యమన్నారు, కొందరు కాల ప్రభావం అన్నారు. కొందరు అసలీ విశ్వం పుట్టనేలేదు, అంటే బ్రహ్మము నుండి వ్యాకృతము (manifestation) కాలేదు, ఈ వస్తుజాలం కనిపిస్తున్నదని మనం అనుకుంటున్నాం తప్ప దానికి ప్రాతిపదికలేదని అన్నారు. దీన్ని 'అజాత వాదం' అంటారు. అయితే ఈ వాదం విశ్వం అనుభవంలోకి రావడం లేదని అనదుగాని, అది నిజంగా ఒక మార్పులేని సద్వస్తువు చేత సృష్టించబడలేదని అంటుందంతే. ఇక బౌద్ధులు శూన్యవాదమూ, సాంఖ్యుల పరిణామవాదమూ కూడా ప్రచారంలో ఉండేవి.

**130. ప్ర. మిగిలిన సిద్ధాంతాలలోని కొన్ని ప్రధాన అంశాలు ఏమిటి?**

**స.** న్యాయ దర్శనం ప్రకారం జీవాత్మలు అనేకం. అణువులు,

ఆకాశం, కాలం, మనస్సు, జీవులు వీటితో సృష్టి జరిగిందని ఈ దర్శనంలో ప్రతిపాదించబడింది. ఈ సిద్ధాంతాన్ని శంకరులు ఖండించారు.

**131. ప్ర. సాంఖ్యుల వాదం ఏమిటి?**

**స.** బ్రహ్మమే విశ్వంగా పరిణామం చెందుతుందని సాంఖ్యులు వాదిస్తారు.

సాంఖ్యులు ప్రకృతి పురుషుల సంయోగంతో, త్రిగుణాలకు సమతౌల్యం భంగం అయినపుడు సృష్టి జరిగిందన్నారు. ఈ సిద్ధాంతంతోను శంకరులు పూర్తిగా విభేదించారు.

అయితే యోగ దర్శనంలో చెప్పబడిన ప్రాణాయామము, ధ్యానము మొదలైన వాటి వల్ల మనస్సు నిర్మలమై ఆత్మావలోకనానికి చెయ్యవలసిన సాధనకుపకరిస్తుందని ఒప్పుకున్నారు.

అయితే శంకరులు ప్రతిపాదించిన బ్రహ్మమునకు నాగార్జునుడు ప్రదిపాదించిన శూన్యానికి కొంత సారూప్యం ఉందని, బౌద్ధంలోని విజ్ఞానవాదానికి కొంత శంకరులు ఆకర్షితులయ్యారని, అందుచేత ఆయన ప్రచ్ఛన్న బౌద్ధుడని అభివర్ణించిన విజ్ఞానభిక్షువు అభిప్రాయంలో కొంత సత్యం లేక పోలేదని కొందరు వ్యాఖ్యానించారు. రాధాకృష్ణ పండితులు కుడా బౌద్ధమత ప్రభావం కొంత శంకరులు మీద ఉందనే వాదనను త్రోసిపుచ్చుడం కష్టం అన్నారు. అయితే శంకరులు ప్రచ్ఛన్న బౌద్ధుడనే వాదాన్ని చాలా మంది తీవ్రంగా ఖండించిన మాట కూడా నిజమే.

శంకరుల తర్వాత అనేక మంది తత్త్వజ్ఞులు, సిద్ధాంత వ్యవస్థాపకులు వచ్చారు. వారిలో కొంత మంది శంకరుల

సిద్ధాంతాన్ని పూర్తి గాను, మరి కొందరు పాక్షికంగాను కొన్ని మార్పులతో ఒప్పుకున్నారు, కొందరు తీవ్రంగా ఖండించారు. అయితే శంకరుల తరువాత, వారి ప్రస్తావనలేని సిద్ధాంతం ఏదీ లేదని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు.

## 2. ఇతర అద్వైత సిద్ధాంత ప్రవర్తకులు

నిజానికి అద్వైతం మీద చెప్పవలసినదంతా శ్రీ శంకరులు సమగ్రంగా తమ గ్రంథాల ద్వారా చెప్పేశారు. తరువాత వారి శిష్యులైన సురేశ్వరాచార్యులు, పద్మపాదులు, ఆనందగిరి ఆద్వైతపరంగా అనేక గ్రంథాలను రచించారు. అయితే శంకరుల శతాధిక గ్రంథాలలోని సారాన్ని క్రోడీకరించి మనకందించిన పండితులు చాలా మంది ఉన్నారు. వారిలో ప్రసిద్ధుల గురించి సంక్షిప్తంగా వివరించడం ధర్మం.

అలాంటి వారిలో మొదటి వారు శ్రీ సాయణ మాధవాచార్యులు వారు. వారి సర్వదర్శన సంగ్రహంలో 'శాంకరదర్శనం' అనే శీర్షికలో అద్వైత సిద్ధాంతాన్ని చక్కగా వివరించారు. వీరు గొప్ప పండితులే కాదు. నలుగురు విజయనగర రాజులకు ప్రధానమంత్రిగా క్రీ.శ. 1340-1387 వరకు ఉన్నారని చరిత్రకారుల మాట. వీరు సన్న్యసించి విద్యారణ్యులనే పేరుతో శృంగేరి శారదా పీఠాన్ని అలంకరించడమే కాక 'వేదాంత పంచదశి' అనే గ్రంథాన్ని వ్రాశారు. ఇది అద్వైత సిద్ధాంతం మీద సమగ్రమైన గ్రంథంగా లోక ప్రసిద్ధం. వీరి తమ్ముడైన సాయనుడే వేదాలకు భాష్యం వ్రాశారు. అయితే అది కర్మకాండకు మాత్రమే పరిమితమైనది.

వేదాంత పంచదశి గురించి రెండు మాటలు. ఇది 1455 శ్లోకాలలో ఉంది. వివేకపంచకం, దీపపంచకం, ఆనందపంచకం అనే మూడు భాగాలుగా విభజింపబడింది. దీని మీద రాయప్రోలు లింగన సోమయాజి గారు అద్భుతమైన వ్యాఖ్య వ్రాశారు.

విద్యారణ్యుల తరువాత ప్రసిద్ధ అద్వైత సిద్ధాంత ప్రవర్తకులు శ్రీ అప్పయ్య దీక్షితులు వారు (క్రీ.శ. 1520–1592). వారు పండిత కుటుంబంలో జన్మించారు. తండ్రి రంగరాజ అధ్వరి. సంస్కృత వ్యాకరణం మీద ప్రసిద్ధ గ్రంథం సిద్ధాంత కౌముదిని రచించిన భట్టోజీ దీక్షితులు అప్పయ్య దీక్షితుల వారి శిష్యులే. మహాభారతం మీద ప్రసిద్ధ వ్యాఖ్యానం వ్రాసిన నీలకంఠుడు ఈయన మనుమడు.

అప్పయ్య దీక్షితుల వారు అద్వైత సిద్ధాంతం మీద అనేక గ్రంథాలు వ్రాశారు. బ్రహ్మసూత్రాల మీద వారి గ్రంథాలు 'న్యాయరక్షామణి', 'పరిమళ', 'శివార్కమణిదీపిక', ఎంతో ఖ్యాతి గడించాయి. 'సిద్ధాంతలేశసంగ్రహం', అద్వైత సిద్ధాంతంలోని అనేక విషయాల మీద వివరణ ఇచ్చింది. వారి 'కువలయానందం' అలంకార శాస్త్రం మీద ఇప్పటికి సంస్కృత విద్యాలయాల్లో పాఠ్యగ్రంథం.

అయితే ఈ గ్రంథాలన్నీ సంస్కృత భాషలో ఉన్నాయి. సంస్కృత భాషాధ్యయనం తగ్గడం వల్ల ముఖ్యంగా శంకర భాష్యం మొదలైన సంస్కృత గ్రంథాలను అనేక మంది మహా పండితులు తెలుగులోకి అనువదించారు. వారిలో ప్రముఖులు శ్రీ రాయప్రోలు లింగన సోమయాజి గారు, బ్రహ్మశ్రీ సూరి రామకోటి శాస్త్రిగారు,

కొంపెల్ల దక్షిణామూర్తిగారు, కనుపర్తి మార్కండేయ శర్మ గారు మొదలైనవారు.

ఇక పద్మశ్రీ ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారు ప్రాతఃస్మరణీయులు. శంకరుల సూత్ర భాష్యాన్ని, సాయణ మాధవుల సర్వదర్శన సంగ్రహాన్ని మరెన్నో ఇతర వేదాంత గ్రంథాలను తెలుగులోకి అనువదించిన మహనీయులు. శతాధిక గ్రంథకర్త.

వీరందరికి స్ఫూర్తినిస్తున్న మహనీయులు శైవమహా-పీఠాధిపతులు, సద్గురువరేణ్యులు శ్రీ కందుకూరి శివానందమూర్తి గారు.

ఇక ఆంగ్లంలో శంకర భాష్యాలను అనువదించి ప్రకటించిన ఖ్యాతి శ్రీ రామకృష్ణ మఠానికి దక్కుతుంది. స్వామి వివేకానంద, స్వామి నిఖిలానంద, స్వామి రంగనాథానంద మొదలైన మహానుభావుల ఆంగ్లరచనలు ప్రసిద్ధాలు.

శంకరులు స్థాపించిన నాలుగు ఆమ్నాయాలు, కంచిమఠం ప్రసిద్ధాలు; కంచి పరమాచార్య, ఇతర పూజనీయులైన మఠాధిపతులు అద్వైతానికి విశేష ప్రచారం చేశారు, చేస్తున్నారు. అదే సంప్రదాయాన్ని ప్రస్తుతం శృంగేరి శ్రీ శారదాపిఠాధిపతులు శ్రీ భారతీతీర్థస్వామి, కంచిపీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతిస్వామి కొనసాగిస్తున్నారు.

ఇలా ఎందరో మహానుభావులు శంకరుల అద్వైత సిద్ధాంతానికి విశేష ప్రచారాన్ని చేస్తూ దాని ప్రాముఖ్యాన్ని ఇనుమడింపజేస్తున్నారు.

## 3. శ్రీ శంకరుల కృషి - తరతరాలకు స్ఫూర్తిదాయకం

మహాభారతం ఒక మహారణ్యంలాంటిది. దానిలో ఉన్నవి ఎక్కడైనా కనిపించవచ్చు, గాని దానిలో లేనివి ఎక్కడా కనిపించవని నానుడి. అలాంటి లక్షశ్లోకాల విస్తృత గ్రంధంలో నిక్షిప్తంగా ఉన్న అనర్ఘరత్నమే భగవద్గీత. దాన్ని మహాభారతం నుండి వెలికి తీసి స్వతంత్ర ప్రతిపత్తి కలిగించి, దానిపై అద్భుతమైన వ్యాఖ్య రాసి విస్తృత ప్రచారాన్ని తీసుకు వచ్చి, దేశానికే కాక యావత్ప్రపంచానికి మహోపకారం చేసిన ఘనత శంకర భగవత్పాదులది. ప్రస్థాన త్రయం మీద వ్యాఖ్య వ్రాయడం ఆయన మహత్కార్యం. ఉపనిషత్తులన్ని ఒకే కాలంలో, ఒకే ఋషిచేత దర్శింపబడినవి కావు. అందుచేత వాటిలోని భావంలో ఒకింత వైరుధ్యం సామాన్య పాఠకుడికి గోచరించే ప్రమాదం ఉంది ఇది శంకరులు గమనించి, అభివ్యక్తిలో తేడా ఉ ందే తప్ప భావంలో వైరుధ్యం లేదని, తమ వ్యాఖ్యతో నిరూపించి సమన్వయించిన మహా మేధావి శంకరులు.

**విదితా నమయా విశదైకకలా**
**న చ కించన కాంచనమస్తి గురో,**
**ద్రుతమేవ విధేహి కృపాం సహజాం**
**భవ శంకర దేశిక మే శరణం.**

## ఉపయుక్త గ్రంథాలు :

1. సర్వదర్శన సంగ్రహము
మహామహోపాధ్యాయ,
పద్మశ్రీ ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు

2. భారతీయ తత్త్వశాస్త్రము
విద్యాన్ బులుసు వేంకటేశ్వరులు
(తి.తి.దే. ప్రచురణ)

3. A History of Indian Philosophy
by Surendranath Dasgupta

4. Sri Shankaracharya - Life and Philosophy,
Swamy Mukhyananda,
Advaita Ashram Publications

5. శంకరదర్శనం
డా॥ వింజమూరి విశ్వనాథమయ్య

# శ్రీ వేదభారతి

వేదశబ్ద పరిరక్షణకు, వేదవిజ్ఞాన ప్రచారానికి ఏర్పడిన ధార్మిక సంస్థ శ్రీవేదభారతి.

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం అని పిలవబడే నాలుగు వేదాలకు సుమారు 1131 శాఖలు ఉండేవని మన ప్రాచీన గ్రంథాల ద్వారా తెలుస్తోంది. కాని నేడు 13 వేదశాఖలు మాత్రమే లభిస్తున్నాయి. ఈ 13 శాఖలలోను, 7 శాఖలకు మాత్రమే గురుశిష్యపరంపర కొనసాగుతోంది. మిగిలిన 6 శాఖలు పాక్షికంగా మాత్రమే లభిస్తున్నాయి. ఈ విధంగా మన ప్రాచీన భారతీయ విజ్ఞానంలో 99% పైగా పోగొట్టుకున్నాము.

వేద విజ్ఞానాన్ని అత్యవసరంగా పరిరక్షించుకోవడానికి శ్రీ వేదభారతి ఆధునిక కంప్యూటర్ టెక్నాలజీని ఎన్నుకొంది. అందులో - రికార్డింగ్ ద్వారా వేద మంత్ర ఉచ్చారణను జాగ్రత్త చేయడానికి కృషిచేస్తోంది. మిగిలి ఉన్న వేదశబ్దాన్ని రికార్డింగ్ చేస్తే సుమారు 3,000 గంటలు కావచ్చునని అంచనా వేయగా, ఇప్పటికి సుమారు 900 గంటలు పూర్తి అయింది. 200 పైగా ఆడియో/మల్టీమీడియా సిడిలరూపంలో అందుబాటులోనికి తీసుకొనివచ్చింది.

వేదాలపై శాస్త్రీయ పరిశోధన & ప్రచురణ :

వేదాలలో ఆధునిక శాస్త్రీయ సాంకేతిక విషయాలను వెలుగులోనికి తీసుకువచ్చే ప్రయత్నంలో "వేదంలో కంప్యూటర్ విజ్ఞానం", "వేదశాస్త్రాలలో ఆధునిక శాస్త్రీయ రహస్యాలు", "భూ కంపాలను ముందుగా పసిగట్ట గల్గుట సాధ్యమా?" మొదలైన అత్యున్నత శ్రేణి పరిశోధనా గ్రంథాలతో బాటు, "వేదగణితం" వంటి సిడి/డివిడిలను కూడా శ్రీవేదభారతి వెలువరించడం జరిగింది.

వైదిక గణితం బోధన :

టి.టి.డి. మరియు భక్తి టీ.వి. ఛానల్స్ ద్వారా లక్షలాదిమంది విద్యార్థులకు వేదగణితం, వేదవిజ్ఞానం వంటి విషయాలు పరిచయం చేయబడుతున్నాయి. విద్యార్థులకు అందుబాటులో ఉండేట్లుగా వైదిక గణితం ప్రచురించడం జరిగింది. ఈ కృషిని గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం **"బంగారు నంది"** బహుమతిని అందించింది.

అభ్యర్థన :

శ్రీ వేదభారతి చేస్తున్న కృషికి అందరూ చేయూతనందించవలసిందిగా ప్రార్థన!!!

# భగవద్రామానుజాచార్య

(జీవిత విశేషాలు, సిద్ధాంతం - సంక్షిప్తంగా )



కళానిధి సత్యనారాయణ మూర్తి

శ్రీ వేదభారతి

శ్రీమతే రామానుజాయ నమః

# భగవద్రామానుజాచార్య

(జీవిత విశేషాలు, సిద్ధాంతం-సంక్షిప్తంగా)


**కళానిధి సత్యనారాయణ మూర్తి**

విశ్రాంత న్యాయశాఖ కార్యదర్శి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

సంపాదకుడు

"సంస్కృత మిత్ర"

**డా॥ రేమెళ్ళ అవధానులు,**

M.Sc. (Nuclear Physics), M.A., Ph.D (Sanskrit), M.A., Ph.D. (Jyotisha)

Dy. Director (Computers), (Retd)., NIMS, Hyderabad.



**శ్రీ వేదభారతి**

**హైదరాబాదు**

**2013**

# భగవద్రామానుజాచార్య

**(జీవిత విశేషాలు, సిద్ధాంతం-సంక్షిప్తంగా)**

**కళానిధి సత్యనారాయణ మూర్తి**

**ప్రథమ ముద్రణ :** అక్టోబర్, 2013



వెల : **రూ. 25/-**

**ప్రతులకు :**

**1. శ్రీ వేదభారతి**

H-34, Madhuranagar, Hyderabad-500 038.

Ph./Fax.: 040-23812577 Cell : 98494 59316

e.mail : shrivedabharathi@gmail.com

www.shrivedabharathi.org

www.shrivedabharathi.in

2. Sri K.S.N. Murthy,

D-118, Madhuranagar,

Hyderabad - 500 038.

Ph : 040-23810590

Cell : 94902 95269

*ముద్రణ :*

Samhitha Graphics

Ameerpet, Hyderabad - 500016.

Ph.: 040-23731620, 23741620

శ్రీమతే రామానుజాయ నమః

# భగవద్రామానుజాచార్య

(జీవిత విశేషాలు, సిద్ధాంతం-సంక్షిప్తంగా)

## విషయ సూచిక


| | పేజి నెం. |
|---|---|
| **1వ అధ్యాయం** | |
| 1. పూర్వరంగం | 1 |
| 2. ఆళ్వారులు | 1 |
| **2వ అధ్యాయం** | 8 |
| రామానుజులు : జీవిత విశేషాలు | 8 |
| **3వ అధ్యాయం** | 13 |
| విశిష్టాద్వైత సిద్ధాంతం | 13 |
| 1. ప్రవేశిక | 13 |
| 2. సారసంగ్రహం | 16 |
| 3. 'విశిష్టాద్వైతం' అంటే ఏమిటి? | 17 |
| 4. సారస్వతం | 18 |

5. ప్రమాణములు 19

6. పరమాత్మ సశరీరుడు 21

7. పరమాత్మ అనంత కళ్యాణ గుణ సమన్వితుడు 24

8. జీవాత్మ పరమాత్మ ఒకటి కాదు

26

9. జీవుడు 29

10. మరి 'తత్త్వమసి' మాటేమిటి? 32

11. సృష్టి 34

12. భక్తి-ప్రపత్తి 39

13. మోక్షము 45

14. శాఖా భేదాలు 48

15. మరి కొందరు విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులు 50

16. ఉపసంహారం 52

# మా ధ్యేయం

శ్రీ ఆదిశంకరుల అద్వైతం, శ్రీ రామానుజుల విశిష్టాద్వైతం, శ్రీ మధ్వుల ద్వైతం ప్రసిద్ధమైన సిద్ధాంతాలు. ఈ మూడు సిద్ధాంతాలకు అనుయాయులు గణనీయంగానే ఉన్నారు. అయితే ఈ అనుయాయులలో చాలా మందికి 'నేనీ సిద్ధాంతానికి చెందిన వాడను' అని తెలుసునే తప్ప, తమ తమ సిద్ధాంతాలలోని మౌలికాంశాలు గాని, తమ సిద్ధాంతం ఇతర సిద్ధాంతాలోని ఏయే విషయాలతో ఏకీభవిస్తుంది, లేక విభేదిస్తుంది అనే విషయాల మీద గాని అవగాహన లేదు. ఇది యాంత్రిక జీవితం వల్ల, తెలుకోవాలనే ఆకాంక్ష లేక పోవడం వల్ల, ఈ సిద్ధాంతాల మీద గ్రంథాలు జటిలంగా ఉండడం వల్ల సంభవించింది. సిద్ధాంతకర్తల జీవిత విశేషాలు కూడా చాలా మందికి తెలియవు. ఇది సామాన్యుల పరిస్థితి. జిజ్ఞాసతో అధ్యయనం చేసే వారికి, పండితులకు చెప్పవలసిందేమీ లేదు.

అలాంటి సామాన్యులకు, ముఖ్యంగా జిజ్ఞాస ఉన్నా విపులమైన, జటిలమైన గ్రంథాలను అధ్యయనం చేయడానికి సమయం లేనివారికి, వారి వారి సిద్ధాంతాల మీద కనీస అవగాహన కలిగించాలనే ఉద్దేశ్యంతో శ్రీవేదభారతి

‘శ్రీ ఆదిశంకరాచార్య’, ‘భగవద్రామానుజాచార్య’, ‘శ్రీ మధ్వాచార్య’ అనే మూడు చిన్ని పుస్తకాలను ప్రచురించింది. సంక్షిప్తంగా ఆయా సిద్ధాంత కర్తల జీవిత విశేషాలను, సిద్ధాంతాలను కేవలం పరిచయం చెయ్యడమే ఈ చిన్ని పుస్తకాల ధ్యేయం. వీటిని చదివిన తరువాత ఆయా సిద్ధాంతానికి చెందిన వారు ప్రభావితులై వారి వారి ఆచార్యుల జీవిత చరిత్రలను, సిద్ధాంతాలను సమగ్రంగా అధ్యయనం చేస్తారని ఆకాంక్షిస్తూ...

ప్రకాశకులు

శ్రీమతే రామానుజాయ నమః

# భగవద్రామానుజాచార్య

## 1వ అధ్యాయం

## 1. పూర్వరంగం

భగవద్రామానుజులు, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రబోధకులు గానేగాక, మానవజాతి ఉజ్జీవించడానికి భక్తి మార్గమే విశిష్టము, ఆచరణీయము, సులభతరము అని ప్రవచించి, అంతవరకు నిరాకార, నిర్గుణ పరబ్రహ్మము మీద ధ్యాన ప్రధానమైన జ్ఞానమార్గం నుండి, జిజ్ఞాసువులు సగుణ, సాకార నారాయణ తత్త్వం మీద, ప్రేమ ప్రధానమైన భక్తి మార్గం వైపుకు పయనం చేసేలా చేసిన మహానీయులు, కారణజన్ములు, ప్రాతః స్మరణీయులు. సంప్రదాయాన్ని పాటిస్తూనే కొన్ని విప్లవాత్మక భావాలను ప్రదర్శించారాయన - అలాగని మన సనాతన ధర్మానికి విరుద్ధంగా ప్రవర్తించలేదు. ఆలయ నిర్వహణ, పూజా విధానం - వీటిమీద ఆయన ప్రత్యేక శ్రద్ధ చూపించి, కొన్ని నియమానలను విధించారు. అవి ఇప్పటికి తిరుమలలోనేగాక ఇతర వైష్ణవ క్షేత్రాలలో కూడా పాటిస్తున్నారు.

## 2. ఆళ్వారులు

రామానుజులను గురించి చెప్పేముందు ఆళ్వారులను గురించి చెప్పకపోతే విశిష్టాద్వైత సిద్ధాంత చరిత్ర అసమగ్రమమే అవుతుంది. క్రీస్తు వెనుక ఏడెనిమిది శతాబ్దాలనాడు చార్వాకుడి లోకాయతం, బౌద్ధం, జైనం ప్రబలంగా ఉండేవి. ఇవన్నీ వేద

ప్రమాణాన్ని తిరస్కరించి నిరీశ్వర వాదాన్ని ప్రతిపాదించినవే. ఈ సమయంలోనే ఆళ్వారులు శ్రీమన్నారాయణుడి వైభవాన్ని, ఆయనమీద భక్తి భావాన్ని హృద్యంగమంగా ఆనాటి ప్రజల భాష అయిన ద్రావిడ భాషలో గానంచేసి విశిష్టాద్వైత సిద్ధాంతానికి బలమైన పునాదులు వేశారు. అయితే వైష్ణవం, విష్ణుతత్త్వాన్ని బోధించిన భాగవత పురాణ కాలంనుండి ఉందని రాధాకృష్ణ పండితులు వ్రాశారు.

ఈ ఆళ్వారులు పన్నెండుగురు. వారు వివిధ కులాలకు చెందినవారు. ఒక స్త్రీ కూడా ఉండడం విశేషం. వారి వివరాలు ఇలా ఉన్నాయి. పోయిగై, పూదత్త, పేయ, తిరుమళిశై ఆళ్వారులు ఏ కులానికి చెందినవారో తెలియదు. నమ్మాళ్వారులది మత్స్యకార కులం, కులశేఖరాళ్వారులు క్షత్రియులు, పెరియాళ్వారులు, తొండరడిప్పొడి, మధురకవి ఆళ్వారులు బ్రాహ్మణులు. గోదాదేవి (శ్రీ ఆండాళ్) బ్రాహ్మణులైన విష్ణుచిత్తులవారి చేత పెంచబడింది. తిరుప్పాణాళ్వారులు పంచములు. దీనిని బట్టి భక్తిమార్గానికి కులంతో సంబంధం లేదనే విషయం విదితమౌతుంది.

వీరిలో కులశేఖరాళ్వారులు తిరువాన్కూరు పాలకులలో ఒకరు. వీరి భక్తి ఆవేశపూరితమైనది. "పెరుమాళ్ తిరుమొళి" అనే ఉత్తమ కవిత్వంతో కూడిన విష్ణుభక్తి పారవశ్య గ్రంథాన్ని వ్రాశారు.

తొండరడిప్పొడి ఆళ్వారులు శమదమ సద్గుణాన్వితులు, విష్ణుభక్తి తత్పరులు. తొండర్ అంటే భక్తుల, అడిప్+పొడి అంటే పాద ధూళి. ఇలా ఆయన తనను 'భక్తాంఘ్రిరేణువు'గా

అభివర్ణించుకున్నారు. వైష్ణవంలో భగవద్భక్తి కన్నా భాగవత భక్తే మిన్న. వీరిని తెలుగువారు విప్రనారాయణుడని పిలుచుకుంటారు. ఈయన్ని లోబరచుకుంటానని దేవదేవి అనే వేశ్య శపథం చేసి, ఆయన చెంతజేరి తన శృంగార చేష్టలతోను, చతుర సంభాషణలతోనూ లోబరచుకుంటుంది. వీరి కథను తెలుగులో సారంగు తమ్మయ్య అనేకవి (ఈయన గోల్కొండ కరణం) 'వైజంతీ విలాసము' అనే చక్కటి కావ్యంగా నిర్మించాడు. ఈ కావ్యమే 'విప్రనారాయణ' అనే తెలుగు చలన చిత్రానికి ఆధారం. విప్రనారాయణ, దేవదేవికి వశమైన విధాన్ని ఆ కవి ఇలా వర్ణించాడు.

శ్లో॥ **ఆ విప్రోత్తము వజ్ర పంజర నిభంబై నిశ్చలంబైన స**
**ద్భావం బంగనా సాహచర్య గుణ సంపర్కంబునన్ లోహమై,**
**గ్రావంబై, దృఢదారువై, తరుణ వృక్షంబై, ఫలప్రాయమై,**
**పూవై, తన్మకరందమై, కరగె బోఁబో నీళ్లకుం బల్చనై.**

ఈయనమీద శ్రీరంగనాథస్వామి ఆలయంలో బంగారు పాత్ర దొంగిలించినట్లు అభియోగం రాగా, శ్రీరంగనాథులు ఆలయాధికారికి కలలో కనిపించి, ఆయన నిర్దోషిత్వాన్ని తెలియజేశారు. తరువాత, విప్రనారాయణ, దేవదేవి, మహాభక్తులై విష్ణు సాయుజ్యాన్ని పొందారు. ఈయన తిరుమాలై (పూలదండ) తిరుప్పళ్లి ఎఱుచ్చి (ప్రభాత గానము) అనే గ్రంథాలను వ్రాశారు.

తిరుప్పనాళ్వారులు అస్పృశ్యుడు. దేవాలయ ప్రవేశం లేనందువల్ల కావేరీ నదీ తీరంలో శ్రీరంగనాథుణ్ణి ప్రార్థించేవారు. ఈయన సమాధిస్థితిలో ఉండగా, తెలియక ఈయన్ని

గాయపరచిన సారంగముని అనే వైష్ణవుడికి శ్రీరంగనాథుడు కలలో కనిపించి, తిరుప్పనాళ్వారులను భుజం మీద ఎక్కించుకొని ఆలయానికి తేవలసిందిగా ఆదేశించారు. సారంగముని అలాగే చేశాడు. భగవదనుగ్రహం అన్ని కులాల మీద సమంగా ఉంటుందని నిరూపించడానికి వీరి కథను రామానుజులు పదే పదే ఉదాహరిస్తూ ఉండేవారట.

సామంత రాజైన తిరుమంగై ఆళ్వారులు పెరియ తిరుమాడల్, పెరియ తిరుమొళి, తిరుకుఋన్ దండకం వంటి అనేక భక్తిపారవశ్యమైన గేయకృతులు రచించారు.

పెరియాళ్వారుకు విష్ణుచిత్తులనే నామాంతరం ఉంది. వీరే గోదాదేవిని పెంచారు. వీరిద్దరి చరిత్రనే శ్రీకృష్ణ దేవరాయలవారు తెలుగులో 'ఆముక్త మాల్యద' అనే ప్రౌఢ ప్రబంధంగా మలిచారు. ఆ విష్ణు చిత్తుడు విల్లిపుత్తూరులో ఉంటూ శ్రీరంగం వెళ్లే యాత్రికులకు నిరతాన్న దానం చేసేవారట. రాయలు వారిలా వ్రాశారు.

శా. **ఆ నిష్ఠానిధి గేహసీమ నడురేయాలించి నస్మోయి నెం**
**తే నాగేంద్ర శయానను పుణ్య కథలుం దివ్య ప్రబంధానుసం**
**ధానధ్వానము నాస్తి శాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ**
**పో నా స్త్వో దనసౌష్ఠవం చ కృపయా భోక్తవ్య మన్మాటలున్.**

నడిరేయి వెళ్ళినా ఆయనింట్లో విష్ణు కథలూ, దివ్యప్రబంధాను సంధాన రవాలే కాక, ఆ విష్ణుచిత్తుడు అతిథులనుద్దేశించి, చెప్పే "అయ్యా! కూరలు లేవు, అన్నం వేడిగా లేదు, భక్ష్యాలు లేవు, నామీద కృపతో భోజనం చేయండి' అనే

ఉపచార వాక్యాలు వినిపిస్తూ ఉంటాయట.

విల్లిపుత్తూరులో విష్ణుచిత్తుడు మన్నారుస్వామికి తులసిమాల నలంకరించగా స్వామి "నీవు మధురలో నున్న పాండ్యరాజు ఆస్థానానికి వెళ్ళి కువ్యాఖ్యానాలు చేసే దుర్మదాంధులైన పండితుల నోడించి పాండ్యుని వైష్ణవుడుగా మార్చమన్నాడట. విష్ణుచిత్తుడు బెదిరిపోయి, 'స్వామీ!

మ. **గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకికా**
**వహనంబో వనమాలి కాకరణమో, వాల్లభ్యలభ్య ధ్వజ**
**గ్రహణంబో, వ్యజనాతపత్ర ధృతియో, ప్రాగ్దీపికారోపమో**
**నృహరీ వాదములేల, లేరే యితరుల్నీ లీలకుం చాత్రముల్.**

మీ కోవెల శుభ్రం చెయ్యడమో, తీర్థం తేవడమో, పల్లకీ మొయ్యడమో, తులసి మాలలు కట్టడమో, ధ్వజం మొయ్యడమో, విసనకఱ్ఱ వీచడమో, దీపం పెట్టడమో చెయ్యగలను గాని, నాకీ వాదాలెందుకు, నాకిది చేతకాదు, ఇతరులను పంపండి' అన్నాడట.

కాని స్వామి వినలేదు. విష్ణుచిత్తుడికి అఖండ పాండిత్యం అనుగ్రహించాడు. విష్ణుచిత్తుడు వాదంలో గెలిచి పాండ్యరాజును వైష్ణవుడుగా మార్చాడు. విష్ణుచిత్తుడు 'తిరుప్పల్లాండు' అనే ప్రసిద్ధ స్తోత్రం రచించి గానం చేశాడు. ఈ స్తోత్రానికి పల్లవిగా 'పల్లాండు, పల్లాండు, పల్లాయిరత్తాండు, పలుకోరు నూరాయిరమ్' అని చెప్పారు. దీని అర్థం 'భగవంతుడికి మంగళమగు గాక! మంగళమగు గాక!' అని భగవంతునికే మంగళాశాసనం చేయ్యడం

వలన ఈ ఆళ్వారుస్వామికి 'పెరియాళ్వారు' అంటే ఆళ్వారులలో పెద్ద అనే సార్థక నామం వచ్చింది.

గోదాదేవి ఆళ్వారులలో ఒక్కగానొక్క స్త్రీ. ఈమెనే శ్రీ ఆండాళ్ అమ్మవారు అని అంటారు. ఈమె ప్రతిరోజు తండ్రి కట్టిన పూలదండను తాను ముందర ధరించి విల్లిపుత్తూరులోని శ్రీకృష్ణునికి ధరింజేసేది. తండ్రి ఇది చూచి, ఇది భగవదపరాధమని వారించాడు గాని రాత్రి శ్రీకృష్ణుడు ఆయనకు కలలో కనిపించి ఆమె ధరించిన తరువాత వేసే దండలే తనకు ప్రీతిపాత్రమని చెప్పాడట. ఆమె యుక్తవయస్సు రాగానే ఎవ్వరిని వివాహం చేసుకోవడానికి ఒప్పుకోలేదు. తాను శ్రీరంగనాథుడినే వివాహం చేసుకుంటానన్నది.

అర్చామూర్తి నెలా వివాహం చేసుకుంటుంది? ఈ సందేహంతో బాధపడే విష్ణుచిత్తుడు ఆమెను శ్రీరంగం తీసుకువెళ్ళాడు. పాండ్యరాజు, ప్రధానార్చకుల సహాయంతో అర్చామూర్తితో వివాహం జరిపించాలనుకుని ఏర్పాట్లు చేశారు. ఆరోజు శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహం చేసుకున్న శుభలగ్నం. అదే లగ్నంలో గోదాదేవి పెండ్లికూతురులా అలంకరించుకొని శ్రీరంగనాథుని అర్చామూర్తి పాదాల వద్దకు చేరి ఆయనలో ఐక్యమై అంతర్ధానం అయింది! అందరు ఆశ్చర్య చకితులయ్యారు. ఇదే గోదా కళ్యాణం. వైష్ణవులు ధనుర్మాసారంభం నుండి రోజుకొక పాశురం చొప్పున ఆండాళ్ తల్లి రచించిన తిరుప్పావై లోని ముప్పై పాశురాలు చదివి చివరి రోజున గోదా కళ్యాణం చేస్తారు.

ఆండాళ్ తల్లి తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అనే స్తోత్రాలు రచించింది. తిరుప్పావైలో ముప్పై పాశురాలున్నాయి.

భగవద్భక్తి నినుమడింప చేసే అద్భుత రచనగా ఇవి ప్రసిద్ధి పొంది ధనుర్మాసంలో వైష్ణవులందరిచేత అనుసంధానింపబడుతున్నాయి.

అళ్వారులందరిలోనూ ప్రసిద్ధులు నమ్మాళ్వారు. ఈయనకు శఠకోప యతి అనే నామాంతరం కూడ ఉంది. నాలుగు వేదాలకు సారభూతమైనవి అని చెప్పబడే తిరువృత్తం, తిరువాసరియమ్, తిరువాయి మొళి, పెరియ తిరువందాది అనే నాలుగు గ్రంథాలు రచించారు. వీటిలో తిరువాయి మొళికి విశిష్ఠ ప్రచారం ఉంది. ఆళ్వారులందరు ఈయన అంశమే అని వైష్ణవులందరు నమ్ముతారు.

నమ్మాళ్వారు శిష్యుడే మధురకవి ఆళ్వారు. వీరు కవిగా ప్రసిద్ధి పొందారు. గురువును ప్రశంసిస్తూ 'కణ్ణినన్ సిరుత్తాంబు' అనే గ్రంథం వ్రాశారు. వీరు ఆళ్వారులలో చివరి వారు.

ఉపనిషత్సారభూతాలయిన ఆళ్వారుల స్తోత్రాలను 'నాలాయిరమ్' అంటారు. భక్తి తత్త్వానికి విశిష్ట ప్రచారాన్నిచ్చిన ఈ ఆళ్వారుల స్తోత్రాలను నాదముని నాలుగువేల స్తోత్రాలుగా సంకలనం చేసారు. వీరు తంజావూరు జిల్లాలోని మన్నారుగుడి గ్రామంలో క్రీ.శ.814లో జన్మించారు. వీరి మనుమడే అళవందారుగా ప్రసిద్ధిపొందిన యామునాచార్యుల వారు. వీరి శిష్యులు శ్రీశైల పూర్ణులు. వీరికి కాంతిమతి శ్రీదేవి అనేవారు సోదరీమణులు. వీరిలో కాంతిమతిని కేశవ సోమయాజి కిచ్చి వివాహం చేశారు.

ఇదీ సంక్షిప్తంగా అళ్వారుల చరిత్ర.

----

# 2వ అధ్యాయం
# రామానుజులు
## జీవిత విశేషాలు

కేశవ సోమయాజి కాంతిమతి దంపతులకు శ్రీ పెరంబూదూరులో క్రీ.శ.1017లో రామానుజులు జన్మించారు. వీరు బాలమేధావి. కంచిలో అద్వైత సిద్ధాంత పండితులైన యాదవ ప్రకాశులకు శిష్యుడయ్యారు.

ఆ శిష్యులలో రామానుజుల పినతల్లి కొడుకు గోవిందుడు కూడా ఉన్నాడు. అయితే గురువు అద్వైత పరంగాచెప్పే పాఠంతో రామానుజులు విభేదించేవారు. దానితో ఆయన గురువు ఆగ్రహానికి గురికావడంతో ఆయన్ను వదల వలసివచ్చింది.

అయితే యాదవ ప్రకాశులు, రామానుజుల ప్రతిభను గుర్తించి ఆయన అద్వైత సిద్ధాంతానికి ముప్పు తెస్తారని గుర్తించి ఇతర శిష్యులకీ విషయం చెప్పారు.

శిష్యులు కాశీయాత్ర నెపం పెట్టి దారిమధ్యలో రామానుజులను హత్య చెయ్యడానికి నిశ్చయించుకున్నారు. కాని తన పినతల్లి కొడుకిదంతా గ్రహించడం వల్ల రామానుజులను ఈ ముప్పునుండి తప్పించాడు. రామానుజులు అర్ధరాత్రి దుర్గమారణ్యాన్ని దాటి కంచి చేరుకున్నారు. ఇది మారువేషంలో వచ్చిన శ్రీకృష్ణుని సహాయంతోనే జరిగిందంటారు. గురువుకు చెడ్డ పేరు రాకూడదనే ఉద్ధేశ్యంతో రామానుజులు తన తల్లికి మాత్రమే

ఆ విషయం చెప్పి దాన్ని గోప్యంగా ఉంచవలసిందని ఆమెను వేడుకున్నారు.

శ్రీరంగంలో అళవందారు నివాసముండేవారు. ఆయనకు రామానుజుల ప్రతిభ తెలుసు. తన అవసానకాలంలో రామానుజులను తనవద్దకు రమ్మని కంచిలోనున్న రామానుజులకు కబురు చేశారు. కాని రామానుజులు శ్రీరంగం చేరే సరికే అళవందారు స్వామి దేహం చాలించారు. అళవందారు స్వామి పార్థివ దేహాన్ని చూచిన రామానుజులకు ఒక విశేషం గోచరించింది. ఆయన కుడి చేతి మూడువేళ్ళు ముడుచుకుని ఉన్నాయి. కారణం ఎవ్వరూ అర్థం చేసుకోలేక పోయారు. వ్యాస, పరాశరులకు సముచిత స్మారక చిహ్నం, నమ్మాళ్వారుల యెడల భక్తి ప్రపత్తులు పెంచడం, బ్రహ్మ సూత్రాలకు విశిష్టాద్వైత పరంగా వాఖ్యానం వ్రాయడం అనే మూడు కోరికల నది సూచిస్తుందని రామానుజులు అంతర్ దృష్టితో గ్రహించారు. నిజానికి అళవందారు స్వామికి విశిష్టాద్వైతపరంగా బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్య వ్రాయాలనే కోరిక ఉండేది. ఈ మహత్కార్యాన్ని రామానుజులు చేద్దామని దీక్షపట్టి కంచికి తిరిగి వచ్చారు. అప్పటికే అద్వైతపరంగా శంకరులు రచించిన వ్యాఖ్య బహుళప్రచారంలో ఉంది. దాన్నికాదని వేరే వ్యాఖ్య రాయడం తేలిక కాదని రామానుజులకు తెలుసు.

అళపందారు స్వామి గతించిన తరువాత వారి స్థానాన్ని అలంకరించడానికి రామానుజులే సమర్థులని భావించి అళవందారు శిష్యుడు పెరియనంబి కంచికి బయలుదేరగా, ఇక్కడ రామానుజులు పెరియనంబి వద్ద విశిష్టాద్వైత రహస్యాలు

తెలుసుకోవాలని కంచికి బయలుదేరారు. ఇద్దరు దారిలో మధురాంతకం వద్ద కోదండరామ స్వామి ఆలయంలో కలుసుకున్నారు. పెరియనంబిని గురువుగా భావించి ఆయన్ని భార్యతో సహా కంచికి రావలసిందని ఆహ్వానించి వారిద్దరిని కంచికి తీసుకువెళ్ళారు. అక్కడ పెరయనంబి రామానుజలకు వేదసారాన్ని బ్రహ్మసూత్ర సారాన్ని విశిష్టాద్వైత పరంగా వ్యాఖ్యానించి ఉపదేశించారు.

రామానుజుల భార్య తంజమ్మ. కులాచారాల విషయంలో వారిద్దరి దృక్పథాలలో చాలా తేడా ఉండేది. రామానుజులది విశాల దృక్పథం. ఒకసారి రామానుజులు తమ గురువైన తిరుక్కచ్చినంబిని భోజనానికి ఆహ్వానించారు. అయితే నంబి వచ్చిన సమయానికి రామానుజులు ఇంట్లో లేరు. కాని నంబి 'తొందరగా వెళ్ళాలి, భోజనం పెట్టండి' అని తొందర చేయడంతో తంజమాంబ భోజనం పెట్టి ఆ ప్రదేశాన్ని శుద్ధి చేసి తాను కూడా శుద్ధి స్నానం చేసిందట. దీనికి కారణం నంబి వైశ్యుడవడం. ఇంటికి వచ్చిన తరువాత ఈ సంగతి తెలుసుకొని రామానుజులు బాధ పడ్డారు. మరొకసారి ఆకొన్న వైష్ణవుడొకడు భోజనము పెట్టమంటే ఇంట్లో బియ్యం ఉన్నా కూడా లేవని అసత్యం పలికి రామానుజులకు ఆగ్రహం తెప్పించింది. మరొక సంఘటన రామానుజుల హృదయాన్ని మరీ బాధించింది. పెరియనంబి భార్యతో కూడా రామానుజుల ఇంట్లో ఉంటూ ఆయనకు దివ్యప్రబంధాన్ని బోధిస్తూ ఉంటే రోజులలో ఒక చిన్న

విషయంలో తంజమ్మ పెరియనంబి భార్యతో కలహం పెట్టుకుంది. నంబి దీనితో కలత చెంది వెంటనే వెళ్ళిపోయారు.

పై మూడు ఉందంతాలతో రామానుజులు కలత చెంది భార్యను పుట్టింటికి పంపించి తాను సన్యాసం తీసుకొని 'యతిరాజ' అని ప్రసిద్ధి పొందారు. కంచిలోనే మఠం స్థాపించి విశేషకీర్తి నార్జించారు. ఆయన మేనల్లుడు దాశరథి మొదటి శిష్యుడు, మహాధనవంతుడైన కూరేశుడు ఆస్తినంతటిని దానంచేసి రెండవ శిష్యుడయ్యాడు.అద్వైతాచార్యుడైన యాదవ ప్రకాశుడు (రామానుజుల మొదటి గురువు) మూడవ శిష్యుడై సగుణ బ్రహ్మం మీద ఉపదేశం పొందాడు.

తిరుకోష్టియూరులో నున్న గోష్టీపూర్ణుల వద్ద 'ఓమ్ నమో నారాయణాయ' అనే తిరు మంత్రాన్ని ఉపదేశం పొందారు. అత్యంత గోప్యంగా ఉంచకపోతే నరకప్రాప్తి తప్పదని గురువు చెప్పినా వినక రామానుజులు దేవాలయ శిఖరం మీదనుండి అందరికి ఆ మంత్రాన్ని ఉపదేశించారు. గురువులు కోపిస్తే "నేను నరకానికి పోయినా, వేలమంది తరిస్తారు కదా! అదే నాకు చాలు' అని బదులు చెప్పి తన సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని చాటుకున్నారు. కాశ్మీరం వెళ్ళి శంకరులు ఎక్కువగా ఆదరించిన భోధాయన వృత్తిని రాజు అనుమతితో శ్రీరంగానికి తీసుకు వెళ్తూండగా అక్కడి పండితులు దాన్ని అపహరించారు. అయితే ఈలోగా దాన్ని తనను అనుసరిస్తున్న కూరేశులు కంఠస్థం చేసి గ్రంథం లేనందుకు విచారించ పని లేదని భరోసా ఇచ్చారు. తరువాత వైష్ణవ సిద్ధాంత గ్రంథాలను అధ్యయనం చేసి తాను

స్వయంగా బ్రహ్మసూత్రాలకు విశిష్టాద్వైత పరంగా వ్యాఖ్య రచించి ఆ సిద్ధాంతాన్ని విశేషంగా ప్రచారం చేశారు. ఆ భాష్యాన్నే 'శ్రీభాష్యం' అంటారు.

శ్రీరంగనాథ ఆలయానికి సర్వాధికారిగా ఉంటూ దాన్ని శ్రీవైష్ణవ కేంద్రంగా మార్చారు. ఆలయ నిర్వహణ, పూజావిధానాలను క్రమబద్ధీకరించారు. తిరుపతిని సందర్శించి అక్కడకూడా పూజావిధానాన్ని క్రమబద్ధీకరించారు. అదే ఇప్పటికీ కొనసాగుతుంది. తన శిష్యుడు ప్రతివాదిభయంకర అణ్ణన్ స్వామి (క్రీశ. 1321 - 1454)' చేత 'శ్రీవేంకటేశ్వర సుప్రభాతాన్ని' రచింపజేశారు. దాన్ని ఇప్పుడు ప్రతిరోజూ సుప్రభాత సేవలో గానం చేస్తారు. ఉత్తరదేశ దిగ్విజయ యాత్ర చేశారు. యజ్ఞమూర్తి అనే అద్వైత పండితుణ్ణి ఓడించి తన శిష్యుడుగా చేర్చుకున్నారు. కాలక్రమంగా 'శ్రీభాష్యం' ప్రసిద్ధిపొందింది.

ఆరోజులలో దక్షిణాపథాన్ని చోళులు పరిపాలిస్తూ ఉండేవారు. వారు శైవులు. శైవం, వైష్ణవం, అద్వైతం విశేష ప్రచారంలో నున్న ఆకాలంలో సమున్నత దేవాలయాలు - అన్ని సిద్ధాంతాల వారికి దర్శనీయమైనవి - దక్షిణ భారతంలో నిర్మించబడ్డాయి. అవే ఇప్పుడు మనదేశ ఆధ్యాత్మిక సంపద.

చోళరాజు ఆగ్రహానికి గురైరామానుజులు శ్రీరంగం విడిచి మైసూరు చేరుకున్నారు. అక్కడ మేల్కొటిలో శ్రీకృష్ణ దేవాలయం నిర్మించి అస్పృశ్యులకు కూడా ప్రవేశం కల్పించి తన మానవతా

దృక్పథాన్ని ఆవిష్కరించారు. కొంతకాలం తరువాత శ్రీరంగానికి తిరిగివచ్చి క్రీ.శ.1137లో విష్ణుసాయుజ్యం పొందారు. ఆయనది 120 సంవత్సరాల పూర్ణాయుష్షు!

# 3వ అధ్యాయం

# విశిష్టాద్వైత సిద్ధాంతం

## 1. ప్రవేశిక

నిర్గుణ నిరాకార బ్రహ్మాన్ని ధ్యానమార్గం ద్వారా దర్శించి దానితో తాదాత్మ్యం చెంది మోక్షాన్ని పొందడం సిద్ధాంతపరంగా అంగీకారమే అయినా, అది సామాన్యులకు అవగాహన అయ్యేది గాని ఆచరణ సౌలభ్యం కలది గాని కాదని చాలామంది అభిప్రాయం. ప్రత్యక్షంగా కనిపించని తత్త్వం ఉందని నమ్మి దానినుపాసించడం సామాన్యులకు ఊహకందని మార్గం. ''నిశ్చలము, నిర్వికారమగు శంకరుని బ్రహ్మ మెట్టి కర్తృత్వ ప్రభావము లేనిదగుటచే, మనకు పూజ్యభావము నుదయించజేయదు.... భక్తులు తమ కష్టకాలములో భగవానునితో బొందు సజీవ సాన్నిధ్యమున కుచిత స్థానమును శంకరుడొసగలేదు', అని రాధాకృష్ణ పండతుడభిప్రాయపడెను. (భారతీయ తత్త్వ శాస్త్రం Vol పేజి. 195-196 తి.తి.దే. ప్రచురణ). అయితే, శ్రీ శంకరభగవత్పాదులు శివ, విష్ణు, గణపత్యాది మతములను ప్రవేశ పెట్టి, షణ్మతస్థాపనాచార్యులు అని

పేరుపొందారు. అద్వైత సిద్ధాంతంతోబాటు విగ్రహారాధన యొక్క ఆవశ్యకతను వారు అంగీకరించారు అనే విషయం గమనార్హం. ఈవిషయాన్ని భగవద్గీతకూడ వివరించింది.

శ్లో. **క్లేశోऽధికతరస్తేషామ్ అవ్యక్తాసక్తచేతసామ్ ।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥ (12.5)**

అవ్యక్త బ్రహ్మం మీద ఆసక్తితో చేసే సాధన కష్టతరమైనది. దేహాభిమానులకు అవ్యక్త బ్రహ్మ ప్రాప్తి కష్టమే!

జ్ఞానమార్గం క్లిష్టమైనదని, కర్మమార్గం కొంత సులభమే అయినా, నిష్కామంగా, ఈశ్వరార్పణగా కర్మచెయ్యడానికి కావలసిన సంస్కారం, త్యాగబుద్ధి అందరికి ఉండవని, అందుచేత సులభతరమైనది భక్తిమార్గమేనని చివరికి భగవద్గీత ఇలా ప్రవచించింది.

శ్లో. **సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥(18.66)**

నిత్యనైమిత్తికాది కర్మాచరణకంటే నన్ను శరణువేడడమే మేలు. అలా నాకు శరణాగతి చేస్తే నిన్ను అన్ని పాపాల నుండి విముక్తుణ్ణి చేస్తాను. నీకు శోకించవలసిన అవసరం లేదు అన్నాడు శ్రీకృష్ణుడు అర్జునునితో. దీన్ని వైష్ణవులు చరమశ్లోకం అంటారు.

దీనిలో సౌలభ్యం ఏమిటంటే, మన నియత కర్మలను భగవదర్పితంగా చేసి ఆయనమీద అచంచల విశ్వాసం ఉంచితే ఆయన మనలను పాపాల నుండి విముక్తుణ్ణి చేసి మోక్షం

ప్రసాదిస్తాడనేది. భాధ్యత ఆయనదే గాని మనదికాదు. ఇది భక్తిమార్గంలోని పరమార్థం. అయితే నియతకర్మలు వదలడమంటే అధర్మంగా ప్రవర్తించ వచ్చని మాత్రం కాదు. ఈ సిద్ధాంతాన్నే ఆళ్వారులు గానం చేశారు. అవి ద్రావిడ వేదంగా ప్రసిద్ధిపొందాయి.

రామానుజుల కాలం నాటికి అద్వైతం బహుళ ప్రచారంలో ఉంది. దానితోబాటు శైవం- కేవలం శివుడే దైవం అనే మతం- కూడా ప్రబలంగానే ఉంది. అయితే సామాన్య ప్రజలు భక్తి మార్గానికి ఆకర్షితులైనంతగా జ్ఞానమార్గానికి ఆకర్షితులు కాకపోవడానికి కారణం, అది దోషపూరితమైనదని కాదు, సామాన్యులకు ఆచరణ సాధ్యమైనది కాకపోవడం వల్లే. ఇదే పరిస్థితులలో రామానుజులు ఆధ్యాత్మిక రంగప్రవేశం చేసి విశేషాదరణ పొందారు.

శంకరులు ఆస్తికులు, రామానుజులూ ఆస్తికులే; శంకరులు వేదప్రామాణ్యాన్ని అంగీకరించారు, రామానుజులూ అంగీకరించారు - ఇలా వారి సిద్ధాంతాలలో సారూప్యం లేకపోలేదు. అయితే శంకరుల నిర్గుణ, నిరాకార బ్రహ్మతత్త్వం, జీవబ్రహ్మైకవాదం, ప్రపంచ మిథ్యావాదం - ముఖ్యంగా వీటితో రామానుజులు విభేదించారు. విశ్వం మిథ్యకాదని, పరమాత్మ జీవాత్మలు వేరువేరు అని, సకల కళ్యాణగుణ సమన్వితుడు, దివ్య మంగళ స్వరూపుడు అయిన శ్రీమన్నారాయణుడే సృష్టికర్త, సర్వ నియామకుడు అని, ఆయన మీద భక్తి మాత్రమే ఏకైక మోక్ష సాధనమని ప్రవచించారు. ఇక వారి సిద్ధాంతాన్ని విపులంగా చర్చిద్దాం.

అయితే ఇక్కడ ఒక విషయం చెప్పాలి. అద్వైతానికి, విశిష్టాద్వైతానికి, ద్వైతానికి ప్రస్థానత్రయమే ఆధారం. విశిష్టాద్వైతులకు ద్రావిడ వేదం, సుదర్శనభట్టర్, వేదాంతదేశికులు మొదలైన వారి రచనలు కూడ శిరోధార్యం. అయితే ప్రస్థానత్రయంలో ఎక్కడా ఈ మతభేదాలు గాని, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతాలనే పేర్లుగాని కనిపించవు. జీవాత్మ-పరమాత్మల భేదాభేదముల మీద ఆధారపడి ఆ సిద్ధాంతాల కాపేర్లు అనంతరం వచ్చినవి.

## 2. సారసంగ్రహం

కపిస్థలం దేశికాచార్య స్వామివారు తమ సిద్ధాంతత్రయ సంగ్రహములో విశిష్టాద్వైత సిద్ధాంత సారసంగ్రహంగా ఈ శ్లోకాన్ని అనుగ్రహించారు.

శ్లో॥ శ్రీమల్లక్ష్మణయోగినస్తు భువనంసత్యం తదీశః శ్రియః
కాంతో బ్రహ్మ. సఏవ, సోఽఖిలతనుః, భిన్నాస్తత శ్చేతనాః
సత్యా సంసృతిరీశనిగ్రహ కృతా, ముక్తిస్తు భక్త్యాదినా
తత్ప్రాప్తిః పరమే పదే తదనుభూత్యా ఖ్యేతి సంచక్షతే ॥

తన సంకల్ప మాత్రం చేత పరమాత్మ మూల ప్రకృతిని వినియోగించి మాయను ఉపకరణంగా చేసుకుని ఈ విశ్వాన్ని సృష్టిస్తున్నాడు. దానిని ప్రత్యక్షంగా మనం చూస్తున్నాము. అందుచేత అది సత్యమేగాని మిథ్యకాదు. శ్రీమన్నారాయణుడే విశ్వానికి అధిపతి, నియామకుడు. విశ్వంలోని చేతనాచేతన వస్తువుల నన్నిటిని ఆయన శరీరంగా కలిగియున్నాడు. జీవాత్మలు పరమాత్మకంటె వేరు, వారిద్దరికి ఐక్యము ఎన్నటికి కలుగదు.

కర్మానుసారం లభించిన ప్రాకృత శరీరమే సంసారము. భగవవంతుని గూర్చి నిశ్చల నిరంతర భక్తి ప్రపృత్తుల ద్వారా వైకుంఠవాసుడైన శ్రీమన్నారాయణుని సన్నిధిలో బ్రహ్మానుభవం పొందడమే మోక్షము.

ఈ సారసంగ్రహం ద్వారా శంకరులు ప్రతిపాదించిన ప్రపంచ మిథ్యాత్వం, జీవాత్మపరమాత్మల స్వరూపైకత్వం, బ్రహ్మముయొక్క నిరాకార, నిర్గుణ తత్త్వం - వీటన్నిటిని విశిష్టాద్వైతం నిరాకరిస్తుందనే విషయం స్పష్టమవుతుంది.

## 3. 'విశిష్టాద్వైతం' అంటే ఏమిటి?

'ఏకమేవాఽద్వితీయం' అనిశ్రుతి వాక్యం. శ్రుతికి వ్యతిరేకార్థం చెప్పడం శాస్త్ర సమ్మతంకాదు. అనుగుణంగానైనా సమన్వయంగానైనా అర్థంచెప్పాలి. అద్వైతం శ్రుతికి అనుగుణంగా, ఉన్నది బ్రహ్మం ఒక్కటే, అందుచేత జీవాత్మ పరమాత్మ అని రెండు తత్త్వాలున్నాయనడం తప్పు అంటుంది. అయితే విశిష్టాద్వైతం శ్రుతి సమన్వయంగా అర్థం చెబుతుంది.పరమాత్మ, అచేతనం (విశ్వం), చేతనం (జీవుడు) అని మూడు తత్త్వాలున్నాయి. అందులో చేతనాచేతనాలు రెండు ప్రళయకాలంలో పరమాత్మలోనే కలుస్తున్నాయి. ఈ విధంగా చూసినప్పుడు అద్వైతమే. అయితే దీనిలో ఒక విశిష్టత ఉంది. ఈ చేతనా చేతనాలు రెండు పరమాత్మకు శరీరాలు. ఈ విధంగా పరమాత్మ అద్వితీయుడే అయినా ఆయనకు ఈ విశిష్టత ఉండడం వల్ల ఈ సిద్ధాంతాన్ని 'విశిష్టాద్వైతం' అన్నారు. 'జగత్తును, జీవులను దేవుని

శరీరము; దేవుని దేహముగానే వానికునికి గలదేలన, దేవుడే వానికాత్మయు, యజమానియునగును, బ్రహ్మమునకు వేరుగా వానికస్తిత్వము లేదు. జీవాత్మయు, జడ జగత్తు నీశ్వర భిన్నములే గాని, ఈశ్వరాధీనములై, ఈశ్వరసేవార్థముకాక వానికి వేరే ప్రయోజనము లేదు. కావున రామాజుని సిద్ధాంత మద్వైతమేకాని, యొక విశేషముతోఁ గూడియున్నది. ఏకమైన పరమాత్మ యనేకత్వము నంగీకరించును; అది జీవ జగత్తులతో కలిసి యుండును. అందుచే నది విశిష్టాద్వైతమైనది' అని రాధాకృష్ణ పండితులు విశ్లేషించారు. (భారతీయ తత్త్వ శాస్త్రం Vol. 5-పేజి. 196-197)

## 4. సారస్వతం

ఏ సిద్ధాంతానికైన తత్సంబంధిత సారస్వతం, దాని ప్రచారం ముఖ్యం. అద్వైత సారస్వతమంతా సంస్కృత భాషలోనే ఉంది. అందుచేత దానికి యావద్భారత దేశంలోనూ ప్రచారం వచ్చింది. ద్వైతమత సారస్వతం కొంత సంస్కృతంలోనూ కొంత కన్నడంలోనూ ఉంది. అయితే విశిష్టాద్వైత సిద్ధాంత సారస్వతం చాలమటుకు ద్రవిడ భాషలోనే ఉంది. ఈ సిద్ధాంతంలో భోధాయనవృత్తికి ఎక్కువ ప్రాధాన్యం ఉంది. ఇతని కాలం ఎవరూ నిర్ణయించలేదు. ఆయన బ్రహ్మసూత్రాల మీద వృత్తి రచించాడు. చారిత్రకంగా ఈయనే విశిష్టాద్వైత సిద్ధాంతానికి పునాదులు వేశాడని అంటారు. రామానుజులు కాశ్మీరంలోని సరస్వతీ పీఠంలో ఈ

వృత్తిని అక్కడి పండితులు చూపడానికి ఇష్టపడకపోయినా శారదాంబకటాక్షంతో సంపాదించి తిరిగి వెడుతూండగా మళ్ళీ ఆ పండితులు వెంటాడి స్వాధీనపరచుకున్నారు. అయితే ఈలోగా రామానుజుల ననుసరించిన కూరేశులు దానిని అధ్యయనం చేసి ధారణచేసి యుండడం చేత వారి సహాయంతో దాని ఆధారంగానే ఆళవందారు కోరిక మేరకు బ్రహ్మ సూత్రాల మీద శ్రీభాష్యం రచించారు. విశిష్టాద్వైత సిద్ధాంత సారస్వతంలో ఇది మకుటాయ మానమైనది. దీనికి సుదర్శనభట్టు శ్రుత ప్రకాశిక అనే టీక రచించారు. ఆళ్వారులు ఉపదేశ సారస్వతాన్ని నాథముని ఒక క్రమపద్ధతిలో నాలుగువేల పాశురాలలో క్రోడీకరించారు. అదే ద్రావిడ వేదంగా ప్రసిద్ధినొంది పారాయణ చేయబడుతూంది. నమ్మాళ్వారు తిరువాయిమొళి, ఆండాళ్ తిరుప్పావై ప్రసిద్ధాలు. వేదాంతదేశికుడు రామానుజుల శ్రీభాష్యానికి, గీతాభాష్యానికి తాత్పర్యమేకాక ఇంకా అనేక ఇతర రచనలను చేశాడు. వీరి దయాశతకం, పాదుకా సహస్రం ప్రసిద్ధాలు. శ్రీ పిళ్లై లోకాచార్యుల వారి శ్రీవచనభూషణము ప్రసిద్ధ గ్రంథం. ఇలా అపారమైన సారస్వతం తమిళంలోనూ, సంస్కృతంలోనూ విశిష్టాద్వైత సిద్ధాంతం మీద వెలసింది.

## 5. ప్రమాణములు

సత్యాన్వేషణలో - అది ఏ శాస్త్రానికి సంబంధించినదైనా - ప్రమాణాలు పునాదిరాళ్ళలాంటివి. వేదాంతం ముఖ్యంగా

ప్రమాణాలను ఆధారంగా చేసుకునే సిద్ధాంతాలను ప్రతిపాదించింది. ప్రమాణాలు అనేకం. అయితే అందులో ప్రత్యక్షం, అనుమానం, శబ్దం అనే మూడూ ముఖ్యం. ఈ మూడింటిని కాక కొన్ని ఇతర ప్రమాణాలను కూడా అద్వైతం ఆయా సందర్భాలలో అంగీకరించింది. శబ్ద ప్రమాణం అంటే వేద ప్రమాణం అన్నమాట. వేదం పరమాత్మ నిర్గుణుడు, నిరాకారుడు, త్రికాల అబాధితుడు జనన మరణాల కతీతంగా అన్ని కాలాలలోనూ ఉండేవాడు అని చెబుతుంది. అందుచేత బ్రహ్మం సత్యం. మన కంటికి కనిపించే విశ్వం మాత్రం సృష్టి, స్థితి లయలకు లోనై అశాశ్వతంగా ఉండేది అని వేదం చెబుతుంది. అందుచేత విశ్వం అసత్యం. ఇలా శంకరులు వేద ప్రమాణానికి ప్రథమ స్థానం ఇచ్చారు. ప్రత్యక్ష ప్రమాణానికి రెండవ స్థానాన్ని ఇచ్చారు. దీనికారణంగా విశ్వం వ్యావహారిక సత్యమని, పరమాత్మ పారమార్థిక సత్యమని అన్నారు.

అయితే రామానుజులు ప్రత్యక్ష, అనుమాన, శబ్దప్రమాణాలను ఒప్పుకున్నా, ప్రత్యక్ష ప్రమాణానికి పెద్దపీట వేశారు. ప్రత్యక్షంగా కనిపించేదాన్ని ఏదో శాస్త్రవాక్యం ఆధారంగా దాన్ని మిథ్యగా నిరాకరించడం రామానుజులు ఒప్పుకోరు. ఆయన ప్రత్యక్షంగా కనిపించేదానికి విరుద్ధంగా శాస్త్రానికి అర్థం చెప్పకూడదంటారు. అయితే యజ్ఞం చేస్తే హవ్యాన్ని దేవతలకు అగ్నిదేవుడు అందిస్తాడు అని వేదం చెబుతుంది. పితృకార్యం చేసినప్పుడు పిండ ప్రదానం చేస్తే అది పితృదేవతలకు

చేరుతుందని, దానికోసం వారు వేచిఉంటారని వేదం చెబుతుంది. వాటిని ప్రత్యక్షంగా మనం చూడలేము. అందుచేత ఏది మనకు ప్రత్యక్షంగా కనిపించదో దాని విషయంలో మాత్రమే శాస్త్రం ప్రమాణం. అలా నమ్మనివాళ్ళు నాస్తికులు అని విశిష్టాద్వైత సిద్ధాంతం.

మరి వేదశాస్త్రాలలో కొందరు దేవతలకు అనేక దివ్యమంగళ రూపాలు కూడా ఆపాదించి ఉపాసనలను ఉపదేశించబడ్డాయి. మరి ఈ రూపాలన్నీ మనకు ప్రత్యక్షంగా గోచరించడం లేదు గనుక ఆ ఉపాసనలన్నీ వ్యర్థం అంటే ఎలా? అందుచేత రామానుజులు ప్రత్యక్షంగా కనిపించేది నమ్మండి, మన జ్ఞానేంద్రియ వ్యవస్థకి అందని వాటిమీద శబ్ద ప్రమాణాన్ని అంగీకరించండి అని ఉపదేశించారు. దీని పర్యవసానమే ప్రపంచం సత్యం అనే సిద్ధాంతం.

ఇక అనుమాన ప్రమాణం ఆయా సందర్భాలలో అంగీకార యోగ్యమే.

## 6. పరమాత్మ సశరీరుడు

విశిష్టాద్వైత సిద్ధాంతాలలో భక్తి, ప్రపత్తి (శరణాగతి) అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకున్నాయి. నిరాకార, నిర్గుణ బ్రహ్మం భక్తికి అనుకూలమైన దైవ స్వరూపం కాదని రామానుజల సిద్ధాంతం. పురాణేతి హాసాలన్నింటిలోనూ పరమాత్మను సగుణ సాకార తత్త్వంగానే చిత్రీకరించినప్పుడు పరమాత్మకు రూపంగాని గుణాలుగాని లేవనడం అసంగతం. శంకరుల నిరాకార బ్రహ్మం ఒక శూన్యం లాంటిదని, అది బౌద్ధుల శూన్యవాదానికి చేరువగా

ఉందని, అది ఆమోదయోగ్యం ఎంతమాత్రం కాదని రామానుజుల అభిప్రాయం. పరమాత్మ నిరాకార నిర్గుణుడైనపుడు ఆయన ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణాలకు అందని తత్త్వమే అవుతాడు. ఏ ప్రమాణానికీ అందని తత్త్వాన్ని ఉందని నమ్మడం, పూజించడం సాధ్యంకాదు.

పరమాత్మ దివ్యమంగళ స్వరూపుడు. విశిష్టాద్వైతంలోని ప్రధాన అంశం మరొకటి ఉంది. అది పరమాత్మ విశ్వానికంతకు తానే శరీరం. ఈయన పరవాసుదేవుడుగా వైకుంఠంలో లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవి, అనంత, గరుడ, విష్వక్సేనులతో కలిసి ఉంటాడు. ఈయనకు వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చమూర్తి అనే నాలుగు అవతారాలు. ఇందులో వ్యూహము సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులనే మూడు విధాలుగా ఉంటుంది. సంకర్షణుడు జీవతత్త్వానికి, ప్రద్యుమ్నుడు మనస్తత్త్వానికి అభిమాన దేవతలు. అనిరుద్ధుడు జగద్రక్షకుడు.

రాముడు, కృష్ణుడు మొదలైన అవతారాలు విభవావతారాలు. హృదయాంతర్గతుడైన భగవత్తత్త్వమే అంతర్యామి. దివ్యదేశాలైన తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీరంగంలో శ్రీరంగనాథుడు, కంచిలోని వరదరాజ స్వామి ఇత్యాదులు అర్చావతారములు.

మరి శ్రుతి 'యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అని చెబుతుంది కదా. పరమాత్మ నిరాకారుడు గనుక ఆయన్ని

మాటలతో వర్ణించడానికి గాని మనస్సుతో ఊహించడానికి కాని శక్యం కాదు అని అర్థం కదా! అంటే అది సరికాదు అంటారు విశిష్టాద్వైతులు. దీని అర్థం ఆయన దివ్యమంగళ స్వరూపాన్ని అనంత కళ్యాణగుణాలను మాటలతో వర్ణించడానికి గాని మనస్సుతో ఊహంచడానికి గాని శక్యం కాదని దాని అర్థం. అదే శ్రుతి, తరువాత 'సత్యం, జ్ఞానం, అనంతం, బ్రహ్మ' అని పరమాత్మ స్వరూప లక్షణాలను చెప్పింది కదా! అందుచేత శ్రుతి వాక్యాలకు పరస్పర విరుద్ధమైన అర్థాలు కాక సమన్వయ దృష్టితో పరిశీలించినప్పుడు ఆయనకు దివ్యమంగళ స్వరూపం ఉందని, దాన్ని వీక్షించడానికి దివ్యదృష్టి కావాలని, భగవద్గీతలోని విశ్వరూప సందర్శన యోగం వివర్తిస్తుందని విశిష్టాద్వైతం వివరిస్తుంది.

ఇక విశిష్టాద్వైతంలో లక్ష్మీదేవికి, భక్తులకు సంబంధించి నంతవరకు, పరవాసుదేవుని కంటె విశిష్ట స్థానం ఉందని చెప్పాలి. జ్ఞానము, శక్తి, కరుణ పరవాసుదేవుని దివ్యలక్షణాలైతే, తల్లిది మాతృ వాత్సల్యం. ప్రపంచంలో పాపాలు చెయ్యని వారెవరు? అందరు ఏదోపాపం చేసినవాళ్ళే. వారు క్షమించమని సర్వస్వతంత్రుడైన శ్రీమన్నారాయణుడిని వేడినా ఆయన సుముఖంగా ఉండడట. అమ్మ కరుణించి క్షమించమని భర్తకు నివేదిస్తుంది. అంతే క్షమాభిక్ష దొరుకుతుంది. దీన్ని శ్రీవైష్ణవ సాంప్రదాయంలో 'పురుషకారం' అంటారు. ఆమె నిరంతరం స్వామి చెంతనుండి భక్తులను కాపాడుతుంది. ఈమె ద్వారానే భక్తులు తమ కోర్కెలు తీరేందుకు స్వామి నాశ్రయించాలి. ఈదివ్య

దంపతులిద్దరు శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఆరాధనీయులు- వారికే శరణాగతిని చెయ్యాలి. ఏ సిద్ధాంతానికి చెందినవారైనా చివరికి ఈ భక్తి మార్గానుయాయులే అవుతున్నారనేది అక్షరసత్యం. దీనివల్లే విశిష్టాద్వైతం శుష్క వేదాంతం కాకుండా దైవభక్తి, విశ్వాసాలతో కూడిన సజీవ తత్త్వంగా, మతంగా మారిందని, ఆపదలో నున్న వారికి ఒక అనిర్వచనీయమైన ధైర్యాన్ని, అభయాన్ని ఇస్తుందని విజ్ఞుల అభిప్రాయం. అద్వైతులు సహితం ఆపత్కాలంలో సగుణ, సాకార దైవాన్ని భక్తి ప్రవత్తులతో ఆరాధించడం సర్వసామాన్యం.

ఇక్కడ ఒక విషయం వివరించాలి. భగవంతుడు సశరీరి అన్నాం కదా! మరి ఆయన కూడా ఇతర శరీరధారులవలె సుఖదుఃఖాలకు లోనౌతాడా అంటే కాదు అని సమాధానం. కారణం సుఖదుఃఖాలు కర్మను బట్టి వస్తాయికాని దేహధారిత్వం వల్లకాదు. ఆయనే కర్మాధ్యక్షుడైనప్పుడు ఆయనకు సుఖదుఃఖాలేమిటి? ఆయన జీవులకు కర్మానుసారంగా సుఖదుఃఖాలను కలుగజేస్తాడు. జీవులు తమ పూర్వవాసనానుసారం నడుచుకుంటూ పాపపుణ్యాలను చేస్తూ ఉంటారు. వాటి ప్రతిఫలం అనుభవిస్తూ ఉంటారు. పరమాత్మ దానికి బాధ్యుడు కాదు.

## 7. పరమాత్మ అనంత కళ్యాణ గుణ సమన్వితుడు

పరమాత్మకు ఈ కళ్యాణ గుణాలున్నాయనిచెప్పుకుంటాం గాని అవన్నీ ఆయనకున్న అన్ని గుణాలు అనికాదు. ఆయన కళ్యాణ గుణాలు అనంతం అని

విశిష్టాద్వైతం. అయితే ముఖ్యమైన గుణాలను పండితులు, పరమభక్తాగ్రేసరులు అయిన వైష్ణవ స్వాములు వర్ణించారు. వాటిని కపిస్థలం దేశికాచార్య స్వామి వారు వివరించారు.

అందులో ముఖ్యమైనవి సర్వజ్ఞత్వం- అంటే ఆయనకు తెలియనిది లేదు; సర్వశక్తిత్వం- ఆయన చెయ్యలేని కార్యం లేదు; సర్వసంకల్పత్వం- ఆయన సంకల్పించిన మాదిరిగానే కార్యాన్ని చక్క బెట్టగలగడం; ఉదార స్వభావం- ఆశ్రయించినవారికి కోరినదానికంటె అధికంగానే ఇచ్చి నేనిచ్చిందేముందిలే అనుకోవడం; కృతజ్ఞత- ఏ చిన్న సేవచేసినా, దాన్ని అధికంగానే తలంచడం; వాత్సల్యం- భక్తుల దోషాలను పెద్దగా పట్టించుకోకపోవడం; సౌలభ్యం- తలంచినంతమాత్రం చేత భక్తుల చెంతజేరి కాపాడడం (ఇది గజేంద్ర మోక్షంలో కనిపిస్తుంది); ఆశ్రితపారతంత్ర్యం- తన గొప్పతనాన్ని పట్టించుకోకుండా, ఎంత సామాన్యులకైనా సహాయం చెయ్యడం, (ఇది కుచేలోపాఖ్యానంలో కనిపిస్తుంది). ఆయన అనంత కళ్యాణగుణాలలో ఇవికొన్ని. విష్ణుసహస్ర నామంలో ఇంకా ఈ గుణాలను విస్తృతంగా భీష్మాచార్యులు వారు వివరించారు. అవీ సమగ్రం కాదంటారు పెద్దలు.

మరి బ్రహ్మం 'నిర్గుణుడు' అని శ్రుతిచెప్తుంది కదా అంటే నిజమే. గుణాలు అంటే ఏమిటి? సత్త్వ రజస్తమోగుణాలు. అవి ప్రకృతిలో ఉంటాయి. కనుక మానవులలో కూడా ఉంటాయి. మరి ఇలాంటి ప్రాకృతములైన గుణాలను పరమాత్మకెలా

ఆపాదిస్తారు? 'నిర్గుణుడు' అంటే ప్రాకృతములైన గుణాలు లేనివాడనే అర్థం. అలాగని ఆయనలో ఏ ఉత్తమ గుణాలు లేవని కాదు. ఆయనలో దయాగుణం లేదంటారా, క్షమాగుణం లేదంటారా! అంతకన్నా అపచారం ఇంకొంకటి ఉందా? ఆయనలో ఆగుణాలు లేవంటారా? క్షమాగుణం ప్రత్యక్షంగా కనిపిస్తూనే ఉంది కదా! తిరుమల కొండపైన అశేష భక్తజన సందోహం స్వామి దివ్యమంగళ స్వరూపాన్ని దర్శించి, కామితార్థాలను తీర్చుకోవడం మనం ప్రత్యక్షంగా చూస్తూ ఉంటే ఇంతకన్నా ప్రత్యక్ష ప్రమాణం ఏం కావాలి? విశిష్టాద్వైతం చెప్పేది శిరోధార్యం.

అద్వైతులు నిర్గుణ నిరాకార బ్రహ్మాన్ని సిద్ధాంతపరంగా ఆమోదించినా, నిత్య జీవితంలో వారు కూడా విశిష్టాద్వైత సిద్ధాంతంలోని సగుణ, సాకార బ్రహ్మాన్ని ఆరాధిస్తున్నారనే సత్యాన్ని కాదనలేం కదా! దీనికి కారణం శ్రీ శంకర భగవత్పాదులు కూడా విగ్రహారాధనను సమర్థించడమే!

## 8. జీవాత్మ పరమాత్మ ఒకటి కాదు

పరమాత్మ సర్వవ్యాపి. తద్విరుద్ధంగా జీవాత్మ అత్యంత సూక్ష్మంగా ఉంటాడు. రెండూ అవయవ రహితమైన చైతన్య స్వరూపాలే. ఇద్దరూ జ్ఞానస్వరూపులే. అయితే వీరిద్దరు ఒకటే అనుకోకూడదు. పరమాత్మ ఒకే ఒకడు. ఆయన కంటే గొప్పవాడు గాని సమానుడుగాని మరియొకడు లేదు. అయితే జీవాత్మలు మాత్రం అనంతం. ఎన్ని జీవులుంటే అన్ని జీవాత్మలుంటాయి.

బహువచనం 'జీవాత్మ' కే వర్తిస్తుంది కాని పరమాత్మకు కాదు. జీవాత్మ అణుస్వరూపుడు అనే విషయంలో సిద్ధాంత భేదాలున్నాయి. బ్రహ్మం అంతఃకరణాన్ని ఉపాధిగా చేసుకొని జీవత్వాన్ని అణుస్వరూపాన్ని పొందిందని అందుచేత ఈ అణుత్వం అనేది ఉపాధి దోషం వల్ల సంభవించిందని అద్వైతులవాదన. కాని ఈ వాదాన్ని విశిష్టాద్వైతులు నిరాకరించారు. పరమాత్మ జీవాత్మ వేరు గనుక జీవాత్మకు గల అణుత్వం స్వాభావికమే గాని ఔపాధికం కాదని సిద్ధాంతీకరించారు. స్మరణశక్తి ప్రాకృత శరీరానికి చెందింది గనుక జీవులకు పూర్వజన్మ జ్ఞానం ఉండదు.

ఇక జీవాత్మ పరమాత్మలు వేరనడానికి ముండకోపనిషత్తు లోని ఈ మంత్రాన్ని విశిష్టాద్వైతులు ఆధారంగా చేసుకుంటారు.

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా**
**సమానం వృక్షం పరిషస్వజాతే !**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి**
**అనశ్నన్నన్యో అభిచాకశీతి ॥** **(5.1)**

సమాన గుణములు గలిగిన రెండు అందమైన పక్షులు అన్యోన్యంగా ఒకే వృక్షంమీద నివసిస్తున్నాయి. అందులో ఒక పక్షి ఫలాలను ఆరగిస్తూ ఉంటే రెండవపక్షి పళ్ళను తినకుండా నిర్లిప్తంగా వెలుగొందుతూ ఉంది. ఒక లోతైన వేదాంత విషయాన్ని శ్లోకరూపంలో అందించిన ఒక అందమైన ప్రకృతి చిత్రం ఈ శ్లోకం. సారస్వతపరంగా రూపకాలంకారంలో అందించిన వేదాంత విషయం.

ఇందులో వృక్షం శరీరానికి ప్రతీక. ఫలాల నారగించే పక్షి కర్మఫలాలను అనుభవించే కర్తయైన జీవాత్మను సూచిస్తుంది. నిర్లిప్తంగా చూస్తూ తేజోవంతంగా ఉండే పక్షి కర్మాచరణచేత కళంకం పొందకుండా తేజోవంతంగా ఉండే పరమాత్మ. కర్మలకు వాటిఫలాలకు లోనైన వాడు గనుక జీవుడు సుఖదుఃఖాలకు లోనై నిస్తేజంగా అజ్ఞానాంధకారంలో ఉంటాడు. పరమాత్మ కర్మపరాధీనుడు కాడు గనుక సుఖదుఃఖాలకు లోను కాకుండా, సాక్షీ భూతుడుగా జ్ఞాన స్వరూపుడుగా వెలుగొందుచూ ఉంటాడు.

ఈ మంత్రంలో జీవాత్మ పరమాత్మలు వేరని ద్వివచనంలో సూచించబడింది. నిజానికి జీవేశ్వరులిద్దరికి జ్ఞానం సమానధర్మమే. అయితే జీవుడు దుష్కర్మల ఫలితంగా జ్ఞానవిహీనుడౌతున్నాడు, శోభారహితుడౌతున్నాడు. పరమాత్మ శరీరంలో హృదయ కుహరంలో ఉన్నా కేవలం నిర్లిప్త సాక్షీభూతుడే గనుక కర్మ పరాధీనుడు కాకుండా ఆనంద స్వరూపుడుగానే ఉంటున్నాడు. అయితే ఈ జీవాత్మలు స్వతహాగా జ్ఞానస్వరూపులే అయినా కర్మానుసారంగా, మనుష్యులుగా పుట్టవచ్చు, అనేక రకాలైన జంతువులుగా నైనా పుట్టవచ్చు. ఈ పుట్టుకలను బట్టి ఉపాధికి తగిన జ్ఞానమే ఉంటుంది - హెచ్చు తగ్గులుంటాయన్నమాట.

ఇలాగే కఠోపనిషత్తులో (5.13) ''నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానాం, ఏకో బహూనాం యో విదధాతి కామాన్'' అని ఉంది. నిత్యుడైన ఒక చేతనుడు (పరమాత్మ), నిత్యులైన లెక్కలేనన్ని చేతనులకు (జీవులకు) అర్థించిన ఫలాలను ప్రసాదిస్తున్నాడని

జీవేశ్వర భేదాన్ని సూచిస్తుంది. భగవద్గీతలో, ముఖ్యంగా శ్వేతాశ్వతరోపనిషత్తులో జీవాత్మ పరమాత్మలు వేరని సూచించే వాక్యాలు అనేకం. ఉదాహరణకు భగవద్గీతలోని ఈ శ్లోకాన్ని చూడండి.

శ్లో. **తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**

**భవామి నచిరాత్ పార్థ మయ్యా వేశితచేతసామ్ ॥**

ఓ అర్జునా, నాయందే మనస్సు లగ్నం చేసిన పరమ భక్తులను, ఈ సంసార కూపం నుండి రక్షిస్తాను అన్నాడు. ఈ శ్లోకంలో జీవాత్మ - పరమాత్మల భేధం స్పష్టం.

## 9. జీవుడు

అయితే జీవాత్మ, పరమాత్మ వేరనుకున్నపుడు వీరిద్దరి మధ్య అనుబంధం ఏమిటి? జీవుడు స్వతంత్రుడా? తన ఇచ్ఛానుసారం సకల సౌఖ్యాలు కలిగించుకొని స్వేచ్ఛా జీవితం గడపగలడా? అంటే కాదంటుంది విశిష్టాద్వైతం. ప్రతి జీవుడు పుణ్యపాపకర్మల నాచరించేవాడే. జీవుడి స్వభావం అతని పూర్వ వాసనల మీద ఆధారపడి ఉంటుంది. ఆ స్వభావానుసారం అతను ప్రవర్తించి కర్మాచరణ చేస్తూ ఉంటాడు. ఆ కర్మాచరణలో పరమాత్మ ప్రమేయం ఉండదు. అంతవరకు మాత్రమే జీవుడికి స్వేచ్ఛ ఉందని చెప్పాలి. మరి ఆ కర్మానుసారం ఫలితాల ననుభవింపజేసే శక్తి సామర్థ్యాలు గల విశిష్ట వ్యక్తి ఒకడుండాలి కదా! ఆయనే పరమాత్మ - సర్వ స్వతంత్రుడు, ఒక విధంగా చూస్తే నియంత! ఆయన కర్మానుసారం జన్మను, సుఖదుఃఖాలను

కలుగజేస్తాడు. ఈ విషయంలో ఆయన నిష్పక్షపాతి. అందుచేత జీవుడు పరతంత్రుడే గాని స్వతంత్రుడు కాదు.

జీవుని ప్రధాన లక్షణం 'అహంకారం' లేక 'అహంబుద్ధి' అంటే తాను కర్త అనే జ్ఞాతృత్వం. ఇది అతనిలో అంతర్నిహితంగా ఎప్పుడూ వీడకుండా ఉంటుంది. ఇది లేకపోతే మోక్ష ప్రయత్నమే ఉండదు.

ఇది ఉండబట్టే కర్తృత్వభావంతో కర్మల నాచరించి వాటి ఫలితాలననుభవిస్తున్నాడు. విశిష్టాద్వైతంలో ఇది బంధమోక్షాల రెండింటిలోనూ ఉంటుంది. దేవుని ప్రమేయం లేకుండా కర్మానుసారం జీవుడు ప్రవర్తిస్తుండడం దేవుని పరిపూర్ణతకు లోటు కాదా? అంటే కాదంటుంది. దీనికి కారణం దేవుడే కర్మసూత్రాన్ని తన ఇచ్ఛానుసారం ప్రవేశపెట్టి తాను 'కర్మాధ్యక్షుడు' గా ఉంటున్నాడు గనుక తాను ప్రవేశపెట్టిన నియమాన్ని ఆయన ఉల్లంఘించడు. అది ఆయన నియమం. అందుచేత జీవుడు చేసే కర్మలకు ఆయన బాధ్యుడు కాడు.

విశిష్టాద్వైతంలో శేష-శేషి భావం ఒక ప్రధానాంశం. జీవుడు పరమాత్మకు దాసుడు - శేషభూతుడు అంటారు. సృష్టి, స్థితి, లయకారకుడైన పరమాత్మ 'శేషి'. ఈ శేషభూత భావం కేవలం పరమాత్మకే కాదు, పరమాత్మ భక్తులకుకూడా వర్తిస్తుంది. ప్రతి వైష్ణవుడు ముందుగా భక్తులకు శేషభూతుడు - అంటే భగవద్భక్తి కంటె భాగవత భక్తి మిన్న అనే సిద్ధాంతానికి విశిష్టాద్వైతంతో ప్రాధాన్యత ఎక్కువ. ఇక్కడ భక్తుల కులం ప్రధానం కాదు.

సోమశర్మ అనే నైష్ఠిక బ్రాహ్మణుడు కర్మలోపం చేత బ్రహ్మరాక్షసుడై ఒక మాలదాసరిని ఇలా ప్రార్థిస్తాడు (ఆముక్తమాల్యదలో)

క. **మీవంటి భాగవతులుం**
**బావనులుగ జేయరేని మరిగతి యేదీ**
**మావంటి వారికి, ఇక మా**
**యేవము వెనుకటిది చూడక ఈక్షింపు కృపన్. (6.55)**

ఇక మరొక ముఖ్యమైన విషయాన్ని మనం చర్చించాలి. అద్వైతంలో బింబ ప్రతిబింబవాదం అనేది ఉంది. మన ముఖం అద్దంలో ప్రతిబింబిస్తుంది. ఆ ప్రతిబింబం జీవుడు. అసలు ముఖం పరమాత్మ. ముఖం ప్రక్కకు తొలిగితే అద్దంలో ముఖం మాయమౌతుంది. అంటే జీవుడు పరమాత్మ యొక్క ప్రతిబింబమే కాని అతనికి స్వతంత్ర ప్రతిపత్తిలేదు. ఈ బింబ ప్రతిబింబ వాదాన్ని రామానుజులు తిరస్కరించారు. ''పరబ్రహ్మాంశమైనను, జీవాత్మ యథార్థము, అనన్యము, నిత్యము, బుద్ధిజ్ఞానసహితము, నిరవయవము, నిర్వికారము, అగోచరము, అణుస్వరూపమైనది. అది దేహేంద్రియ ప్రాణబుద్ధులకు వేరైనది. అది జ్ఞాత, కర్తయు, భోక్తయునై యున్నది. మానవునిలో స్థూలదేహమునకును, ప్రాణమునకును, పంచ కర్మేంద్రియములకును మనస్సునకును నంటియున్నది. ప్రాణము నింద్రియముల వలె నుపకరణము మాత్రమే' నని రామానుజుల జీవ స్వరూపాన్ని రాధాకృష్ణ పండితులు వివరించారు. (భారతీయ తత్త్వశాస్త్రం Vol 5- పేజి 234-235)

మరి జీవేశ్వరులు ఒకటే అంటే పరమాత్మకు కూడా

బంధమోక్షాలు సుఖదుఃఖాలు ఆపాదించవలసి వస్తుంది. అందుచేత శాస్త్రాలలో జీవేశ్వరులు ఒకటే అని అనిపించే వాక్యాలు ఉంటే వాటిని సమన్వయించుకోవాలి. జీవుడు, ప్రకృతి విశేషణాలు: పరమాత్మ విశేష్యం. ఈ ముగ్గురిలో పరిణామం విశేషణాలకే గాని, విశేష్యమైన పరమాత్మకు కాదు. అయితే ఈ ముగ్గురికి విశ్వంలో ఒక విశిష్టమైన ఐక్యత ఉంది. అయితే అది స్వరూపైక్యత కాదు అని వ్యాఖ్యాతలు చెప్పినమాట.

ఇలా జీవాత్మ పరమాత్మ స్వభావ స్వరూపాలను, వారి మధ్య భేదాన్ని విశిష్టాద్వైతం వివరిస్తుంది. ఎంతటి అద్వైతి అయినా భగవంతుణ్ణి ప్రార్థించేటప్పుడు తాను వేరని భగవంతుడు వేరని, ఆయన ఉత్కృష్టుడనే భావనతోనే కదాపూజిస్తారు. అందుచేత సిద్ధాంతపరంగా అద్వైతులే అయినా వ్యవహారపరంగా అందరూ విశిష్టాద్వైతులే అని అంటారు వైష్ణవులు. ఇందులో కొంత నిజం లేకపోలేదు.

## 10. మరి 'తత్త్వమసి' మాటేమిటి?

మరి ఛాందోగ్యంలో 'తత్త్వమసి' ఆ బ్రహ్మము నీవే అయిఉన్నావు - జీవాత్మ పరమాత్మలకు భేదము లేదు అని కుండ పగులగొట్టినట్లు చెప్తూ ఉంటే, కాదు జీవాత్మ పరమాత్మ వేరని సిద్ధాంతీకరించడం శ్రుతి విరుద్ధం కాదా అనే జటిలమైన ప్రశ్న ఉత్పన్నమౌతుంది. దీనికి సహేతుకమైన సమాధానం చెబుతేనే విశిష్టాద్వైతం యొక్క పునాది నిలుస్తుంది. మరి వారేమంటున్నారో చూద్దాం.

విశిష్టాద్వైత సిద్ధాంతం ప్రకారం నామరూపాత్మకంగా

సృష్టించబడిన జగత్తు బ్రహ్మమునకు శరీరం - ఆయన ఆత్మ లేక శరీరి. శరీర-శరీరి సంబంధం ఉండటం వల్ల బ్రహ్మము విశ్వము ఒక్కటే. అందుచేత 'తత్త్వమసి' అంటే నీవుకూడా బ్రహ్మమునకు శరీరమైన విశ్వంలోనే ఉన్నావు గనుక నీవు కూడా బ్రహ్మాత్మకుడవే అని అర్థం కాని 'నీవు ఆ బ్రహ్మమే అయిఉన్నావు' అని అద్వైతులు చెప్పినట్లు జీవాత్మ పరమాత్మల ఐక్యాన్ని ఛాందోగ్యోపనిషత్తు లోని 'తత్త్వమసి' అనే మహావాక్యం బోధించడం లేదు.

పరమాత్మ అద్భుతమైన శక్తి గలవాడు. ప్రళయం తరువాత తాను ఒక్కడుగా నున్నప్పుడు ఆ సూక్ష్మావస్థలో తనకు చేతనాచేతన శరీరం లేకపోవడం వల్ల తన లీలావిలాసానికి అనువుగా లేదని ఆయన 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి' అని తాను సమిష్టిగాను వ్యష్టిగాను ఉండే ఈ నామరూపాత్మక విశ్వంగా వ్యక్తమవాలని వీక్షణ పూర్వకంగా సంకల్పించాడు. అంతే! సృష్టి జరిగింది. ఆ సృష్టి పరమాత్మ శరీరమే సూక్ష్మదశ నుండి స్థూల దశపొంది ఆయనకోరుకున్నట్లు అనేకంగా వ్యక్తమయింది. అందులో 'తత్త్వమసి' నీవూ ఉన్నావు' అని శ్వేతకేతువుకి తండ్రి ఉపదేశించాడు. అంతేగాని ఆ పరమాత్మ నీవు ఒకటని కాదు.

ఈ మహాకావ్యంలో తత్=ఆ పరమాత్మ+త్వం=నీవు అని రెండిటిని చెప్పి పరమాత్మకు జీవాత్మకు భేదం సూచించబడింది.

తరువాత 'అసి', అయిఉన్నావు అని అభేదం కూడా సూచించబడింది. ఈ భేదాభేదాలకు సమన్వయమే విశిష్టాద్వైతం-

అదే 'ఈ పరమాత్మ సృష్టించిన విశ్వంలో నీవు ఒకడవై ఉన్నావు' అని, అంతేగాని ఆ పరమాత్మ నీవని కాదు.

పరమాత్మ సర్వజ్ఞుడు, జీవుడు సర్వజ్ఞుడు కాదు కదా! పరమాత్మ సృష్టికార్యం చెయ్యగలడు, జీవుడు చెయ్యలేడు కదా! మరి ఇద్దరూ ఒకటనడం అసంబద్ధం కదా! అలాగని జీవుడు జడపదార్థం కాదుకదా! అతను కూడా పరమాత్మ శరీరంలో భాగమే కదా. ఆ విధంగా చూసినపుడు ఆయనకు పరమాత్మకు శరీర-శరీరి సంబంధం ఉంది. అందుచేత జీవుడు విశ్వం అనబడే ఈ పరమాత్మ శరీరంలో భాగమే. ఇదే విశిష్టాద్వైతంలో 'తత్త్వమసి'కి అర్థం. విశిష్టాద్వైతం, అద్వైతంలాగ జీవాత్మ పరమాత్మల స్వరూపైక్యం ఒప్పుకోదు, ద్వైతంలాగ వారిద్దరూ పూర్తిగా వేరు వేరు తత్త్వాలనీ ఒప్పుకోదు. వారిద్దరు ఒక విధంగా వేరు, ఒక విధంగా ఒకటి అదే శరీర-శరీరి సంబంధం - విశిష్టాద్వైతం-ఒక విశిష్టతతో కూడిన అద్వైతం. అనేకాంశాలతో కూడిన వస్తువులో, విడివిడిగా ఆ అంశాలన్నీ ఆ వస్తువుకు విశేషణాలు, ఆ వస్తువు మొత్తం ఆ విశేషణాలతో కూడి విశిష్ట వస్తువు. చెట్టు ప్రధానం, ఆకులు అప్రధానం, కాని చెట్టుకు విశేషణాలు. చెట్టు విశేష్యం. ప్రకృతి జడం, జీవుడు సూక్ష్మం, పరమాత్మ సర్వ సమర్థుడైన కర్త. ముగ్గురు పారమార్థిక సత్యాలే. ప్రకృతి జీవుడు విశేషణాలు, పరమాత్మ విశేష్యం, అంటే ఆ రెండింటితో కూడిన విశిష్ట పురుషుడు. ఈ మూడు తత్త్వాలకు ఒక విశిష్టమైన ఐక్యత చెప్పడమే విశిష్టాద్వైతమని వ్యాఖ్యాతలు చెప్పారు! ఆ విశిష్ట వస్తువులో జీవుడు కూడా భాగమే గనుక 'తత్త్వమసి' అంటే ఆ

విశిష్ట వస్తువులో (పరమాత్మ చేత సృష్టించబడిన విశ్వంలో) నీవు కూడా భాగమే సుమా! కాని ఆ విశిష్టవస్తువు నీవు కాదు.

## 11. సృష్టి

రామానుజుల కాలంనాటికే సృష్టి ఎలా జరిగిందనే విషయంమీద అనేక మంది అనేక సిద్ధాంతాలను ప్రతిపాదించారు. జైమిని న్యాయదర్శనంలోనూ కణాదుడి వైశేషిక దర్శనంలోనూ పరమాణువుల సంయోగం వల్ల అంతకు ముందులేని వస్తువులు ఉత్పన్నమవుతున్నాయని, అలాగే ఈ పరమాణు సంయోగం వల్లే అంతకు ముందు లేని ఈ విశ్వం ఉత్పన్నమయిందని సిద్ధాంతరీకరించారు. దీనిని ఆరంభవాదం అంటారు. (దీనికి పీలుపాక వాదం అని మరొక పేరుంది. పీలువులు అంటే అణువులు) వీరు తార్కికులు, అసత్కార్యవాదులు.

ఇక సాంఖ్యులు నిరీశ్వరవాదులు. కపిల మహర్షి దీనికి ద్రష్ట. ప్రకృతి పురుషుల సంయోగం వల్ల, మూల ప్రకృతి పరిణామం చెంది పంచభూతాత్మకమైన ఈ విశ్వం రూపుదిద్దుకుందని వారివాదం. ఉన్న వస్తువే పరిణామం చెందిందని అన్నారు గనుక వీరిని సత్కార్యవాదులన్నారు.

మట్టి ఉపాదాన కారణం (material cause) కుమ్మరివాడు నిమిత్తకారణం (efficient cause), కుండ కార్యం (effect). దీన్ని సత్కార్యవాదం అంటారు. వేదాంతులు బ్రహ్మము

'ఏకమేవ అద్వితీయం' అని శ్రుతి చెప్పినట్టు ఒకటిగా ఉన్న తానే అనేకత్వం పొంది నామరూపాత్మక విశ్వాన్ని ఆవిర్భవింప చేశాడని అంటారు. ఇందులో ఉపాదాన కారణం నిమిత్త కారణం రెండూ ఒకటే.

అయితే తార్కికులు అణువులే ఉపాదాన కారణమని, పరమాత్మ నిమిత్త కారణమని, అంటారు - రెండు కారణాలు ఒకరే అయి ఉండడం అసంబద్ధం అని వీరి వాదం. అందుచేత వేదాంతులు సృష్టికార్యంలో పరమాత్మ ప్రమేయ మున్నంతవరకు మాత్రమే ఒప్పుకుని, పరమాణు వాదాన్ని తిరస్కరించారు.

ఇక సాంఖ్యుల పరిణామవాదం కూడ దోషభూయిష్ఠ మైనది. ప్రకృతిజడపదార్థం, జీవుడికి జ్ఞానం ఉన్నా అది స్వల్పం, అంతేగాక అతడు కర్మచేత బంధించబడిన వాడు. అందుచేత ఇద్దరికి సృష్టి కార్యం చేసే శక్తిలేదు. సర్వసమర్థుడైన కర్త ఒకడు కావాలి - అతడే పరమాత్మ-ఆయన ఇచ్ఛలేనిదే సృష్టి అసంభవం. అయితే ప్రకృతి విశ్వంగా పరిణామం చెందుతున్నంతవరకు సాంఖ్యం, వేదాంతులకు ఆమోదయోగ్యమే.

శంకరులు బ్రహ్మము మాయ (ప్రకృతి)తో చేరి సగుణ బ్రహ్మంగా మారి సృష్టి కార్యాన్ని తన ఇచ్ఛాను సారంగా చేసాడని చెప్పారు. బ్రహ్మమే విశ్వంగా మారింది గనుక దీన్ని వివర్తవాదం అని అంటారు.

ఇదంతా రామానుజులు సృష్టికార్యం మీద వారి వివరణ ఇవ్వడానికి ముందున్న పూర్వరంగం.

రామానుజులు సత్కార్య వాదాన్ని అంగీకరించారు. అద్వైతంలో జీవుల అనుభవంలోకి రాని కర్మానుభవానికి, మాయప్రేరేపించగా సృష్టి జరిగిందనే శంకరుల వాదాన్ని రామానుజులు అంగీకరించరు.

**'యతో వా ఇమాని భూతాని జాయంతే! యేన జాతాని జీవంతి। యత్ప్రయంత్యభినం విశంతి। తద్వి జజ్ఞాసస్వ । తద్బ్రహ్మేతి!'** - దేని నుండి ఈ జీవజాలం పుట్టి, దేనివల్ల వర్ధిల్లి, చివరికి దేనిలో లయం అవుతుందో ఆయనే పరమేశ్వరుడు, లక్ష్మీపతియైన శ్రీమన్నారాయణుడు. ఆయనే సృష్టి, స్థితి, లయాలకు కారకుడు. అయితే ఆయనలో సత్వరజస్తమాలనే ప్రాకృతమైన గుణాలు లేవు. జీవులందరిలోనూ ఈ గుణాలుండాలి, ఉంటాయిగూడ. అందుచేత పరమేశ్వరుడు త్రిగుణాత్మకమైన మూలప్రకృతిని ఆధారంగా చేసుకుని తన వీక్షణ మాత్ర సంకల్పంతో సృష్టికార్యాన్ని చేస్తున్నాడు. ఆయనే స్వయంగా ఈ సృష్టికార్యాన్ని తన ఇచ్ఛామాత్రం చేస్తున్నప్పుడు విశ్వం సత్యంకాదు, మిథ్య అనేది అంగీకారయెాగ్యం కాదు. సత్యంకాని వస్తువును సృష్టించడమేమిటి! అలాంటి ఆలోచన హాస్యాస్పదమైనది నామరూపాత్మకమైన ఈ మహా విశ్వాన్ని తన విచిత్రశక్తిచే సృష్టిస్తుంది. గనుక మూలప్రకృతిని మాయ అని సంబోధిస్తున్నారుగాని, అది అసత్యం అనే అర్థంలోకాదు. భగవద్గీతలో పరమాత్మే ఇలా చెప్పాడు.

**మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।**

సంభవః సర్వభూతానాం తతో భవతి భారత ॥(భ.గీ. 14.3)

'ఓ అర్జునా! మూలప్రకృతి విశ్వానికి మూలకారణం. దానిలో చేతన సముదాయమైన జీవజాలాన్ని బీజరూపంలో ఉంచుతాను. ఇలా జడచేతన సంయోగంతో, జడచేతన రూపమైన విశ్వం ఉత్పన్నం అవుతుంది' అని పరమాత్మ స్వయంగా ప్రకటించాడు. తరువాతి శ్లోకంలో అనేక యోనుల నుండి జన్మించే జీవజాలానికి మూలప్రకృతి తల్లి, నేను బీజాన్ని ఉంచే తండ్రిని అని స్పష్టంగా చెప్పాడు. భార్య ఎప్పుడు భర్త వశంలో ఉండేదే కదా, భార్యను భరించేవాడు భర్తేకదా! అందుచేత మూలప్రకృతి తన ఆధీనంలో ఉంటుందనే విషయాన్ని పరమాత్మ స్పష్టీ కరించాడు. సగుణబ్రహ్మం, నిర్గుణబ్రహ్మం అనేవి సృష్టి విషయంలో అద్వైతంలో ఉన్నాయిగాని, విశిష్టాద్వైతంలో ఉన్నది శ్రీమన్నారాయణుడే, ఆయనే పరబ్రహ్మం, సృష్టికర్త.

ప్రకృతి పంచభూతాలుగాను, జీవజాలంగాను సృష్టి సమయంలో వికారాలు పొందుతుంది. ఇలా చేతనాచేతన విశ్వంగా మారినప్పుడు అది స్థూలావస్థ పొందిందని అంటారు. సృష్టి లయం అయినప్పుడు ఈ వికారాలన్నీ నశించి ప్రకృతి తన నిజస్థితియైన సూక్ష్మావస్థకు చేరుకుంటుంది. జీవుడు కూడా శరీరం ఉపాధిగా తీసుకున్నప్పుడు స్థూలావస్థలోనూ, శరీరం త్యజించిన తరువాత సూక్ష్మావస్థలోనూ ఉంటాడు.

ఈ జీవజాలం పరమాత్మకు శరీరం. విశిష్టాద్వైతంలో జీవులు పరమాత్మ శరీరులని ఇదివరకే చెప్పుకున్నాం. అయితే ప్రళయం సంభవించినప్పుడు, పరమాత్మ శరీరమైన చేతనాచేతన

ప్రకృతి సూక్ష్మావస్థలో ఉండి పరమాత్మకు లీలానుభూతిని కలిగించలేవు. అప్పుడు పరమాత్మ తన క్రీడానుభవానికి సృష్టికార్యం చేస్తాడు. మరి సృష్టి భగవంతుని లీల అయినప్పుడు, జీవులను కొందరిని సుఖాలనుభవించేవారుగా, కొందరిని దుఃఖభోగులగా ఎందుకు సృష్టించాడంటే దానికి ఆయన భాధ్యుడు కాదు. మానవుల పుట్టుక కర్మానుసారమే జరుగుతుంది. ఆయన కార్యం జీవులను సృష్టించడం, వాటిలో జీవాత్మను ప్రవేశపెట్టి జ్ఞానం, చైతన్యం ఇవ్వడం వరకే. పరమాత్మ సూక్ష్మచేతనాచేతన అవస్థనుండి స్థూల చేతనాచేతనావస్థకు చేరడమే సృష్టి. అందుచేత కారణం, కార్యం, రెండూ కూడా ఆయనే.

ఈ సృష్టిలో ఉండేవారు ముగ్గురు - పరమాత్మ, జీవుడు (చేతనులు), ప్రకృతి (జడం) అనే తత్త్వత్రయం. వీరిలో పరమాత్మ మాత్రమే స్వతంత్రుడు, మిగతా ఇద్దరు ఆయన ఆధీనంలోనుండేవారే, పరమాత్మకు శరీరభూతులు. ప్రాకృతమైన గుణాలులేని పరమాత్మ, ప్రాకృత గుణాలు గల చేతనాచేతన ప్రకృతి రెండు సృష్టిలో ఒకటిగా ఉండడం అద్వైతం, అయితే ఈ చేతనాచేతన ప్రకృతి ఆయన శరీరంగా ఉండడం విశేషం - అందుచేత విశిష్టాద్వైతం.

ఈ సృష్టిని పరిశీలిస్తే జగత్తుకు బ్రహ్మమునకు విడదీయరాని సంబంధం ఉందనే విషయం స్పష్టమవుతుంది. ఏకత్వం నుండి బహుత్వం వచ్చిందంతే. ఇదే పరిణామం వివర్తం. అవ్యాకృత బ్రహ్మం ఎంత సత్యమో వ్యాకృత బ్రహ్మం కూడా అంతే

సత్యం. పరిణామం చెందినంత మాత్రంచేత పరమాత్మ మిథ్య అయిపోతాడా! అందుచేత విశ్వం మిథ్య అనడం అంగీకారయోగ్యం కాదు. పరమాత్మచే సృష్టించబడిన ఈ విశ్వం సత్యమే అని రామానుజుల సిద్ధాంతం.తార్కికంగా చూసినపుడు ఈ సిద్ధాంతంలో బలం కనిపిస్తుంది. అద్వైతులు దీన్ని ఒక వివేక విశిష్టమైన సిద్ధాంతంగా చూడాలే తప్ప, తిరస్కరించడం న్యాయం కాదు అని కొందరికి అనిపిస్తుంది.

## 12. భక్తి-ప్రపత్తి

జీవులలో మూడు రకాలుంటారని విశిష్టాద్వైత సిద్ధాంతం. వారు నిత్యముక్తులు, ముక్తులు, బద్ధులు. ఇందులో నిత్యముక్తులు సంసారబంధమనేది ఎప్పుడూ లేక నిత్యం వైకుంఠంలో పరమానందంగా ఉంటారు. భక్తి ప్రవృత్తులతో క్రమేణా కర్మబంధాలను తెంచుకుని మోక్షం పొందినవారు ముక్తులు. సంసారంలో చిక్కుకుని, కర్మబంధంలో ఉండి జననమరణ వలయంలో చిక్కుకున్నవారు బద్ధులు.

జీవేశ్వరులకిద్దరికి జ్ఞానమనేది సమానధర్మం. జీవులలో ఈ జ్ఞానం దీపంలా వెలుగునిచ్చేది ఒకటి, దానితోటి రత్నంలోని ప్రభలాగా సంకోచ వికాసాలు గల జ్ఞానం కూడా ఉంటుంది. దీన్ని 'ధర్మభూతజ్ఞానం' అంటారు. ఈ జ్ఞానంతోనే జీవులు బాహ్యవస్తువులను గ్రహిస్తారు. ఈ ధర్మభూతజ్ఞానం వికాసం పొందనప్పుడు జీవాత్మ తాను ఈ శరీరం కంటె వేరని అనుకోడు. దీన్ని దేహాత్మభావం అంటారు. ముక్తి పొందాలంటే ఈ

ధర్మభూతజ్ఞానం వికాసం చెంది తాను ఈ శరీరం కంటె వేరని, తాను పరమాత్మ శరీరం గాని వేరుకాదని శరీర-శరీరి జ్ఞానం జీవాత్మకు కలగాలి. అయితే ఈ 'ధర్మభూతజ్ఞానం' అనే సిద్ధాంతం విశిష్టాద్వైతంలోనే కనిపిస్తుంది.

సాధారణంగా జీవుడు కర్మలు చేస్తూ ఉంటాడు. సుఖదుః ఖాలు అనుభవిస్తూ ఉంటాడు. కర్తృత్వ భోకృత్వ భావాలు కలిగి ఉంటాడు. దీని పర్యవసానం, జననమరణ శీలం గలిగిన సంసారం. పునర్జన్మ పొందినప్పుడు కొత్త శరీరం వస్తుంది గాని సూక్ష్మశరీరం మాత్రం అన్ని జన్మలతోనూ తనను వెన్నంటే ఉంటుంది. ఇది ప్రళయం వరకు అలాగే ఉండి ప్రళయ సమయంలో మూలప్రకృతిలో లయమై ఉంటుంది. అయితే ఇక్కడితో అయిపోలేదు. మళ్ళీ సృష్టి జరిగినప్పుడు కర్మబంధాలతోసహా పునర్జన్మ తథ్యం. మరి ఈ జననమరణ వలయం నుండి ముక్తి పొందటం ఎలా? దానికి మార్గం భక్తి ఒకటే అని రామానుజుల మతం.

రామానుజులు జ్ఞానమార్గం కర్మమార్గం వల్ల కాక భక్తిమార్గంలో పయనిచండం వల్లే ముక్తి ధామం చేరుకుంటామని ప్రవచించారు. దానికి భగవద్గీతలోని ఈ శ్లోకం ఉదాహరిస్తారు:

**క్లేశోஉధికరస్తేషామ్ అవ్యక్తాసక్తచేతసామ్ ।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహ వద్భి రవాప్యతే ॥ (12.5)**

నిరాకార బ్రహ్మము మీద ఆసక్తితో సాధన చెయ్యడం

శ్రమతో కూడిన పని అనిచెప్పి భక్తి మార్గాన్ని శరణాగతి తత్త్వాన్ని బోధించాడు శ్రీకృష్ణ పరమాత్మ. ఆదిశంకరులు తమ భజగోవింద శ్లోకాలలోనూ ఇతరత్రా ఈ మార్గాన్ని బోధించారు. అద్వైతి అయిన ధూర్జటి ఇలా అన్నాడు:-

**శా. ఏ వేదంబు పఠించెలూత, భుజగంబే శాస్త్రము ల్చూచె,దా**
**నే విద్యాభ్యసనం బొనర్చెగరి, చెంచే మంత్ర మూహించె,**

**బో**

**ధా విర్భాప నిధానముల్ చదువులయ్యా! కావు! మీ పాదసం**
**సేవా సక్తియేకాక జంతుతతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా!**

ఇలా భక్తి మార్గానికి సర్వత్రా ఆమోదం ఉంది. అలాగని జ్ఞానకర్మమార్గాలు నిరర్థకం అని అనుకోకూడదు. అలా అనుకోవడం శ్రుతి విరుద్ధం కూడా. రామానుజులు శ్రుతివిరుద్ధంగా ఏ విషయం చెప్పలేదు. "ఆత్మావా అరే ద్రష్టవ్యః - శ్రోత్రవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయి!" ఆత్మను అనుభవపూర్వకంగా తెలుసుకోవాలి. ఆత్మకు సంబంధించిన శ్రుతివాక్యాలు వినాలి, వాటిని మననం చేసి, వాటిమీద ధ్యానం చెయ్యాలని శ్రుతి చెప్పింది. రామానుజులు ఈ వినడం, మననం, ధ్యానం, భక్తితో చెయ్యాలి అంటారు. ఆయన భక్తి అంగి అని; జ్ఞానం, కర్మ భక్తికి సాధనాలని అంటారు. జ్ఞానం, నిష్కామ కర్మ, సత్వగుణాన్ని పెంపొందించి, మనస్సుకు శాంతి కలిగించి భక్తి మార్గాన్ని సుగమం చేస్తాయని, భక్తికి మోక్షానికి విడదీయరాని సంబంధం ఉందని అన్నారు.

భగవంతుణ్ణి కీర్తించడం, నిత్యం పూజించడం, విగ్రహారాధన, భక్తిలో భాగాలే. అయితే చరమసోపానం ధ్యానం. అయితే ధ్యానానికి ఏ రూపము నిలువజాలదని రామానుజులు ఈ గురుప్రోక్త శ్లోకాన్ని ఉదాహరించారని రాధాకృష్ణ పండితులు వ్రాశారు:

**"ఆ బ్రహ్మాస్తంబ పర్యంతా జగదంతర్వ్యయస్థితాః ।**
**ప్రాణినః కర్మ జనిత సంసార వశంవర్తినః ॥**
**యతస్తతోనతే ధ్యానే ధ్యానినా ముపకారకాః।**
**అవిద్యాంతర్గతా స్సర్వే తే హి సంసారగోచరాః॥**

"బ్రహ్మ మొదలు తృణపర్యంతము సర్వవస్తువులు కర్మజాతమగు సంసార పాశబద్ధములు. అవిద్యాంతర్గములై, సంసార సంగములైన యా వస్తువులు ధ్యానమునకుపకరించు వస్తువులు కావు." (భా.త.శా. 5-252 తి.తి.దే.)

ఇక జ్ఞానకర్మల మీద, చివరకు ధ్యానం మీద ఆధారపడిన భక్తి కూడా అందరికి సాధ్యం కాదని విశిష్టాద్వైతం ప్రపత్తి లేక శరణాగతి అందరికి తరించడానికి సులభమైన మార్గం అని ప్రవచించింది. దీనికి భగవద్గీతలోని ప్రసిద్ధమైన ఈ శ్లోకం ఆధారం:-

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ!**
**అహం త్వా సర్వపాపే భ్యో మోక్షయిష్యామి మా శుచః ॥(భ.గీ.18.66)**

శరణాగతిలో భరన్యాసం ఆ పరమాత్మ మీదే పెట్టి కర్తవ్యకర్మలను ఆయనకే సమర్పించి, ఆయన మీద అచంచల

విశ్వాసంతో ఉండడం సాధకుని కర్తవ్యం. పరమాత్మ మీద అచంచల విశ్వాసం దీనికి మూలాధారం. శరణాగతికి అంగాలను ఈ శ్లోకం వివరిస్తుంది.

> **"ఆనుకూల్యస్య సంకల్పః, ప్రాతికుల్యస్య వర్జనం,**
> **రక్షిస్యతీతి విశ్వాసః, గోప్తృత్వవరణం తథా,**
> **ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధః శరణాగతిః"**

(1) ఈశ్వరార్పణ కర్మములైన లక్షణముల నార్జించుట; (2) తద్విరుద్ధమైన వాటిని వదలిపెట్టుట; (3) పరమాత్మ తన్ను కాపాడుతాడనే దృఢ విశ్వాసం కలిగియుండుట, (4) తన్ను రక్షించమని వేడుకొనుట; (5) ఆత్మీయములైన వాటి నన్నింటిని స్వామికి సమర్పించుట; (6) తన అశక్తతను పరమాత్మకు నివేదించుట. వీటిలో నాల్గవది గోప్తృత్వవరణం శరణాగతికి (అంగి)యని, మిగిలినవి అంగములని శాస్త్ర నిర్ణయం.

ఇక దక్షిణాదిని గల తెన్గలై శాఖవారు శరణాగతి ఏకైక మార్గమని, స్వామికి శరణాగతిచేస్తే, అంటే ఆత్మార్పణంచేస్తే ఇక ముక్తి నివ్వడం ఆయన బాధ్యతేనని, ఇక మన ప్రయత్నం ఏమీ అవసరంలేదని నమ్ముతారు. దీన్ని 'మార్జాలకిశోర న్యాయము' అంటారు. పిల్లి తన కూనలను నోటితో కరచుకొని సురక్షిత ప్రదేశానికి తీసుకు వెళ్ళుతుంది. దీంట్లో కూనల బాధ్యత ఏమీలేదు. ఉత్తరాదినగల వడగలై శాఖవారు ప్రపత్తి ఒక మార్గమేగాని మన ప్రయత్నం కూడా కొంతకావాలని నమ్ముతారు. దీన్ని 'మర్కటకిశోర న్యాయం' అంటారు. కోతి పిల్లలు కోతిని పట్టుకుని ఉంటే కోతి

ఒక చెట్టుమీద నుండి మరొక చెట్టుమీదకు దూకుతూ ఉంటుంది. కోతి బాధ్యత బరువును మొయ్యడమే, పిల్లల భాద్యత గట్టిగా పట్టుకుని, కోతి ఎగిరేటప్పుడు గాయాలు కాకుండా చూసుకోవాలి. ఇందులో పిల్లల బాధ్యత కూడా ఉంది.

ఇక భాగవతంలోని ప్రహ్లాదోపాఖ్యానం, గజేంద్రమోక్షం, రుక్మిణీ కళ్యాణం, కుచేలోపాఖ్యానం మొదలైన వాటిలో భక్తి తత్వాన్ని విశిష్టాద్వైతం ఆదరిస్తుంది. మిత్రత్వంతో గాని, బంధుత్వంతోగాని, కామంతోగాని (మధురభక్తి), చివరికి శతృత్వంతోగాని స్వామిని సమీపించి స్మరిస్తే ఆయన అనుగ్రహిస్తాడని భాగవతం చెప్తుంది. ఆశ్చర్యకరంగా శతృత్వంతోనే మోక్షం సంభవమని చెప్పే ఈ పద్యం స్వామి ఎంత కృపా మయుడో మనకు బోధిస్తుంది.

క. **వైరానుబంధన మున,**
**జేరిన చందమున విష్ణు జిరతర భక్తిం**
**జేరగ రాదని తోచును,**
**నారాయణ భక్తి యుక్తి నా చిత్తమునన్. (భా. 7.15)**

విశిష్టాద్వైతం భగవద్భక్తి కంటె భాగవత భక్తి ముఖ్యంగా ప్రవచిస్తుంది. ఆచార్యభక్తి అత్యంతావశ్యకం. ఆయన అనుగ్రహం, మార్గదర్శకత్వం లేనిదే ఏ ఉపాసన, మోక్షం పొందడానికి చేసే, ఏ ఇతర అధ్యవసాయం సాధ్యంకాదు, ఫలించదు. ఈశ్వరార్పణ

బుద్ధితో చేసే నిష్కామ కర్మానుష్ఠానం సత్వగుణాన్ని పెంచి భక్తి మార్గం వైపు నడిపించి మోక్ష సాధనంగా మారుతుందని విశిష్టాద్వైతం నిష్కామ కర్మను ఆదరించింది.

## 13. మోక్షము

అద్వైతంలో మోక్షమంటే జీవాత్మ తన స్వరూపాన్ని తెలుసుకొనిన మరుక్షణం బ్రహ్మం అయిపోవడం. ఇక మిగిలిదేమీ ఉండదు. ఏమీ ఉండనప్పుడు తార్కికంగా పునర్జన్మ ఉండదు. మోక్షం సిద్ధించిన తరువాత మోక్షానందాన్ని అనుభవించేందుకు ప్రత్యేకమైన తత్త్వం ఏమీ ఉండదు. దీనికి కారణం స్వరూపైక్యం.

ఈ స్వరూపైక్యాన్ని విశిష్టాద్వైతం అంగీకరించదు. జీవుడు, పరమాత్మ వేరు. ఇద్దరూ జ్ఞానస్వరూపులే, ఇద్దరూ నిత్యులే. ఎన్ని జీవాలున్నాయో అన్ని జీవాత్మలున్నాయి. జీవుడు భక్తిమార్గాన్ని అనుసరిస్తూ భగవత్కృపకు పాత్రుడవుతాడు. కర్మాచరణలో ఒకప్పుడు ఎంత పాపాత్ముడైనా అనుకోకుండానే సత్కర్మ చేస్తాడు - అవును కొట్టబోతే అది పారిపోయి గుడిచుట్టూ తిరుగుతుంది. దాన్ని వెంబడించి గుడికి చుట్టూ మూడుసార్లు తిరుగుతాడు. పరమాత్మ దాన్ని భక్తితో చేసిన ప్రదక్షిణంగానే తలచి ఇకముందు ఇతనికి పునర్జన్మ లేకుండా చెయ్యాలనుకుంటాడట. దీన్ని అజ్ఞాత సుకృతం అంటారు. దీన్ని విశిష్టాద్వైతులు ఎందుకు చేస్తారంటే ఎన్ని ఉపాసనలు, తీర్థయాత్రలు, పూజలు చేసినా భగవత్కృప ఉంటేనే మోక్షం అని చెప్పడానికి. ఇదంతా భక్తికి సంబంధించినది.

ఇక శరణాగతి చేస్తే అంతా భగవంతుడిదే బాధ్యత. ఆయన మోక్షం ప్రసాదిస్తాడు.

ముక్తజీవి వైకుంఠం చేరుకుంటాడు. ఇక్కడ దివ్యమంగళ స్వరూపవిశిష్టుడైన శ్రీమన్నారాయణుడు లేక పరవాసుదేవు డుంటాడు. ఆయన సన్నిధలో పరమానందంతో ఆయన్ని సేవించుకుంటూ ఏ కోరిక లేక ఉంటాడు. పునర్జన్మ ఉండదు. వైకుంఠంలో లక్ష్మీదేవి, గరుడాళ్వారు, విష్వక్సేనాదులు ఉంటారు. వారందరి సన్నిధిలో శాశ్వతానందాన్ని పొందుతాడు. దీన్నే సాయుజ్యం అంటారు. విశిష్టాద్వైతంలో జీవన్ముక్తి లేదు.

ముక్తజీవి 'అపహతపాపాత్మ' డౌతాడు - అంటే పాపపుణ్యాలన్ని పటాపంచలౌతాయన్నమాట. ఇక్కడ 'పాపం' అనే దానిలో పుణ్యంకూడా చేరిందని వ్యాఖ్యాతలు అన్నారు. మరి పుణ్యంకూడా పోతే పుణ్యం వల్ల దక్కవలసిన స్వర్గసుఖాలు పోతాయికదా, ఇది అన్యాయం కదా! అంటే కాదంటుంది విశిష్టాద్వైతం. కారణం స్వర్గానికన్నా ఉత్కృష్టమైన పరవాసుదేవుని సన్నిధి పొందాడు కనుక.

మోక్షావస్థలో జీవులందరు ఒకే రూపంలో ఉంటారు. మనుష్యులు, జంతువులనే తారతమ్యం ఉండదు. ముక్తజీవులకు పరమాత్మకు మధ్య మూడు తేడాలుంటాయి. ముక్తజీవులు అణుపరిమాణంలో ఉంటే పరమాత్మ సర్వవ్యాపి; ఆయన సర్వ నియామకుడు, ముక్త జీవులుదాసులు; ఆయన సృష్టికార్యం చెయ్యగలడు, ముక్తజీవుల కది సాధ్యం కాదు. ఇలా పరమాత్మ ముక్తజీవుడు స్వభావంలోనూ, స్వరూపంలోనూ వేరుగానే

ఉంటారుగాని వారి ఐక్యత ఉండదు.

ఈ విషయాలన్నీ పాంచరాత్ర శాస్త్రంలో ఉన్నాయి. విశిష్టాద్వైతంలో పాంచరాత్రానికి వేదంతో సమానమైన ప్రతిపత్తి ఉంది. పాంచరాత్రం భక్తి ప్రపత్తుల ద్వారానే ముక్తి సాధ్యం అని చెప్తుంది. కష్టకాలంలో ఆర్తత్రాణ పరాయణుడైన, సాకారమూర్తి యైన దేవుడొకడుండాలని ప్రతిమానవుడు కోరుకుంటాడు. ఈ విషయాన్ని శ్రీశంకరులు కూడా గ్రహించడం చేతే 'లక్ష్మీనృసింహ! మమదేహి కరావలమ్బమ్' - 'లక్ష్మినృసింహ స్వామి! నాకు నీచేయూత నిమ్ము' అని ప్రార్థించారు. అయినప్పటికి అద్వైతంలో మానవుడు పిలిస్తే పలికే సగుణ, సాకార పరమాత్మ మనకు కనిపించడు. తద్విరుద్ధంగా విశిష్టాద్వైతంలో సగుణ సాకార పరమాత్మే కనిపించి, 'నేనున్నాను నిన్ను రక్షించడానికి' అని సిద్ధంగా ఉంటాడు - మనం ఆయన మీద విశ్వాసంతో ఆయన్ని భక్తితో ప్రార్థించడమే తరువాయి. ద్వైతంలో కూడా ఇంతే. నిజానికి మనం ఏం కోరుకోవాలో మనకు తెలియదట. ఆయనే మనకు ఏది మంచిదో అది అనుగ్రహిస్తాడట. ఈ కోణంలో చూసినప్పుడు దైవాన్ని విశిష్టాద్వైతం ఆర్తితో నున్న జీవునికి దగ్గరగా తీసుకునివచ్చింది. దీనికి కారణం అద్వైతం శ్రుతిమీద, ప్రస్థానత్రయం మీద ఆధారపడింది. అలాకాకుండా విశిష్టాద్వైతం భక్తిరసామృతాన్ని వెదజల్లే ఆళ్వారుల దివ్యరచనలమీద, పురాణాల మీద కూడా ఆధారపడి ఉంది. ఇవి భక్తి తత్త్వానికి ప్రతీకలు.

ఈ విధంగా పాంచరాత్రం ద్వారా, భక్తి ప్రపత్తులతో పరమాత్మ సన్నిధి చేరడమే మోక్షం అని విశిష్టాద్వైతం బోధించింది.

దీని పర్యవసానంగానే దివ్యక్షేత్రాలు వెలసి, అద్వైతులు, విశిష్టాద్వైతులు, ద్వైతులు అనే భేదం లేకుండా ఆర్తులైన అశేష భక్తజనాన్ని ఆకర్షిస్తున్నాయి. భగవంతుడి కృపకు పాత్రులను చేస్తున్నాయి. మతానుభూతిని విశేషంగా కల్పించాయి.

## 14. శాఖా భేదాలు

రామానుజుల నిర్యాణం తరువాత కొంతకాలానికి శ్రీ వైష్ణవులు వడకలై - తెన్గలై అనే రెండు శాఖలుగా విడిపోయారు.

విశిష్టాద్వైతం రామానుజులకు పూర్వమే ఉంది. దక్షిణ భారతంలో అది సంస్కృతంలో గల ప్రస్థాన త్రయం మీద, ద్రావిడభాషలోని ఆళ్వారులు దివ్య ప్రబంధముల మీద ఆధారపడి ఉంది. ఉత్తర భారతంలో అది కేవలం సంస్కృత భాషలో గల గ్రంథాలమీదే ఆధారపడి ఉంది. రామానుజులు రెండింటిని ఆదరించి బ్రహ్మసూత్రాల మీద శ్రీభాష్యం, భగవద్గీత మీద విశిష్టాద్వైత పరంగా భాష్యంమొదలైన రచనలు చేసి యావద్భారత దేశం సంచరించి విశిష్టాద్వైతానికి విశేష ప్రచారం తీసుకువచ్చారు. నిజానికి ఏ తెగకు చెందినవారైనా పరమాత్మ సగుణ సాకారుడని, జీవుడికంటె ఆయన విశిష్టుడని, మోక్షం అంటే వైకుంఠంలో ఆయన సన్నిధికి చేరడమనే మౌలిక విషయాలలో భావసారూప్యం ఉంది.

దక్షిణభారతంలో సంస్కృత ద్రావిడ భాషలలోని విశిష్టాద్వైత వాఙ్మయాన్ని అధ్యయనం చేసి ప్రవచించే వారిని ఉభయ వేదాంత

ప్రవర్తకులంటారు. దక్షిణ భారతంలో ద్రావిడ భాషలో గల దివ్య ప్రబంధాలకే ప్రాముఖ్యత ఇస్తారు. వీరిని తెన్గలై శాఖవారని అంటారు. ఉత్తర భారతంలోని వారు సంస్కృత గ్రంథాలకే ప్రాముఖ్యం ఇస్తారు, కాని వారిని వడకలై శాఖవారని అంటారు. అయితే అందరికి శ్రీమద్రాజనులమీద విశిష్టా ద్వైతంమీద ఉభయ భాషలలోని గ్రంథాల మీద అపారమైన ఆదరణ ఉంది.

ప్రధానంగా తిలక ధారణలో వీరిద్దరి మధ్య తేడా ఉంది. మోక్షానికి భక్తి ప్రపత్తులలో దేనికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలి అనే దాని మీద, కొన్ని కర్మాచరణల మీద, కులతత్వాన్ని భక్తుల విషయంలో పాటించాలా అక్కరలేదా అనే విషయాల మీద అభిప్రాయ భేదాలున్నాయి. అయితే ఇవి కొంత ముదిరి దేవాలయాల్లో ఆధిపత్యపోరుకు దారితీశాయి. తిరుమల కొండమీద వైష్ణవులలో ఈశాఖాభేదం కొంత వైషమ్యానికి కారణం అవుతూందని కొన్ని ఆరోపణలు ఉన్నాయి. అయినా వివాహాది శుభకార్యాలలోనూ ఇతరత్రా అందరూ ఆదరభావంతోనే మెలగుతున్నారు.

ఏమైనా మౌలిక సిద్ధాంతాల మీద అభిప్రాయ భేదాలు లేవు గనుక శ్రీ వైష్ణవులందరు ఐకమత్యంగా ఉండి విశిష్టాద్వైత వ్యాప్తికి, దేవాలయాల నిర్వహణా సామర్థ్యానికి, శ్రీమన్నారాయణుడి మీద భక్తికి దోహదం చెయ్యాలని వైష్ణవులలోని పెద్దలందరు కోరుకుంటున్నారు.

## 15. మరి కొందరు విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులు

భగవద్రామానుజుల అనంతరం ఆయన శిష్యులలో ఒకరైన శ్రీ పరాశర భట్టర్ వారు ఆచార్య పీఠాన్ని అలంకరించారు. వీరు 'రంగరాజస్తవము' 'అష్టశ్లోకి' అనే స్తోత్రాలను 'తత్త్వరత్నాకరము' అనే సుప్రసిద్ధ శాస్త్ర గ్రంథాన్ని రచించారు. వీరు నిస్సంతు కావడం వల్ల వీరి తమ్ముని కుమారుడైన శ్రీ సుదర్శన భట్టర్ వారు వంశోద్ధారకులయారు. వీరు శ్రీ రామానుజుల శ్రీభాష్యానికి 'శుతప్రకాశికా' అనే ప్రసిద్ధ వ్యాఖ్యానాన్ని రచించారు. ఈ వ్యాఖ్యానమే లేకపోతే శ్రీభాష్యాన్ని అర్థం చేసుకోవడం దుర్లభమయ్యేదని పండితులంటారు. దీని వల్ల ఈయనకు శ్రుతప్రకాశికాచార్య అనే సార్థక నామం వచ్చింది. తురుష్కుల దాడిలో అతి అమానుషంగా వీరు హత్యకు గురి కావడం అత్యంత విషాదకర ఘట్టం. అయితే వీరి తల్లి గారు శ్రీ వేదాంతదేశికుల వారికి వీరి శ్రుత ప్రకాశిక గ్రంథాన్ని ఇచ్చి వారి సహాయంతో దాన్ని రక్షించారు.

తరువాత పేర్కొనదగినవారు శ్రీ వేదాంతదేశికుల వారు. వీరు శతాధిక గ్రంథకర్త, విశిష్టాద్వైత పరంగా అనేక వ్యాఖ్యానాలు, పాదుకాసహస్రం, దయాశతకం మొదలైన స్తోత్ర గ్రంథాలు రచించారు. తరువాత నంబిళ్ళై గారు తిరువాయిమొళి ప్రబంధం మీద 'ఈడు' అనే వ్యాఖ్యానాన్ని రచించారు. ఇది 'భగవద్విషయము' అనే పేరుతో ప్రసిద్ధమైంది. వీరికి లోకాచార్యులనే బిరుద నామం ఉంది. వీరి శిష్యులు 'శ్రీ కృష్ణపాదులు' తమ కుమారునికి పిళ్ళైలోకాచార్య స్వామి 'శ్రీవచన భూషణము' అనే ప్రసిద్ధ గ్రంథాన్ని రచించారు. తరువాత

శ్రీమణవాళమహామునులు (సంస్కృతంలో వీరిని 'వరవరముని' అంటారు) అనేక స్తోత్రాలను, 'శ్రీవచనభూషణం' మొదలైన వాటి మీద వ్యాఖ్యానాలను వ్రాసి ప్రసిద్ధులైనారు. వీరి ఉపన్యాసం గంగా ప్రవాహంలా ఉండేదట.

ఇక ఆధునిక కాలంలో తెలుగులో రామాయణం, భాగవతం, తిరుపావై మొదలైన వాటి మీద అనర్గళంగా ఉపన్యాసాలననుగ్రహించిన మహానుభావులు కీ.శే. శ్రీ మరింగంటి శ్రీరంగాచార్యులు వారు, కీ.శే. శ్రీభాష్యం అప్పలాచార్యులు వారు. వీరిలో శ్రీ అప్పలాచార్యులు వారు తిరుప్పావై మీద, సుందరకాండ మీద రచించిన వ్యాఖ్యానాలు సుప్రసిద్ధాలు. అలాగే మహామహోపాధ్యాయ కవిశాబ్దిక కేసరి శ్రీ నల్లాం చక్రవర్తుల రఘునాధాచార్య స్వామి వారు. అన్ని సిద్ధాంతాలలోను సమాన ప్రతిభాపాటవాలు ఉండటం వీరి ప్రత్యేకత. ఉపన్యాస చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త, సత్సంప్రదాయ పరిరక్షణ సభ, వరంగల్ ద్వారా వీరి రచనలు ప్రచురింప బడుతున్నాయి. విష్ణుసహస్ర నామం మీద వీరు రచించిన వ్యాఖ్యానం నభూతో నభవిష్యతి. ఈ కోవకు చెందినవారే శ్రీ కందాడై రామానుజాచార్యస్వామి వారు. తమ ఉపన్యాసముల ద్వారా ప్రజలలో భక్తిప్రపత్తులను పెంచడానికి ప్రస్తుతం వారు చేసే సేవ అత్యంత ప్రశంసనీయం.

ప్రస్తుతం అహోబిలస్వామి వారు, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్న జీయరు స్వామి వారు, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవక్తకులుగా ఆధ్యాత్మిక ప్రచారం విరివిగా చేస్తున్నారు.

విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారంలోను, ప్రజలలో భక్తి ప్రపత్తులను పెంచడంలోను, స్త్రీలు కూడా పురుషులకేమి తీసిపోలేదు. అటువంటి విద్వన్మణులలో శ్రీమతులు టి.కె.చూడామణి, తిరువెంగళమ్మ, జానకి మొదలైనవారు ప్రసిద్ధులు.

## 16. ఉపసంహారం

వేదాంతం అంటే శంకరాద్వైతమే అనే భావన ప్రజాబాహుళ్యంలో బలంగానే ఉండేది. అయితే క్రమంగా దీనికి ప్రతిఘటన వచ్చింది. శంకరుల తరువాత భాస్కరాచార్యుల వారు శంకరుల మాయావాదాన్ని తీవ్రంగా ఖండించారు. తరువాత రామానుజులు శంకరుల అద్వైతంలోని మౌలికాంశాలన్నింటితోనూ విభేదించి మతానికి దగ్గరగా, ప్రజలలో భగవంతుని మీద అచంచల విశ్వాసాన్ని పెంచి, ఆర్తులైన వారిని రక్షించేందుకు అందుబాటులో నున్న దైవం ఉందనే భరోసా ఇచ్చిన సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టిన ఘనత దక్కించుకున్నారు. అప్పటికి బలంగా ఉన్న అద్వైతాన్ని, శైవాన్ని ఒక్క కుదుపు కుదిపి, ప్రజలను విశేషంగా ఆకర్షించి, విశిష్టాద్వైతం తనవైపుకు తిప్పుకుంది. మతవిశ్వాసాలకు అతీతమైన

పారామార్థిక తత్త్వం అద్వైతం. విశిష్టాద్వైతం మతంతోను పురాణేతి హాసాలతోను పెనవేసుకుపోయి విశ్వాసానికి పెద్దపీట వేసిన సిద్ధాంతం. గమనించవలసిన విషయం ఏమిటంటే విశిష్టాద్వైతం ఎంతగా ప్రచారం పొంది సులభంగా ఆచరణీయమైన సిద్ధాంతంగా

వెలసినా అద్వైతానికి ఒక సవాలుగా మారిందే తప్ప అద్వైతాన్ని పూర్తిగా తెరమరుగు చెయ్యలేక పోయింది. విశిష్టాద్వైతం పరమాత్మ సౌలభ్యాన్ని బోధించింది గనుక అద్వైతులుగానే ఉంటూ విశిష్టాద్వైతం సూచించిన భక్తిమార్గాన్ని ప్రజలు అనుసరించడం మనం చూస్తున్నాం. శంకరాద్వైతాన్ని పురస్కరించుకొని రాధాకృష్ణ పండితులు 'అతని నిర్గుణబ్రహ్మ మన హృదయంలో నుజ్వల ప్రేమనుగాని, భక్తినిగాని జనింపజేజాలదు. ఎవ్వడు, ఎన్నడు జూచి యుండనట్టి జూడరానట్టియు, నెవ్వడు సమీపించుట కవకాశములేని జ్యోతిర్మయ స్వరూపము గలట్టియు నిర్గుణ బ్రహ్మమును మన మారాధింపజాలము' అని స్థితిని ఆవిష్కరించారు. ఈ లోటును విశిష్టాద్వైతం తీర్చి ఇష్టదైవారాధనకు, తద్వారా ముక్తికి ఒక సౌలభ్యాన్ని కలిగించింది. విభేదాలు ఎన్నిఉన్నా రెండు సిద్ధాంతాలు జనబాహుళ్యంలో సహజీవనం చేస్తున్నట్టు కనిపిస్తుంది. దీనికి కారణం రెండూ ఆస్తిక మతాలే, రెండూ ప్రస్థాన త్రయం మీద ఆధాపడినవే. ప్రస్తుతం ఇలాంటి సమన్వయ దృక్పథం అవసరం.

## ఉపయుక్త గ్రంథములు


1. భారతీయతత్త్వశాస్త్రము
   డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు,
   విద్వాన్ బులుసు వేంకటేశ్వర్లుగారి అనువాదం
   (తి.తి.దే. ప్రచురణ)

2. Bhakti Schools of Vedanta
Swami Tapasyananda
Sri Ramakrishna Math Publication.

3. సిద్ధాంతత్రయ సంగ్రహము
శ్రీకపిస్థలం దేశికాచార్య
సంప్రదాయ పరిరక్షణసభ, వరంగల్.

4. విశిష్టాద్వైత వైభవము
శ్రీన.చ.రఘునాథాచార్యులు
సంప్రదాయ పరిరక్షణసభ, వరంగల్.

5. రామానుజాచార్యులు
ఆర్. పార్థసారథి
నేషనల్ బ్రుక్ ట్రస్టు, ఇండియా.

## శ్రీ వేదభారతి

వేదశబ్ద పరిరక్షణకు, వేదవిజ్ఞాన ప్రచారానికి ఏర్పడిన ధార్మిక సంస్థ శ్రీవేదభారతి.

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం అని పిలవబడే నాలుగు వేదాలకు సుమారు 1131 శాఖలు ఉండేవని మన ప్రాచీన గ్రంథాల ద్వారా తెలుస్తోంది. కాని నేడు 13 వేదశాఖలు మాత్రమే లభిస్తున్నాయి. ఈ 13 శాఖలలోను, 7 శాఖలకు మాత్రమే గురుశిష్యపరంపర కొనసాగుతోంది. మిగిలిన 6 శాఖలు పాక్షికంగా మాత్రమే లభిస్తున్నాయి. ఈ విధంగా మన ప్రాచీన భారతీయ విజ్ఞానంలో 99% పైగా పోగొట్టుకున్నాము.

వేద విజ్ఞానాన్ని అత్యవసరంగా పరిరక్షించుకోవడానికి శ్రీ వేదభారతి ఆధునిక కంప్యూటర్ టెక్నాలజీని ఎన్నుకొంది. అందులో - రికార్డింగ్ ద్వారా వేద మంత్ర ఉచ్చారణను జాగ్రత్త చేయడానికి కృషిచేస్తోంది. మిగిలి ఉన్న వేదశబ్దాన్ని రికార్డింగ్ చేస్తే సుమారు 3,000 గంటలు కావచ్చునని అంచనా వేయగా, ఇప్పటికి సుమారు 900 గంటలు పూర్తి అయింది. 200 పైగా ఆడియో/మల్టీమీడియా సిడిలరూపంలో అందుబాటులోనికి తీసుకొనివచ్చింది.

వేదాలపై శాస్త్రీయ పరిశోధన & ప్రచురణ :

వేదాలలో ఆధునిక శాస్త్రీయ సాంకేతిక విషయాలను వెలుగులోనికి తీసుకువచ్చే ప్రయత్నంలో "వేదంలో కంప్యూటర్ విజ్ఞానం", "వేదశాస్త్రాలలో ఆధునిక శాస్త్రీయ రహస్యాలు", "భూ కంపాలను ముందుగా పసిగట్ట గల్గుట సాధ్యమా?" మొదలైన అత్యున్నత శ్రేణి పరిశోధనా గ్రంథాలతో బాటు, "వేదగణితం" వంటి సిడి/డివిడిలను కూడా శ్రీవేదభారతి వెలువరించడం జరిగింది.

వైదిక గణితం బోధన :

టి.టి.డి. మరియు భక్తి టీ.వి. ఛానల్స్ ద్వారా లక్షలాదిమంది విద్యార్థులకు వేదగణితం, వేదవిజ్ఞానం వంటి విషయాలు పరిచయం చేయబడుతున్నాయి. విద్యార్థులకు అందుబాటులో ఉండేట్లుగా వైదిక గణితం ప్రచురించడం జరిగింది. ఈ కృషిని గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం **"బంగారు నంది"** బహుమతిని అందించింది.

అభ్యర్థన :

శ్రీ వేదభారతి చేస్తున్న కృషికి అందరూ చేయూతనందించవలసిందిగా ప్రార్థన!!!

# శ్రీ మధ్వాచార్య

(జీవిత విశేషాలు, సిద్ధాంతం - సంక్షిప్తంగా)



కళానిధి సత్యనారాయణ మూర్తి

శ్రీ వేదభారతి

ఓం శ్రీ వేంకటనాథాయనమః

# శ్రీమధ్వాచార్య

(జీవిత విశేషాలు, సిద్ధాంతం - సంక్షిప్తంగా)


**కళానిధి సత్యనారాయణ మూర్తి**

విశ్రాంత న్యాయశాఖ కార్యదర్శి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

సంపాదకుడు

"సంస్కృత మిత్ర"

**డా॥ రేమెళ్ళ అవధానులు,**

M.Sc. (Nuclear Physics), M.A., Ph.D (Sanskrit), M.A., Ph.D. (Jyotisha)

Dy. Director (Computers), (Retd)., NIMS, Hyderabad.



**శ్రీ వేదభారతి**

**హైదరాబాదు**

**2013**

# శ్రీమధ్వాచార్య

**(జీవిత విశేషాలు, సిద్ధాంతం-సంక్షిప్తంగా)**

**కళానిధి సత్యనారాయణ మూర్తి**

**ప్రథమ ముద్రణ :** అక్టోబర్, 2013



వెల : **రూ. 25/-**

ప్రతులకు :

1. శ్రీ వేదభారతి

H-34, Madhuranagar, Hyderabad-500 038.
Ph./Fax.: 040-23812577 Cell : 98494 59316
e.mail : shrivedabharathi@gmail.com
www.shrivedabharathi.org
www.shrivedabharathi.in

2. Sri K.S.N. Murthy,

D-118, Madhuranagar,
Hyderabad - 500 038.
Ph : 040-23810590
Cell : 94902 95269

*ముద్రణ :*
Samhitha Graphics
Ameerpet, Hyderabad - 500016.
Ph.: 040-23731620, 23741620

# కృతజ్ఞతలు

ఈ పుస్తకప్రచురణకు ఆర్థికసహాయం అందించిన

ప్రియమిత్రులు

**శ్రీ కోనరామమోహనరావు గారు & శ్రీమతి విజయ**

**దంపతులకు**

(సీనియర్ కంప్యూటర్ ప్రొఫెషనల్)

కృతజ్ఞతలు తెలియజేస్తూ, వారికి, వారి కుటుంబ

సభ్యులకు పరమేశ్వరుడు పరిపూర్ణ అనుగ్రహమును

ప్రసాదించుగాక అని ప్రార్థిస్తున్నాము.

**డా॥ రేమెళ్ళ అవధానులు,**

**శ్రీ వేద భారతి**

**విజయ "విజయ దశమి"**

**13.10.2013**

ఓం శ్రీ వేంకటనాథాయనమః

# శ్రీమధ్వాచార్య

(జీవిత విశేషాలు, సిద్ధాంతం-సంక్షిప్తంగా)

## విషయ సూచిక

**1వ అధ్యాయం** **పేజి నెం.**


1. బాల్యం, విద్యాభ్యాసం 1
2. దక్షిణదేశయాత్ర 3
3. బదరీ యాత్ర 4
4. రెండవసారి బదరీయాత్ర 6
5. ప్రతిఘటనలు 8
6. చరమదశ 9
7. అసామాన్య కార్యం 10
8. ఉడుపి 10
9. పూర్ణప్రజ్ఞుల రచనలు 11
10. దాససాహిత్యం 12

## 2వ అధ్యాయం


| | | |
|---|---|---|
| 1. | ద్వైతసిద్ధాంతం | 13 |
| 2. | శ్రీ మహావిష్ణువు | 14 |
| 3. | విశ్వం సత్యం | 17 |
| 4. | జీవాత్మ, పరమాత్మ ఒకటి కాదు | 21 |
| 5. | జీవుడు | 26 |
| 6. | భక్తి | 30 |
| 7. | మోక్షం | 34 |
| 8. | లక్ష్మీదేవి | 37 |
| 9. | ప్రమాణములు | 38 |
| 10. | ప్రమేయాలు | 40 |
| 11. | ప్రకృతి | 41 |
| 12. | ద్రవ్యములు - వాటి గుణములు | 43 |
| 13. | శ్రీ మధ్వులు - ఒక వాస్తవ వాది | 44 |
| 14. | మధ్వ సిద్ధాంత సారస్వతం | 46 |
| 15. | ఇతర మధ్వ సిద్ధాంత కర్తలు | 47 |
| | 1. శ్రీ జయతీర్థులు | 47 |
| | 2. వ్యాసరాయలు | 48 |
| | 3. వాదిరాజ తీర్థులు | 50 |
| | 4. శ్రీ రాఘవేంద్ర స్వామి | 51 |

# మా ధ్యేయం

శ్రీ ఆదిశంకరుల అద్వైతం, శ్రీ రామానుజుల విశిష్టాద్వైతం, శ్రీ మధ్వుల ద్వైతం ప్రసిద్ధమైన సిద్ధాంతాలు. ఈ మూడు సిద్ధాంతాలకు అనుయాయులు గణనీయంగానే ఉన్నారు. అయితే ఈ అనుయాయులలో చాలా మందికి 'నేనీ సిద్ధాంతానికి చెందిన వాడను' అని తెలుసునే తప్ప, తమ తమ సిద్ధాంతాలలోని మౌలికాంశాలు గాని, తమ సిద్ధాంతం ఇతర సిద్ధాంతాలోని ఏయే విషయాలతో ఏకీభవిస్తుంది, లేక విభేదిస్తుంది అనే విషయాల మీద గాని అవగాహన లేదు. ఇది యాంత్రిక జీవితం వల్ల, తెలుకోవాలనే ఆకాంక్ష లేక పోవడం వల్ల, ఈ సిద్ధాంతాల మీద గ్రంథాలు జటిలంగా ఉండడం వల్ల సంభవించింది. సిద్ధాంతకర్తల జీవిత విశేషాలు కూడా చాలా మందికి తెలియవు. ఇది సామాన్యుల పరిస్థితి. జిజ్ఞాసతో అధ్యయనం చేసే వారికి, పండితులకు చెప్పవలసిందేమీ లేదు.

అలాంటి సామాన్యులకు, ముఖ్యంగా జిజ్ఞాస ఉన్నా విపులమైన, జటిలమైన గ్రంథాలను అధ్యయనం చేయడానికి సమయం లేనివారికి, వారి వారి సిద్ధాంతాల మీద కనీస అవగాహన కలిగించాలనే ఉద్దేశ్యంతో శ్రీవేదభారతి 'శ్రీ ఆదిశంకరాచార్య', 'భగవద్రామానుజాచార్య', 'శ్రీ మధ్వాచార్య' అనే మూడు చిన్ని పుస్తకాలను ప్రచురించింది. సంక్షిప్తంగా ఆయా సిద్ధాంత కర్తల జీవిత విశేషాలను, సిద్ధాంతాలను కేవలం పరిచయం చెయ్యడమే ఈ చిన్ని పుస్తకాల ధ్యేయం. వీటిని చదివిన తరువాత ఆయా సిద్ధాంతానికి చెందిన వారు ప్రభావితులై వారి వారి ఆచార్యుల జీవిత చరిత్రలను, సిద్ధాంతాలను సమగ్రంగా అధ్యయనం చేస్తారని ఆకాంక్షిస్తూ...

ప్రకాశకులు

ఓం శ్రీ వేంకటనాథాయనమః

# శ్రీమధ్వాచార్య

## 1వ అధ్యాయం

## 1. బాల్యం-విద్యాభ్యాసం

మన ప్రాచీన మహర్షులు వేదాలను, వాటిలోని అంతర్భాగాలైన ఉపనిషత్తులను దర్శించి వాటిని లోకోపకార బుద్ధితో, తమ శిష్య ప్రశిష్యుల ద్వారా, సంప్రదాయబద్ధంగా, తర్వాతి యుగాల వారికి అందించారు. ఆ పరంపరలోనే ఈ యుగంలో అవతరించిన త్రిమతాచార్యులు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీతలను విభిన్న మార్గాలలో విశ్లేషించి, కొన్ని సిద్ధాంతాలను తర్వాతి తరాల వారికి అనుగ్రహించి నిష్క్రమించారు. ఈ మహానుభావులందరికీ మనం వృద్ధిలోనికి రావాలనే ఆకాంక్ష తప్ప, వ్యక్తిగతమైన కీర్తి కాంక్ష లేదు. అందుచేతనే వారు ఏ కాలానికి చెందినవారో, వారి జీవిత విశేషాలేమిటో మనకు చెప్పలేదు. ఈ కారణంగానే వారి కాలనిర్ణయం ఇదమిద్ధంగా ఎవ్వరూ చెయ్యలేకపోయారు.

శ్రీ మధ్వాచార్యుల వారి గురించి తెలుసుకోవడానికి, కొంచెమించుమించు వారికి సమకాలికులైన శ్రీ నారాయణ పండితాచార్యులు రచించిన 'మధ్వవిజయ' మనే గ్రంథం ఒకటే ఆధారం. అయితే ఈ గ్రంథం శ్రీ మధ్వుల సంచారానికి సంబంధించిన విశేషాలు, ఇతర విషయాలమీద సమాచారం ఇస్తుందిగాని శ్రీ మధ్వులు ఎప్పుడు జన్మించారనే విషయం మీద

సమాచారం ఇవ్వలేదు. చివరకు అనేక ఆధారాలను పరిశీలించి శ్రీమధ్వుల జీవితకాలం 1238–1317 గా కొన్ని జీవిత చరిత్రలలో వ్రాశారు. అయితే ఈ విషయంలో వివాదం ఉంది.

భారతదేశ పశ్చిమ తీరంలోని మలబారు, కనరా ప్రాంతాలు ప్రకృతి రమణీయతకు ప్రసిద్ధం. ఆ ప్రాంతాన్ని పరశురామక్షేత్రం అంటారు. ఈ ప్రదేశంలోనే ఉడుపి క్షేత్రం ఉంది. దీని దగ్గరలో గల 'పాజకక్షేత్రం' అనే పల్లెటూరులో శ్రీమధ్వులు మధ్యగేహ భట్టు, వేదవతి దంపతులకు క్రీ.శ. 1238 సం॥లో జన్మించారు. శ్రీమధ్వులు వాయుదేవుని అవతారం అంటారు. తల్లిదండ్రులు అతనికి 'వాసుదేవ' అని నామకరణం చేశారు. ఎనిమిదవ ఏట ఉపనయనం చేశారు. ఈయన మహాబలశాలి, బాలమేధావి.

**ప్రథమో హనుమన్నామ ద్వితీయో భీమ ఏవచ ।**
**పూర్ణప్రజ్ఞస్తృతీయస్తు భగవత్కార్యసాధకః ॥**

భగవత్కార్య నిర్వహణలో వాయుదేవుల వారి ప్రథమావతారం హనుమంతుడు, రెండవ అవతారం భీమసేనుడు కాగా మూడవ అవతారం పూర్ణప్రజ్ఞులు అని మహాభారత తాత్పర్య నిర్ణయంలో ఉంది.

శ్రీమధ్వులు అచ్యుతప్రేక్ష అనే అద్వైత పండితుల వద్ద విద్యాభ్యాసానికి చేరారు. కాని ఒక తమ్ముడు జన్మించిన తరువాత, 11 లేక 12వ ఏటనే తల్లి అనుమతితో సన్యసించారు. పూర్ణప్రజ్ఞులుగా ప్రసిద్ధి పొందారు. చిన్నతనంలోనే వాసుదేవుడనే మహాపండితుణ్ణి

వాదంలో ఓడించారు. అచ్యుతప్రేక్షుల ఆశ్రమం విడిచి చిన్న మఠం స్థాపించుకున్నారు. మఠాధిపతిగా అచ్యుతప్రేక్షులే పట్టాభిషేకం చేసి ఆనందతీర్థులనే నామకరణం చేశారు. అనేక శాస్త్రాల మీద మఠంలో చర్చలు జరిగేవి. షడ్దర్శనాలలోను, తర్కంలోను మహాపండితుడుగా ప్రఖ్యాతి గాంచారు. మొదటి నుండి శంకరాద్వైతానికి వ్యతిరేకంగా వాదించడం మొదలు పెట్టారు. దీనికి కారణం భక్తి ప్రధానమైన శ్రీమద్భాగవతం మీద మక్కువకావచ్చు. గురువు అచ్యుతప్రేక్షులు కూడా పూర్ణప్రజ్ఞులతో ఏకీభవించేవారు.

## 2. దక్షిణదేశయాత్ర

శ్రీ మధ్వులు మొదట దక్షిణదేశ యాత్ర సాగించారు. ఆ రోజులలో విజయనగర సామ్రాజ్యం ఉచ్ఛదశలో ఉంది. దక్కను పీఠభూమికి మహ్మదీయుల రాజ్యం విస్తరించకుండా విజయనగర రాజులు అడ్డుకున్నారు గాని అవకాశం చిక్కినప్పుడెల్లా మహ్మదీయుల దాడులు జరుగుతూనే ఉండేవి. శ్రీ మధ్వులు విష్ణుమంగళం అనే ఊరు చేరుకున్నారు. అక్కడ ఆయన యోగశక్తులను పరీక్షిద్దామని ఒక గృహస్థు వారిని భిక్షకు ఆహ్వానించి షడ్రసోపేతంగా భోజనం పెట్టిన పిదప రెండు వందల అరటిపళ్ళు ముందర పెట్టి ఆరగించమన్నాడట. శ్రీ మధ్వులు అవలీలగా రెండువందల అరటిపళ్ళను ఆరగించి అందరిని ఆశ్చర్యపరిచారట. దారిలో అనేకమంది పండితులను వాదంలో ఓడిస్తూ, క్రమంగా పూర్ణప్రజ్ఞులు తిరువనంతపురం మీదుగా కన్యాకుమారి చేరారు. అక్కడ

కన్యాకుమారిని సేవించి, రామేశ్వరం చేరుకుని చాతుర్మాస్య వ్రత దీక్ష స్వీకరించారు. కుజిపుస్తూరుడనే విద్వాంసుణ్ణి వాదంలో ఓడించారు. చాతుర్మాస్యవ్రతం పూర్తిచేసుకుని మరొక మార్గం ద్వారా ఉడుపికి బయలుదేరారు. దారిలో శ్రీరంగంలో కావేరీ స్నానం చేసి శ్రీరంగనాథుణ్ణి సేవించుకున్నారు. శ్రీమూష్ణం అనే ఊళ్ళో గర్భవతియైన ఒక స్త్రీ, యింటికి నీరు తెచ్చుకోవడానికి కష్టపడుతుండడం చూసి, జాలిపడి తన దండంతో ఒక చెరువును సృష్టించారట. దానికి దండతీర్థం అనిపేరు. దారిలో పాయస్విని నదీతీరంలో గల వరాహస్వామి దేవాలయాన్ని సందర్శించారు. ఉడుపికి తిరిగి వచ్చారు. అనేక చోట్ల జరిగిన పండిత సభలలో ఐతరేయోపనిషత్తు మీద, విష్ణుసహస్రనామస్తోత్రం మీద ప్రవచనాలు చేశారు. విష్ణుసహస్రనామానికి వంద అర్థాలున్నాయని నిరూపించారు. ఈ దక్షిణదేశయాత్రతో శ్రీ మధ్వులకు దక్షిణాదిన ఒక వినూత్న ద్వైత సిద్ధాంతకర్తగా పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. చాలమంది అద్వైత పండితులను వాదంలో ఓడించినందువల్ల మధ్వమతంలో చాలమంది చేరటం కూడా జరిగింది. ఈ యాత్రకూడ పెద్ద పరివారంతోనే సాగడం విశేషం.

## 3. బదరీ యాత్ర

పూర్ణప్రజ్ఞులు ఇప్పటికే గీతాభాష్యం వ్రాశారు. బ్రహ్మసూత్ర భాష్యం కూడా తొందరగా వ్రాయాలని సంకల్పించారు. అయితే ముందుగా హిమాలయాల్లో బదరికాశ్రమం అని ప్రసిద్ధి పొందిన

వ్యాసాశ్రమం దర్శించాలనుకున్నారు. వ్యాసులవారు సజీవంగా అక్కడ ఇంకా ఉన్నారని ప్రసిద్ధి. అప్పటికే ఉత్తర భారతం ముసల్మానుల పాలనలోకి వచ్చింది. కీకారణ్యాల గుండా ప్రయాణం చెయ్యడం సాహసకృత్యం. అయినా పూర్ణప్రజ్ఞులు కొంత పరివారంతో బదరికాశ్రమానికి బయలుదేరారు. వృద్ధాప్యం వల్ల అచ్యుతప్రేక్షులు అనుసరించలేదు. ఆశీర్వదించి పంపించారు. ముందుగా కాశీ చేరి గంగాస్నానం ఆచరించి హిమవన్నగ శిఖరాలలో గల నరనారాయణ దేవాలయం చేరుకుని, అచ్చట నుండి ఆనందమఠం దగ్గర బసచేశారు. అక్కడ ఒక రాత్రి ఆయనకు శ్రీ కృష్ణ భగవానుడు దర్శనమిచ్చి ద్వైతపరంగా రచించిన గీతాభాష్యాన్ని ఆమోదించారు. అక్కడ నుండి ఒంటరిగా వ్యాసాశ్రమానికి బయలుదేరారు. సత్యతీర్థుడనే శిష్యుడు ఆయనను అనుసరించడానికి ప్రయత్నం చేసినా, కొంతదూరం వెళ్ళి ముందుకు సాగలేక వెనుదిరగవలసి వచ్చింది. పూర్ణప్రజ్ఞులు మాత్రం వ్యాసాశ్రమం చేరుకుని, వ్యాసదర్శనం చేసుకుని, ఆ ఋషిసత్తముడికి సాష్టాంగం చేశారు. ఆశ్రమంలో కొంతకాలం ఉన్నారు. వ్యాసుల వారు స్వయంగా మహాభారతంలోని అంతరార్థాలను, మూల రామాయణాన్ని, బ్రహ్మసూత్రాలను, పంచరాత్రాగమాలను, వేదాలలోని రహస్యాలను ఉపదేశం చేశారు. ఆనందతీర్థులు తిరుగు ప్రయాణం భారతదేశపు తూర్పుదిశనుండి బెంగాల్, ఒరిస్సా, ఆంధ్ర ప్రాంతాల మీదుగా జరిగింది. గోదావరి తీరంలో శ్యామశాస్త్రి, శోభనభట్టు మొదలైనఅనేక మంది పండితులను జయించగా వారిద్దరు మధ్వమతాన్ని స్వీకరించారు. తరువాత

శ్యామశాస్త్రి నరహరితీర్థగా, శోభనభట్టు పద్మనాభతీర్థులుగా మారి, పేరు ప్రఖ్యాతులు గడించుకున్నారు. ఈ నరహరితీర్థ దగ్గరనుండే మూలరాముడి విగ్రహం, సీతాదేవి విగ్రహం ఆనందతీర్థులు, వారి అంతర్ధానానికి 3 నెలల 16 రోజులు ముందు సంపాదించారు. ఇవి శ్రీరాముడి కాలం నాటివేనని చెబుతారు. ప్రస్తుతం ఇవి మంత్రాలయంలో పూజింపబడుతున్నాయి.

ఆనందతీర్థులు బ్రహ్మసూత్ర భాష్యం ద్వైతపరంగా వ్రాశారు. ఇది విశేష ప్రశంసలందుకుంది. గురువు అచ్యుతప్రేక్షులు ద్వైతాన్ని అంగీకరించి పురుషోత్తమతీర్థగా మారారు. ఆనందతీర్థులు ఉడుపిలోని శ్రీ కృష్ణ దేవాలయంలో అనేక సంస్కరణలు తీసుకువచ్చి తాను చాల కాలం అక్కడే గడిపారు. ఉడుపి మధ్వుల పుణ్యక్షేత్రంగా మారింది. శ్రీ మధ్వులు మరొకసారి హిమాలయాల్లో వ్యాసదర్శనం చేసుకోవాలని నిశ్చయించుకున్నారు.

## 4. రెండవసారి బదరీయాత్ర

క్రీ.శ.1260–1271 మధ్య కాలంలో ఆనందతీర్థులు రెండవసారి బద్రీయాత్రకు బయలుదేరారు. మహారాష్ట్రలోని దేవగిరి (ఇపుడు దౌలతాబాదు) రాజ్యం మీదుగా గంగాతీరం చేరుకున్నారు. అక్కడతో హిందూరాజ్యం ఆఖరు. గంగకు ఉత్తరాన అల్లాయుద్దీన్ ఖిల్జీ పరిపాలిస్తున్నాడు. ఏ హిందువు గంగదాటకూడదనే

చండశాసనం చేసి పడవలను నిషేధించాడు. కాని ఆనంద తీర్థులు వాయుదేవుని సహాయంతో శిష్యులందరితో గంగ మధ్యనుండి నడుచుకుంటూ ఆవలి ఒడ్డుచేరారు. సైనికులు అడ్డగించి ఆనందతీర్థులను అల్లాయుద్దీన్ ఖిల్జీ సమక్షంలోనికి తీసుకువెళ్ళారు. అక్కడ ఆనందతీర్థులు పారశీక భాషలో మాట్లాడారు. ఆయన గంభీరమూర్తిని చూడగానే అల్లాయుద్దీన్ గౌరవించి సాదరంగా సాగనంపాడు. దారిలో అనేకమంది బందిపోటు దొంగలను, క్రూరమృగాలను ఎదుర్కోవలసి వచ్చింది. ఆరోజులలో ప్రయాణీకులకు భద్రత ఉండేదికాదు.

ఆనందతీర్థులు రెండవసారి వ్యాసులవారి దర్శనం చేసుకున్నారు. ఆశ్రమవాసులు ఆయన్ను ఎంతో ఆదరించి ఎనిమిది పవిత్రమైన సాలగ్రామాలను బహుకరించారు.

ఆనందతీర్థులు తిరుగుప్రయాణంలో కూడ అనేక కష్టాలను ఎదుర్కొవలసి వచ్చింది. కాని ఆయన మహిమలతో ముందుకు సాగి, హస్తినాపురం, కురుక్షేత్రం, కాశీ దర్శించుకున్నారు. అక్కడ కొంతకాలం ఉన్నారు. తరువాత హృషీకేశం, గోవాలమీదుగా ఉడుపి చేరుకున్నారు. రెండవసారి బదరీయాత్రలో వేదవ్యాసులవారు మహాభారత తాత్పర్యాన్ని వ్రాయమని ఆజ్ఞాపించారు. శిష్యులు యాత్రా విశేషాలను చెప్పుకుంటూంటే విని నారాయణపండితాచార్యులు 'మధ్వవిజయ' మనే గ్రంథాన్ని రచించారు. ఆనందతీర్థులు 'మహాభారత తాత్పర్య నిర్ణయ' అనే ప్రసిద్ధ గ్రంథాన్ని రచించారు. శ్రీ మధ్వులు భారతదేశంలోని ప్రసిద్ధ క్షేత్రాల నన్నింటిని దర్శించుకున్నారని చారిత్రకులు చెప్తారు.

# 5. ప్రతిఘటనలు

ఉడుపికి చేరువలోనే శృంగేరి శ్రీ శారదా పీఠం ఉంది. ఇది శ్రీ శంకరులు స్థాపించినది. అద్వైత సిద్ధాంత ప్రచారానికి కేంద్రస్థానం. పరిసర ప్రాంతాలలోనూ ఇతర ప్రదేశాలలోనూ కూడా ద్వైతం వ్యాపించడం వారికి కొంత ఇబ్బందికరంగా మారింది. మొదట ద్వైతం శాస్త్ర విరుద్ధమని ప్రచారం చేశారు. లాభం లేక పోవడంతో ముందుగా ద్వైత సిద్ధాంత గ్రంథాలను మాయం చేస్తే సరిపోతుందని కొందరు అనుకున్నారు. ఇద్దరు పండితులను వాదానికి పంపారు. శ్రీ మధ్వులు వారితో వాదించారు. వారు ఓటమిపాలై రాత్రికి రాత్రే నిష్క్రమిస్తూ గ్రంథాలయంలోని అనేక గ్రంథాలనుకూడ అపహరించుకు పోయారు. కాని వారిద్దరిని పట్టుకొని రాజుకు ఫిర్యాదు చేశారు. గ్రంథాలు రాజభటులు స్వాధీనం చేసుకున్నారు. రాజు జయసింహుడు ఆచార్యుల వారి గురించి, వారి సిద్ధాంతాల గురించి విని ముగ్ధుడై ఆస్థానానికి ఆహ్వానించాడు. శ్రీ మధ్వులు రాజాస్థానానికి బయలు దేరారు. దారిలోనే రాజు ఎదురుగా వచ్చి సాష్టాంగపడ్డాడు. గ్రంథాలు మళ్ళీ మఠం గ్రంథాలయానికి చేరాయి. అద్వైతంలో మహా పండితుడు ఆరోజుల్లో త్రివిక్రమాచార్యుడు. ఆయన ద్వైతం స్వీకరించాడు. శ్రీ మధ్వుల సూత్రభాష్యానికి త్రివిక్రమ పండితుడు 'తత్త్వ ప్రదీపిక' అనే పేరుతో వ్యాఖ్యానం రచించాడు. ఈయనతో బాటు అనేకులు అద్వైతులు ద్వైతాన్ని స్వీకరించారు.

ఈ కాలంలోనే శ్రీ మధ్వుల తల్లి తండ్రులు విష్ణు సాయుజ్యం పొందారు. తన తమ్ముడికి శ్రీ మధ్వులు సన్యాసదీక్ష ఇచ్చి 'విష్ణు తీర్థ' అని నామకరణం చేశారు.

## 6. చరమదశ

వాయుదేవుడి అవతారాలే హనుమంతుడు, భీముడు, శ్రీ ఆనందతీర్థులు అని చెప్తారు.అందుచేత వృద్ధాప్యంలో కూడా పూర్ణ ప్రజ్ఞులకు జవసత్వాలూ తగ్గలేదు! మేధస్సు పదునూ తగ్గలేదు! తాను వ్యాసాశ్రమం చేరుకుని అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకుంటానని చెప్తూ ఉండేవారు. తదనుగుణంగానే ఆయన చరమ దశలో బదరి చేరుకుని అక్కడ అంతర్ధానమయ్యారు.

మరికొందరు ఆయన చరమదశలో ఉడుపిలోని అనంతేశ్వరాలయంలో ఐతరేయ ఉపనిషత్తును ఉపదేశిస్తుండగా దేవతలు పుష్పవృష్టి కురిపించారని, ఆపూలలో ఆయన పూర్తిగా కప్పబడి ఆ కుప్పనుండి బయటకు రాకుండా అంతర్ధానమయ్యారని, ఆయన ఇంకా సజీవంగా బదరికా వనంలోని వ్యాసాశ్రమంలో ఉన్నారని అంటారు.

భారతదేశంలో యతిపుంగవులు సిద్ధి నిగూఢంగానే (mysterious) జరుగుతుంది. శంకరులు ఎలా అదృశ్యం అయ్యారో ఎవ్వరికి తెలియదు. ఇది వారి అతీంద్రియ శక్తులకు తార్కాణం. అదే విధంగా వీరి నిష్క్రమణం కూడా!

## 7. అసామాన్య కార్యం

అద్వైతం, విశిష్టాద్వైతం వేళ్ళూనుకొని ఒకదానితో ఒకటిపోటీ పడతున్న కాలంలో ఈ రెండింటిని కాదని ఒక స్వతంత్రమైన సిద్ధాంతాన్ని ప్రవచించి దాన్ని తన వాదనా పటిమతో జనసామాన్యంలో ఆమోదయోగ్యంగా చెయ్యడం అసామాన్య కృత్యం. దీన్ని తన యోగశక్తితోను, శ్రీమన్నారాయణుడిమీద అచంచల భక్తి విశ్వాసాల తోనూ, తర్కంతోనూ, అసాధారణ పాండితీ ప్రతిభతోను సాధించి శ్రీ పూర్ణప్రజ్ఞులు ప్రపంచానికి చేసి చూపించారు. ఆయన తన యోగశక్తితో ఎన్నో అద్భుతాలు చేశారు.

బదరి నుండి తిరుగు ప్రయాణంలో ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ తీరప్రాంతం, రాయలసీమ మీదుగా ఉడుపి చేరుకున్నారు. ఆయా ప్రాంతాలలో పండిత ప్రకాండులను వాదంలో గెలిచి ద్వైతానికి గుర్తింపు తీసుకువచ్చారు. తత్ఫలితంగా ఒరిస్సా, ఆంధ్ర తీరప్రాంతం, రాయలసీమ, మహారాష్ట్ర, కర్ణాటకలలో మధ్వులు విశేషంగా ఉన్నారు. అలా త్రిమతాచార్యులలో ఒకరుగా శ్రీ ఆనందతీర్థులు పూజింపబడుతున్నారు.

## 8. ఉడుపి

శ్రీ పూర్ణప్రజ్ఞులు కార్యస్థానం ఉడుపి అని చెప్పాలి. ఒక ఓడ మునిగిపోతూంటే శ్రీ మధ్వులు తన దివ్యశక్తితో రక్షించారు. ఆ ఓడ క్రింద, అది స్థిరంగా ఉండడానికి ఒక పెద్ద గోపి చందనం ముద్ద ఉంచారట. శ్రీ మధ్వులు ఆ ముద్దను బహుమతిగా తీసుకొని

అందులో ఉన్న సుందరమైన కృష్ణ విగ్రహాన్ని సంపాదించారు. ఆ విగ్రహానికి ఆలయం నిర్మించారు. అలా అక్కడ ఆయన శ్రీ కృష్ణ దేవాలయాన్ని స్థాపించి అక్కడ ఎనిమిది మఠాలను స్థాపించారు. ఇది మధ్వుల పుణ్యక్షేత్రంగానే కాక శ్రీకృష్ణ భక్తులందరికి పుణ్యక్షేత్రంగా రూపుదిద్దుకుంది. దీని పాలనా వ్యవస్థకూడా ఆయన పటిష్ఠపరిచారు. ఇప్పటికి ఈ క్షేత్రం అశేష కృష్ణభక్తులతో కళకళలాడుతూ ఉంది.

సాలగ్రామ శిలతో ఈ కృష్ణ విగ్రహాన్ని దేవ శిల్పియైన విశ్వకర్మ చెక్కాడని అంటారు. కనకదాసు అనే శ్రీ కృష్ణ భక్తుడు పంచముడైనందువల్ల దర్శనానికి అతనికి అనుమతి ఇవ్వకుండా ప్రక్కకు నిలబెట్టారట. అతను ఆర్తితో ప్రార్థిస్తే, శ్రీ కృష్ణ విగ్రహం కనకదాసు నిలుచున్న పడమరవైపుకు తిరిగి, ఒక చిన్న గవాక్షం ఏర్పడి కనకదాసుకు దర్శనమిచ్చిందట!

ఈ ఆలయంలో జరిగే ప్రధానమైన ఉత్సవాలు సప్తోత్సవం అనే ఏడురోజుల ఉత్సవాలు జనవరిలో, శ్రీ మధ్వులు అంతర్ధానం అయిన రోజున మధ్వనవమి, శ్రీ కృష్ణ జయంతి, ఉత్థాన ద్వాదశినాడు లక్ష దీపోత్సవం, పర్యాయమహోత్సవం.

## 9. పూర్ణప్రజ్ఞుల రచనలు

పూర్ణప్రజ్ఞులు తమ సుదీర్ఘ జీవితంలో ద్వైతమత సిద్ధాంతం మీద అపార సాహిత్యాన్ని సృష్టించారు. బ్రహ్మసూత్రాల మీద నాలుగు గ్రంథాలు వ్రాశారు. మొదటిది సూత్రభాష్యం. ఇది సంక్షిప్తంగా, పొంకంగా ఉండే వ్యాఖ్యానం. తరువాతిది అనువ్యాఖ్యానం. ఇది

1900 శ్లోకాలలో ఉన్న గ్రంథం. దీనిలో ఇతర సిద్ధాంతాలను వేద ప్రమాణాలతో తార్కికంగా వాదనా పటిమతో ఖండించడం జరిగింది. దీనిమీద జయతీర్థులు న్యాయసుధ అనే వ్యాఖ్యానం సరళమైన శాస్త్రభాషలో వ్రాశారు. మూడవది బ్రహ్మసూత్రాల మీద అనుభాష్యం. ఇది బ్రహ్మసూత్ర సారాన్ని పారాయణకనువుగా ఉండేటట్లు వ్రాయబడిన గ్రంథం. బ్రహ్మసూత్రాలమీదే న్యాయవివరణ అనే గ్రంథం మరొకటి. ఇందులో సూత్రాలు అధికరణాలుగా విభజింపబడ్డాయి. ఆనందతీర్థులు పది ఉపనిషత్తుల మీద భగవద్గీత మీద భాష్యాలు వ్రాశారు. వీరి మహాభారత తాత్పర్య నిర్ణయం అనే గ్రంథం ప్రసిద్ధమైనది. ఇలా భాష్యాలు, స్వతంత్ర రచనలు, కీర్తనలు మొత్తం ముప్పైఏడు లభిస్తున్నాయి.

## 10. దాససాహిత్యం

శ్రీ మధ్వుల శ్రీ కృష్ణ భక్తి తత్త్వం తదనంతరం దాస సాహిత్య సృష్టికి దారి తీసింది. అనేక మంది కృష్ణ భక్తి పరంగా అద్భుతమైన కీర్తనలు వ్రాసి గానం చేశారు. అలాంటి వారిలో ప్రముఖుడు పురందరదాసు. కన్నడంలో ఈయన సృష్టించిన సాహిత్యం ఆపాతమధురం భక్తిరసామృతం. తరువాత జగన్నాథదాసు, కనకదాసు, విజయదాసు మొదలైన వారున్నారు. కనకదాసు మందిరం ఉడుపి శ్రీ కృష్ణాలయంలో ఉంది.

# 2వ అధ్యాయం

## 1. ద్వైతసిద్ధాంతం

ద్వైత సిద్ధాంతం, ప్రధానంగా అద్వైతాన్ని తీవ్రంగా వ్యతిరేకించింది. విశిష్టాద్వైత సిద్ధాంతాలతో కొంత సారూప్యం ఉండడం వల్ల శ్రీ మధ్వులు ఆ సిద్ధాంతాన్ని ఎక్కడా విమర్శించలేదు.

ద్వైతంలోని ప్రధానాంశాలు (1) జగత్తు సత్యం; (2) జీవుడు, బ్రహ్మము ఒకటి కాదు–వేరు వేరు తత్త్వాలు; (3) పరమాత్మ సగుణ సాకారుడు; (4) శ్రీ మహావిష్ణువు పరమ దైవము; (5) మోక్షానికి అచంచల భక్తి మాత్రమే ఏకైక మార్గము, అనేవి. ఇవన్నీ అద్వైతానికి పూర్తిగా వ్యతిరేకం, విశిష్టాద్వైతానికి పూర్తిగా వ్యతిరేకం కాదు. శ్రీ మధ్వుల నాటికి అనేక అస్తిక సిద్ధాంతాలు ఉన్నా, వాటిని దేనిని ఇసుమంతయైనా అనుసరించకుండా పూర్తిగా స్వతంత్రించారు.

మధ్వమత సారసంగ్రహంగా శ్రీ వ్యాసరాయలు రచించినట్లు చెప్పే ఈ శోకం ప్రసిద్ధం:

**శ్లో॥ శ్రీ మన్మధ్వమతే హరిః పరతరః సత్యం జగత్, తత్త్వతో**
**భిన్నా జీవగణాః హరేరనుచరాః నీచోచ్చభావం గతాః।**
**ముక్తిర్నైజ సుఖానుభూతిః, అమలాభక్తిశ్చ తత్సాధనం**
**హ్యక్షాదిత్రితయం ప్రమాణం, అఖిలామ్నాయైక వేద్యోహరి॥**

(1) శ్రీ మహావిష్ణువే సర్వస్వతంత్రుడైన పరమ దైవం, (2) విశ్వం సత్యం, (3) జీవాత్మ పరమాత్మ వేరు, అలాగే జీవాత్మలు

కూడా పరస్పరం వేరు, (4) జీవులు పరమాత్మకు దాసులు, (5) వారిలో ముక్తియోగ్యులు, నిత్య సంసారులు తమోయోగ్యులు అనే తారతమ్యాలున్నాయి, (6) మోక్షమనగా పరమాత్మ స్వరూపానందం, (7) దానికి నిర్మలభక్తి ఏకైక మార్గం, (8) ప్రత్యక్ష, అనుమాన, ఆగమ ప్రమాణాలనే మూడే ప్రమాణాలు, (9) వేదార్థం శ్రీహరి మాత్రమే.

పై శ్లోకంలోని ఒక్కొక్క అంశం ద్వైతంలోని ఒక్కొక్క ప్రధానమైన విషయాన్ని తెలియజేస్తుంది. వాటిని నవరత్నాలన్నారు. ఈ శ్లోకాన్ని నవరత్న మాలిక అన్నారు.

పై శ్లోకాన్ని శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు తమ సంస్కృత వాఙ్మయ చరిత్ర - లౌకిక వాఙ్మయ భాగంలో ఇలా అనువదించారు:

**"సత్యము జీవాత్ముండును, సత్యం బీశ్వరుఁడు సకలసద్గుణుఁడతఁడౌ,**
**సత్యము వీరికి భేదము, సత్యము భేదంబు జీవజడముల కరయన్,**
**జీవుఁడస్వతంత్రధావుండు, విష్ణువు సుస్వతంత్రుఁ డతనిసుగుణములను**
**పొగడి యతనికరుణఁ బొందినజీవుండు, హరిసమీపమేగునదియెముక్తి."**

# 2. శ్రీ మహావిష్ణువు

ద్వైతంలో శ్రీ మహావిష్ణువే సర్వోత్తముడు. సర్వోత్తమత్వాన్ని శ్రీ మధ్వులు ఇలా నిర్వచించారు. "ఏకః సర్వోత్తమో జ్ఞేయః ఏక ఏవ కరోతి యత్" అంటే సర్వోత్తముడే స్వతంత్రముగా కార్యాలను

చెయ్యగలవాడు, చేయించగలవాడు. ఆయన ఎవ్వరిమీద ఈ విషయంలో ఆధారపడనవసరంలేదు." అని అర్థం. ఆయన ఏ పనినైనా చేయగలడు (కర్తుం), చేసినదానిని వెనుకకు మరల్చగలడు (అకర్తుం), అదే పనిని ఇంకొక విధంగా చేయగలడు (అన్యథా కర్తుం). సర్వోత్తముడు అంటే ఆ బ్రహ్మమే. ఆయనలోనే అన్ని తత్త్వాలు ఇమిడి ఉన్నాయి. ఆయన అన్నింటికి అతీతుడు. ఈ విశ్వం ఆయన సృష్టి, ఆయన అభివ్యక్తి. ఆయన అనంత కళ్యాణ గుణసమన్వితుడు. అజ్ఞానాది దోషరహితుడు. ఆయన ఎనిమిది కార్యాలకు అధిష్ఠాత, అవి: (1) సృష్టి (creation), స్థితి (maintenance), లయం (dissolution), నియమనము (control), జ్ఞానము ఇచ్చుట(giving knowledge), అజ్ఞానము కలిగించుట (ignorance), బంధము (bondage), మోక్షము (salvation).ఆయన ఈ కార్యాలన్నీ స్వతంత్రంగా నిర్వహిస్తున్నాడు:

**శ్లో॥ స్వతన్త్రమస్వతన్త్రంచ । ద్వివిధం తత్త్వ ముచ్యతే ।**
**స్వతన్త్రో భగవా న్విష్ణుః । నిర్దోషో -శేష సద్గుణః॥**

స్వతంత్రుడు శ్రీమహావిష్ణువు ఒక్కడే. ఆయనకు భిన్న మైనవన్నీ అస్వతంత్రాలే. ఆయన దోషరహితుడు, కళ్యాణగుణాకరుడు అని సర్వదర్శన సంగ్రహంలో సాయణ మాధవాచార్యులన్నారు. భగవద్గీతలో భగవానుడే ఇలా అనుగ్రహించాడు.

**శ్లో॥ యోమామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।**
**స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥ (15.19)**

ఓ అర్జునా! జ్ఞానియైనవాడు ఈ విధముగా తత్త్వతః పురుషోత్తమునిగా తెలుసుకొనును, వాసుదేవుడైన నన్నే సర్వదా పరమేశ్వరునిగా భజించును. శ్రుతులు కూడా ఆయన పురుషోత్తముడని కొనియాడాయి. ఆయన శరీరం ప్రాకృత శరీరం కాదు. ఆయనలో ప్రాకృత గుణాలూ లేవు. ఆపాదమస్తకం జ్ఞానానందకరమైన దివ్యశరీరం ఆయనకుంది. రూప, రస, గంధాలను గ్రహించే శక్తిగల ఇంద్రియాలున్నాయి. ఆయనలోని కళ్యాణ గుణాలు ఆయన దివ్యాత్మస్వరూపం కంటే వేరుకావు. ఆయన పరిపూర్ణులు. ఆయన అనేక అవతారాలను కూడా దాల్చాడు.

**శ్లో॥ బ్రహ్మశివస్సురేశాద్యాః శరీర క్షరణాత్ క్షరాః।**
**లక్ష్మీ రక్షర దేహత్వాత్ అక్షరా తత్పరో హరిః ॥**

క్షరాక్షరములకు అతీతుడు పురుషోత్తముడు. ఆయన పరమాత్మ, నాశరహితుడు, అని సాయణ మాధవాచార్యులన్నారు.

ఇలా శ్రీ మహావిష్ణువు పురుషోత్తముడని, ఆయన సాకార, సగుణుడని నిరూపించి శ్రీ మధ్వులు ఆయనే ఆరాధ్యుడని బోధించారు.

అయితే ఇక్కడొక విషయం వివరించాలి. విశిష్టాద్వైతుల వలె శ్రీ మధ్వులకు శివుడంటే వ్యతిరేక భావం లేదు. పరమశివునకు భారతదేశంలో అపారమైన ఆదరణ ఉన్న విషయం ఆయన గుర్తించారు. దీనికి తోడు ఆయన స్వయంగా షివల్లి శైవ కుటుంబంలో జన్మించి ఉండవచ్చునుకూడ. దక్షిణ కవరా దేశంలో చంద్రమౌళే శ్వరుడుగా, అనంతేశ్వరుడుగా, శివుడు అనేక దేవాలయాలలో

ఆరాధించబడడం ఆయన చూశారు. అందుచేత మధ్వ సిద్ధాంతంలో శివునికి అత్యున్నత స్థానం– అంటే చతుర్ముఖబ్రహ్మ, వాయుదేవుడు, వారి దేవేరుల తరువాత కల్పించబడింది. అందుచేత శివునికి వ్యతిరేకంగా మధ్వమతంలో ఎక్కడా ఏ రచనలలోనూ లేదు. ఈ విషయాన్ని శ్రీ పద్మనాభాచార్ వారి "శ్రీ మధ్వాచార్య, వారి జీవితం, సందేశం" అనే గ్రంథంలో (పేజి 285) వివరించారు.

మధ్వులు వాయుదేవుని అవతారమైన హనుమంతుణ్ణి, ప్రహ్లాదుని అవతారమైన శ్రీ రాఘవేంద్రస్వామిని విశేషంగా ఆరాధిస్తారు. ఇప్పటికి హనుమంతుని దేవాలయాలలో మధ్వులే పూజారులుగా ఉంటున్నారు. దీనికి కారణం వారిద్దరు పరమ విష్ణుభక్తి తత్పరులు కావడం వల్లే. అంతేకాకుండా హనుమంతుడు, శ్రీ మధ్వులు కూడా వాయుదేవుని అవతారాలు.

## 3. విశ్వం సత్యం

శ్రీ శంకరులు విశ్వం మిథ్య అన్నారు. మరి విశ్వం ప్రత్యక్షంగా గోచరిస్తుంది. ప్రత్యక్ష ప్రమాణం అన్ని ప్రమాణాలలోనూ ఉత్తమమైనది. అలాంటపుడు విశ్వం మిథ్య అనడం ప్రమాణ విరుద్ధం కదా అనే ప్రశ్న వస్తుంది. దీన్ని అధిగమించడానికి ఆయన సత్యాన్ని మూడు విధాలుగా వర్గీకరించాడు. అవి ప్రాతిభాసిక సత్యము (త్రాడు మీద పామును ఆరోపించడం); వ్యావహారిక సత్యము (మనము వ్యవహరించే ఆది మధ్యాంతాలు గల విశ్వం); పారమార్థిక సత్యం (ఆదిమధ్యాంతాలు లేని పరమాత్మ). విశ్వానికి ఆదిమధ్యాంతాలు

ఉండడం చేత అది వ్యావహారిక సత్యమే గాని పూర్తిగా సత్యం కాదు. అందుచేత మిథ్య. అంటే వారి దృష్టిలో కొంతకాలం ఉండి నిష్క్రమించేవన్ని అశాశ్వతం గనుక అసత్యాలుగానే పరిగణించబడతాయి. శాశ్వతమైనదేదో అదే సత్యం. దీన్ని పురస్కరించుకుని ద్వైతులిలా ప్రశ్నిస్తారు; "మన తాత ముత్తాతలందరు కొంతకాలం జీవించి నిష్కమించారు. అందువల్ల వారంతా అసత్యమేనా? మిథ్యామాత్రులేనా?" అని. ఇలా అశాశ్వతమైన వన్నిటిని మిథ్య అనడం, అలా అనడాన్ని సమర్థించుకోవడం కోసం సత్యాన్ని మూడు విధాలుగా వర్గీకరించడం అశాస్త్రీయమని ద్వైత సిద్ధాంతం వాదిస్తుంది.

ఈ సిద్ధాంతం ప్రకారం వేదాలలో గాని, ప్రస్థానత్రయంలో గాని సత్యం మూడు విధాలుగా వర్గీకరించబడలేదు. ఇది శ్రీ శంకరుల స్వకపోల కల్పన గాని దీనికి శ్రుతి ప్రమాణం లేదు. అందుచేత ఆమోదయోగ్యం కాదు. అంతేకాకుండా భగద్గీతలో ఇలా ఉంది:

**శ్లో॥ అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।**
**అపరస్పర సంభూతం కిమన్యత్కామహేతుకమ్॥ (16.8)**

పై శ్లోకంలో విశ్వం అసత్యం అనే వారు అసుర లక్షణం గలవారు అని చెప్పబడింది. తరువాతి శ్లోకంలో మిథ్యావాదులను ఖండించడం జరిగింది.

ఋగ్వేదంలో (2.7.3) 'విశ్వం సత్యం' అని స్పష్టంగా చెప్పబడింది.

పరమాత్మ ప్రకృతి నుపయోగించి విశ్వాన్ని రూపకల్పన చేస్తున్నాడు. ఆయన నిమిత్తకారణం. ప్రకృతి ఉపాదాన కారణం. పరమాత్మ స్వయంగా సృష్టించిన విశ్వాన్ని మిథ్య అనడం అపచారం. పరమాత్మ, ప్రకృతి నుపయోగించి సృష్టించిన విశ్వంలో తానుకూడా ప్రవేశించి అంతర్యామితుడై ఉంటున్నాడు. అలాంటి విశ్వాన్ని మిథ్య అంటే పరమాత్మను కూడ మిథ్య అనడమే అవుతుంది. వేదాలుకూడా మిథ్యే అవుతాయి.

పరమాత్మ, ప్రకృతి, జీవుడు–ఈ మూడు తత్త్వాలు శాశ్వతం, సత్యం. అలాగే ప్రకృతి నుపయోగించి పరమాత్మ సృష్టించిన విశ్వం సత్యం. 'మిథ్య' 'మాయ' అనే సిద్ధాంతాలకు తావులేదు.

తెలియబడేది, తెలుసుకొనేవాడు, తెలుసుకుంటే వచ్చే ప్రయోజనం, వీటి పరస్పర సంబంధం – దీన్ని అనుబంధ చతుష్టయం అంటారు. అంతా మాయే అయితే తెలుసుకొనేవాడూ ఉండడు, తెలియబడేది ఉండదు. లేని ప్రపంచాన్ని విరాగియై వదలి వెళ్ళిపోవడమూ ఉండదు. ఇలా ఆరంభంలోనే మాయావాదం భంగపడుతుంది. అంతా మాయే అయితే యజ్ఞయాగాదులెందుకు, పూజాదికాలెందుకు, తీర్థయాత్ర లెందుకు, పితృదేవతలకు ఆబ్దీకాలెందుకు, వేదాధ్యయనం ఎందుకు – ఇవన్నీ చూస్తూ ఉంటే మాయావాదం ప్రవచనానికి, గ్రంథాలకు పరిమితమేకాని, ఆచరణకు నోచుకోలేదు. అయితే ఇవన్నీ వ్యావహారిక సత్యాలంటారా, సత్యాన్ని వర్గీకరించడం శాస్త్ర సమ్మతం కాదు.

తన అవతార రహస్యాన్ని చెప్తూ పరమాత్మ భగవద్గీతలో (4.6) "సమ్భవామ్యాత్మ మాయయా" అని అన్నాడు. దీని అర్థం "నేను నా సంకల్ప బలంతో అవతరిస్తున్నాను" అని అర్థంకాని, ఏదో తన యోగమాయతోనో, మహిమతోనో అవతరిస్తున్నానని కాదు. మాయా శబ్దానికి పర్యాయపదాలు సూచించేదిగా ద్వైతులు ఈ శ్లోకాన్ని ఉదాహరిస్తారు.

శ్లో. **మహామాయేత్యవిద్యేతి । నియతిర్మోహినీతి చ ।**
**ప్రకృతి ర్వాసనేత్యేవ తవేచ్ఛానన్త కథ్యతే ॥**

ఓ అనంతా! మహామాయ, అవిద్య, నియతి, మోహిని, ప్రకృతి, వాసన–అనే శబ్దాలన్నీ నీ ఇచ్ఛకు పర్యాయపదాలు. అందుచేత ఈ శబ్దాలన్నీ శ్రీ మహా విష్ణువు యొక్క జ్ఞాన విశేషాలుగానే తీసుకోవాలి. మాయ పరమాత్మలోని అచింత్యశక్తి (inconceivable power). తనలో అంతర్నిహితంగా, తన అధీనంలోనే ఉన్న ఈ శక్తితోనే ఆయన, సృష్టి, స్థితి, లయాలు చేస్తున్నాడు. జ్ఞానం, అజ్ఞానం కలిగిస్తున్నాడు. బంధం, మోక్షం కలిగిస్తున్నాడు. ఇవన్నీ ఆయన దైవీశక్తులు. వీటన్నిటికి మించి ఆయన కృపాసాగరుడు. ఆర్తులైన భక్తులను కాపాడుతాడు.

ఇన్ని అమోఘశక్తులతో పరమాత్మ ఈ విశ్వాన్ని సృష్టించి అందులో తానుంటూ నడుపుతూంటే ఈ విశ్వం మిథ్య అనడం అర్థరహితం అంటారు శ్రీ మధ్వులు.

## 4. జీవాత్మ, పరమాత్మ ఒకటి కాదు

జీవాత్మ, పరమాత్మ వస్తుతః ఒకటే అన్నారు శంకరులు. జీవాత్మ శరీరాన్ని ఉపాధిగా గ్రహించాడు గనుక, మనోబుద్ధుల సాంగత్యంతో తన స్వస్వరూపాన్ని మరచి, తాను ఈ శరీరమే అనుకుంటున్నాడు. కాని 'బ్రహ్మవిదాప్నోతి పరం' – తన స్వస్వరూపం తెలుసుకున్న వెంటనే బ్రహ్మమే అయిపోతున్నాడని ఆయన సిద్ధాంతం. తరువాత వచ్చిన రామానుజులు పరమాత్మ చేతనాచేతన వస్తువులన్నీ తన శరీరంగానే కలిగియున్నాడని అన్నారు. అంటే ఈ జీవులందరు ఆయన శరీరభూతులే అని ఆయన సిద్ధాంతం. పరమాత్మ–జీవుడు, వీరిద్దరూ పూర్తిగా వేరూకాదు, పూర్తిగా ఒకటీకాదు. వీరి అనుబంధం ఒక విశిష్టమైన అనుబంధం. అందుచేత విశిష్టాద్వైతం. ఇక శ్రీ మధ్వులు పూర్తిగా స్వతంత్రించి వీరిద్దరూ వేరు వేరు తత్త్వములు, పరమాత్మ ఎవ్వరిమీద ఆధారపడడు, తద్విరుద్ధంగా జీవాత్మ వేరుగా ఉంటూ పరమాత్మ మీద ఆధారపడినవాడే, అంటే పరతంత్రుడే తప్ప స్వతంత్రుడు కాదు అన్నారు. ఇది ద్వైతం. జీవాత్మ పరమాత్మల అనుబంధం, అద్వైతం నుంచి ద్వైతం దాకా ఇలా పరిణామం చెందింది. రామానుజులకు మధ్వాచార్యులకు మధ్యన నింబార్కుడు 'ద్వైతాద్వైత' సిద్ధాంతాన్ని ప్రవచించినా దానికి అనుయాయులు లేనందువల్ల ప్రసిద్ధం కాలేదు. ద్వైతం అంటేనే భేదం. ద్వైతం పంచభేదాలను ప్రతిపాదిస్తుంది.

శ్లో. జీవేశ్వర భిదాచైవ, జడేశ్వరభిదా తథా
జీవభేదో మిథశ్చైవ జడజీవభిదా తథా ।
మిథశ్చ జడభేదో యః, ప్రపంచో భేద పంచకః॥
(సర్వదర్శన సంగ్రహం-సాయణ మాధవాచార్యులు.)

"ద్వైతం అయిదు భేదాలను అంగీకరిస్తుంది. అవి (1) జీవేశ్వరుల మధ్య భేదం, (2) జడేశ్వరుల మధ్య భేదం, (3) జీవులలో పరస్పర భేదం, (4) జడ-జీవుల మధ్య భేదం, (5) జడములలో పరస్పర భేదం"

శ్రీ మధ్వులు జీవేశ్వర భేద నిరూపణకి ముండకోపనిషత్తులోని ఈ మంత్రాలను శ్రుతి ప్రమాణంగా తీసుకుంటారు.

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాకశీతి ॥ (5.1)

సమాన గుణాలు కలిగి సఖ్యంగా ఉండే రెండు పక్షులు ఒకే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒక పక్షి ఫలాలను తింటూ ఉంటే, రెండో పక్షి నిర్లిప్తంగా చూస్తూ ఉంది. ఇది వాచ్యార్థం. తాత్త్వికమైన వ్యంగ్యార్థం, రెండు పక్షులు అంటే ఇద్దరు చేతనులు. వారు ఆశ్రయించిన వృక్షం నశ్వరమైన శరీరం. ఫలాలనారగించే పక్షి కర్మ ఫలాల ననుభవించే జీవుడు. నిర్లిప్తంగా చూస్తూ ఫలాల నారగించకుండా ఉండే పక్షి ఈశ్వరుడు.

ఈ శ్లోకంలోని స్పష్టమైన ద్వివచన నిర్దేశం, కర్మ పరాధీనుడైన జీవునికి కర్మపరాధీనుడు కాని పరమాత్మకు భేదం నిర్దుష్టంగా సూచించబడింది.

**సమానే వృక్షే పురుషో నిమగ్నః**
**అనీశయా శోచతి ముహ్యమానః**
**జుష్టం యదా పశ్యత్యన్యమీశం**
**అస్య మహిమానమితి వీతశోకః (5.2)**

త్రిగుణాత్మక ప్రకృతి పరాధీనుడైన జీవుడు శరీరంతో తాదాత్మ్యం పొంది దుఃఖిస్తూ ఉంటాడు. ఎపుడైతే తనకంటె భిన్నుడైన స్వామియైన ఆ పరమాత్మ ప్రభావాన్ని సాక్షాత్కరింపజేసుకోగలుగుతాడో అపుడు ఈ సంసార దుఃఖానికి దూరమై ముక్తుడౌతాడు.

ఈ రెండు మంత్రాలలో జీవేశ్వరుల భేదాన్ని, జీవుడికి ముక్తి మార్గాన్ని స్పష్టంగా భోదించింది శ్రుతి. ద్వైతపరంగా ఉన్న ఈ మంత్రాలను అద్వైతపరంగా వ్యాఖ్యానించడానికి అద్వైత సిద్ధాంత వ్యాఖ్యాతలు చాల శ్రమపడిన మాట వాస్తవం. ఈ మంత్రాల విషయం ఇలా ఉంటే 'తత్త్వమసి' అనే ఛాందోగ్యంలోని మహావాక్యాన్ని ద్వైతపరంగా వ్యాఖ్యానించడానికి ద్వైతసిద్ధాంత ప్రవర్తకులూ అంతే శ్రమపడ్డారు.

'తత్త్వమసి' అనే మహావాక్యం జీవాత్మల అభేదాన్ని స్పష్టంగానే సూచిస్తూంది. దీన్ని అధిగమిస్తేగాని ద్వైతాన్ని నిరూపించలేం. ఈ మహావాక్యాన్ని శ్రీ మధ్వులు ఇలా వ్యాఖ్యానించారు.

శ్లో. **అహమిత్యపరోక్షంతు తచ్ఛబ్దో హ్యవిశేషతః।**
**త్వంశబ్దశ్చాపరోక్షార్థం తయోరైక్యం కథం భవేత్ ॥**
**ఆదిత్యో యూప ఇతివత్ సాదృశ్యార్థాత్తు సాశ్రుతిః.**

(సర్వదర్శన సంగ్రహం-శ్రీ సాయణమాధవాచార్య ప్రణీతం: ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారి వ్యాఖ్యానం- పేజి 257)

ఏ విశేషములేని 'తత్' శబ్దం ఎప్పుడూ పరోక్షార్థాన్నే బోధిస్తుంది. 'త్వం' శబ్దం ఎదుట నున్న వస్తువునే బోధిస్తుంది. పరోక్షంగా ఉండే పరమాత్మకు, ప్రత్యక్షంగా ఉండే జీవుడికి ఐక్యం ఎక్కడ నుండి వస్తుంది? 'ఆదిత్యో యూపః' అనే శ్రుతి వాక్యానికి సూర్యుడే యూపస్తంభం అని అర్థం చెప్తే ఎలా? దానర్థం యూపస్తంభం సూర్యుడు లాగా మెరుస్తూంది అని మాత్రమే. అలాగే పరమాత్మకు జీవాత్మకు సామ్యం ఏమిటంటే ఇద్దరూ చేతనులే. అంతేగాని స్వతంత్రుడు, సర్వవ్యాపకుడు అయిన పరమాత్మకు, అణుస్వరూపుడు పరతంత్రుడు అయిన జీవునకు స్వరూపైక్యం చెప్పరాదు. అందుచేత ఛాందోగ్యంలో ఉన్న **"ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం । స ఆత్మా । తత్త్వమసి శ్వేతకేతో" అనే వాక్యాన్ని "స ఆత్మా అతత్త్వమసి శ్వేతకేతో"** అని సవర్ణదీర్ఘసంధిని విడగొట్టి "అతత్త్వమసి" అని అన్వయిస్తే ఆ పరమాత్మ స్వతంత్రుడు సర్వజ్ఞుడు, నీవు అస్వతంత్రుడవు, అజ్ఞుడవు, అందుచేత నీకు ఆయనతో ఐక్యం లేదు అని చెప్పవచ్చు నని కొందరి వ్యాఖ్యాతల అభిప్రాయం. దీన్ని పురస్కరించుకొని, రాధాకృష్ణ పండితులిలా అన్నారు.

“ద్వైతార్థమును గల్పించి సమర్ధించుటకు మధ్వాచార్యులు అనేక శ్రుతి వాక్యములకు శ్రమతో ప్రయత్నించి తన కనుగణ మొనర్పవలసి వచ్చినది. ‘తత్త్వమసి’ మహావాక్యమున కర్థము చెప్పుచు, నది జీవేశ్వరైక్యమును జెప్పదనెను. ఆత్మకు గల లక్షణములు మూలములో నీశ్వర లక్షణ తుల్యములే యని దాని యర్థము. ఈశ్వరాంశమే జీవాత్మయని ప్రకటించు వాక్యములకు నిదే యర్థము. శ్రుతి వాక్యముల నాతడింకొకక్రమములో జదువును. ‘స ఆత్మా తత్త్వమసి’ యను దానిని ‘స ఆత్మా అతత్త్వమసి’ యని చదివి ‘ఆత్మ నీవు కావ’ని చెప్పును. ‘అయమాత్మా బ్రహ్మ’ యనునది కేవల జీవాత్మస్తుతి వాక్యమగును, లేదా, ధ్యానోపయోగార్థ మంత్రమని యాత దర్థము చెప్పెను.”

(భారతీయ తత్త్వశాస్త్రము– Vol 5. P. 302) విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు (తి.తి.దే. ప్రచురణ)

సిద్ధాంత కర్తలు శ్రుతివాక్యాలను తమ తమ సిద్ధాంతాల కనువుగా వ్యాఖ్యానించడం సర్వసాధారణం. అంతే గాక శ్రుతిలో అన్ని సిద్ధాంతాలను సమర్థించే వాక్యాలు అక్కడక్కడ ఉన్నాయి. అయితే సర్వస్వతంత్రుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు అయిన పరమాత్మకు, పరతంత్రుడు, అజ్ఞుడు అయిన జీవాత్మకు సారూప్యం చెప్పడం విడ్డూరంగానే కనిపిస్తుంది. ఈ దృక్పథంలో చూచినప్పుడు మధ్వుల ద్వైతవాదం సమర్థనీయమని చెప్పడానికి భగవద్గీతలోని ఈ క్రింది శ్లోకం బలం చేకూరుస్తుంది.

శ్లో. **మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।**
**శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః ॥**

పరమేశ్వరుడనైన నన్ను, ఏకాగ్రచిత్తంతో, శ్రద్ధాభక్తులతో నిరతరం భజిస్తూ నా సగుణరూపాన్ని ఆరాధించే భక్తులే యోగులలో శ్రేష్ఠులు అన్నాడు పరమాత్మ భక్తుడైన అర్జునునితో. ఈ శ్లోకంలో ఆరాధనీయుడు పరమాత్మ యని, ఆరాధించవలసినవాడు జీవుడని, ద్వైతభావం స్పష్టంగా గోచరిస్తుంది.

# 5. జీవుడు

ఇక మౌలికంగా జీవులంటే పరమాత్మకంటే భిన్నులైన జీవాత్మలు. వీరికి జ్ఞానం, ఇచ్ఛాశక్తి ఉంటుంది. వీరికి విషయాలను తెలుసుకోవడానికి కర్మలు చెయ్యడానికి, అనుభవించడానికి కావలసిన శక్తి ఉంటుంది. జీవాత్మ అణుప్రమాణంలో ఉన్నా శరీరం అంతా వ్యాపించే శక్తి గలది. తన్నుతాను తెలుసుకోవడానికి, ఇతరులను తెలుసుకోవడానికి కావలసిన శక్తి దానికుంటుంది. అది పరమాత్మ ప్రతిబింబం గనుక, ఆయన లక్షణాలైన ఆత్మ వికాసం, ఆనందం సంతరించుకున్నా, పరమాత్మపై ఆధారపడిందే తప్ప స్వతంత్ర తత్త్వంకాదు.

జీవాత్మలు అనంతం-పరస్పరం భిన్నం- ప్రకృతి జన్యమైన వస్తు సమూహం కంటె భిన్నం. దేనికి దానికే ప్రత్యేకత. దేహం కంటె మనోబుద్ధుల కంటె తాను వేరనే జ్ఞానం లేకపోవడం జీవాత్మకు గల అవిద్య. అది పరమాత్మ ఇచ్ఛవల్లే జనించింది. దానివల్లే సంసారబంధం, నిరంతర జననమరణాలు.

అద్వైతం జీవులను వర్గీకరించలేదు. కారణం జీవాత్మ, పరమాత్మ నిజానికి ఒకటే అన్నపుడు వర్గీకరణ పొసగదు. విశిష్టాద్వైతం స్వరూపైక్యాన్ని అంగీకరించదు గనుక ఆ సిద్ధాంతం జీవులను నిత్యులు, ముక్తులు, బద్ధులు అని వర్గీకరించింది. విశిష్టాద్వైతానికి, ద్వైతానికి కొంత సారూప్యం ఉన్నా ఈ వర్గీకరణలో విశిష్టాద్వైతులు చెప్పే నిత్యులు అనే వర్గాన్ని ద్వైతం అంగీకరించదు. విశిష్టాద్వైతంలో ఎప్పుడు సంసారంలో లేకుండా నిత్యం శ్రీ మహావిష్ణువు చెంతనే ఉండే గరుడాళ్వారు, ఆదిశేషుడు, విష్వక్సేనాదులు నిత్యులు. అయితే ద్వైతం వీరెవ్వరు నిత్యులు కాదంటుంది. లక్ష్మీనారాయణులిద్దరే నిత్యులంటుంది.

ద్వైతం జీవులను మూడు వర్గాలుగా విభజించింది. వారు ముక్తియోగ్యులు, నిత్యసంసారులు, తమో యోగ్యులు. ఇందులో ముక్తియోగ్యులను మళ్ళీ అయిదుగా విభజించారు. వారు దేవగణం, ఋషిగణం, పితృగణం, చక్రవర్తిగణం, మనుష్యోత్తమగణం. వీరందరు సాత్వికులు ముక్తియోగ్యులు. దేవగణానికి చెందినవారు బ్రహ్మ, గరుత్మంతుడు, ఆదిశేషుడు, అగ్ని, వాయువు మొదలైన వారు. ఋషిగణానికి చెందినవారు, నారదుడు మొదలైనవారు. జనకుడు, అంబరీషుడు మొదలైన వారు చక్రవర్తి గణానికి చెందినవారు. ఈ ముక్తియోగ్యులలో స్థావరాలైన వృక్షాలు, పశుపక్ష్యాదులు కూడా చేర్చబడ్డాయి. అయితే ఇవి ఏమి సాధనచేసి మోక్షం పొందుతాయి అనే ప్రశ్నకు, పరమాత్మయొక్క కృపా విశేషం వల్లే మోక్షం పొందుతాయని సమాధానం.

ముక్తియోగ్యులు భక్తితో శ్రవణం, మననం, నిదిధ్యాసల ద్వారా మోక్షాన్ని పొందుతారు. వీరు సదాచార సంపన్నులు, సత్ప్రవర్తన, అచంచల భక్తి కలిగి ఉంటారు.

కర్మలను చేస్తూ, సుఖదుఃఖాలననుభవిస్తూ జనన మరణవలయంలో చిక్కుకుని ఉండేవారు నిత్య సంసారులు. వీరు పుణ్యఫలానుభవానికి స్వర్గానికి, పాప ఫలానుభవానికి నరకానికి వెడుతూ ఉంటారు. మళ్ళీ జన్మిస్తూ ఉంటారు.

ఇక రాక్షసులు, మనుష్యాధములు, తమోయోగ్యులు. వీరెప్పుడు పాపకృత్యాలే చేస్తూంటారు గనుక నరకంలోనే ఉంటారు.

సత్వగుణ సంపన్నులు ముక్తియోగ్యులు, రజోగుణసంపన్నులు నిత్యసంసారులు, తమోగుణ సంపన్నులు తమో యోగ్యులు. పంచ భేదాలను వివరిస్తూ జీవులలో పరస్పర భేదం ఉంటుందని చెప్పడం జరిగింది. దీన్ని స్వరూప తారతమ్యం అంటారు. మళ్ళీ ఈ జీవులను మూడు వర్గాలుగా విభజించడం స్వరూప త్రైవిధ్య అంటారు. ఇది శ్రుతి సమ్మతం. శ్రీ మధ్వులు భగవద్గీతలోని ఈ క్రింది శ్లోకాన్ని వారి విభజనకు ప్రమాణంగా సూచిస్తారు.

శ్లో॥ **ఊర్ధ్వం గచ్ఛన్తి సత్వస్థా**
**మధ్యే తిష్ఠంతి రాజసాః ।**
**జఘన్యగుణవృత్తిస్థా**
**అధో గచ్ఛన్తి తామసాః ॥**

సత్త్వగుణము గలవారలు ఊర్ధ్వలోకాలను, రజోగుణము గలవారలు మనుష్యలోకమును, తమోగుణము గలవారలు అధోలోకమును (నరకమును) పొందుతున్నారు.

అయితే ప్రతి మానవుడిలో దైవత్వం ఉంటుందని, దాన్ని వికసింప జేసుకోవడానికి అవకాశం ఉండాలని, ఈశ్వర కృపకు తాననర్హుడు అంటే నైరాశ్యం చోటుచేసుకుంటుందని, ఉజ్జీవించడానికి చేసే పురుష ప్రయత్నం నిరర్థకమనే, విమర్శకు తావివ్వడం ఈ సిద్ధాంతంలో ఒక లోపమేనని రాధాకృష్ణ పండితులు విమర్శించారు. (భారతీయ తత్త్వశాస్త్రం-5-308)

అయితే తమోయోగ్యులకు నివృత్తి అనేది ఈ సిద్ధాంతంలో లేకపోవడం కొంత అసంతృప్తికి, విమర్శకు ఆరోజులలోనే దారితీసిందిగాని దీనికి శ్రీ మధ్వులు సయుక్తికంగానే సమాధానం చెప్పారు. తమోయోగ్యుల ప్రవృత్తి ఎప్పుడూ పాపకృత్యాలవైపుకే మొగ్గుచూపుతుంది. వాళ్ళ ప్రాకృతమైన గుణాన్ని ఎవ్వరూ మార్చలేరు. అలా మార్చడమంటే ఆ జీవాత్మను నాశనం చెయ్యడం క్రిందే వస్తుంది. స్వరూపాన్ని లేక స్వభావాన్ని మార్చడం అంటే దాన్ని నాశనం చెయ్యడమే. అలా మారుస్తే దాని స్థానంలో ఇంకొక జీవాత్మ వచ్చినట్టే లెక్క. అందుచేత పరమాత్మ అలాంటి పని చెయ్యడు. అంతేకాకుండా పరమాత్మ తమోయోగ్యులకు నిరంకుశంగా నరకప్రాప్తి పొందించడు. వాళ్ళు దుర్మార్గాలకు, పాపాలకు పాలయినప్పుడే నరకంలోకి తోస్తాడు. ఇలాంటి వాళ్ళమీద క్షమాబుద్ధిని ప్రదర్శించడు.

అలాచేస్తే అది ధర్మానికి వ్యతిరేకం అవుతుంది. అలా పాపులను శిక్షించడం శ్రీ మధ్వులకు ఆమోదయోగ్యమే అంటారు ద్వైత సిద్ధాంతంలో విశేష కృషి చేసిన శ్రీ పి. నాగరాజా రావుగారు. (Introduction to vedanta -P.194-Bharatiya Vidya Bhawan Publication) అందుచేత తమోయోగ్యులు వారి ప్రవృత్యాను సారం దుష్కార్యాలు చేస్తూనే ఉంటారు, పరమాత్మచేత శిక్షించబడుతూనే ఉంటారు - ఇది వాళ్ళ మార్చలేని స్వభావం - దానికెవ్వరు ఏమీ చెయ్యలేరు. వీరు భక్తి ప్రపత్తులతో మోక్షం పొందలేరా? అంటే అలా చెయ్యడం వారి ప్రవృత్తికే వ్యతిరేకం గనుక వారలా చేసే ప్రసక్తే లేదు అని ఈ సిద్ధాంతం ప్రవచిస్తుంది. రాయబారంలో దుర్యోధనుడిని అతని దుష్టప్రవృత్తి నుండి శ్రీకృష్ణ పరమాత్మ కూడా మార్చలేక పోయాడు కదా!

## 6. భక్తి

ఎప్పుడైతే పరమాత్మ సాకారుడు, సగుణుడు, పురుషోత్తముడు, జీవాత్మ పరాధీనుడు అని సిద్ధాంతీకరించారో, అపుడు పరమాత్మమీద భక్తి మాత్రమే ముక్తి సాధనమౌతుంది. ద్వైతం భగవద్గీతలోని ఈ శ్లోకం మీద ఎక్కువ ఆదరణ చూపిస్తుంది.

శ్లో॥ **మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।**
**శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః ॥ (12.2)**

పరమేశ్వరుడనైన నాయందే ఏకాగ్రచిత్తులై, నిరతరము నా భజనధ్యానాదుల యందే నిమగ్నులై అత్యంత శ్రద్ధాభక్తులతో సగుణరూపమున నన్ను ఆరాధించు భక్తులే యోగులలో మిక్కిలి

శ్రేష్ఠులు అని పరమాత్మే ఉపదేశించాడు. దేహాభిమానులకు అవ్యక్తపరబ్రహ్మ ప్రాప్తి కష్టమని కూడా ఆయనే చెప్పాడు.

"శంకరు నద్వైత వాద మఖండ ప్రజ్ఞాఫలితమైనను, మతనిష్ఠనొసగజాలదని యాక్షేపణ గలదు. అతని నిర్గుణబ్రహ్మ మన హృదయములో నుజ్వల ప్రేమనుగాని భక్తినిగాని జనింపజేయజాలదు. ఎవ్వడు, నెన్నడు జూచి యుండనట్టియు జూడరానట్టియు, నెవ్వడు సమీపించుట కవకాశములేని జ్యోతిర్మయ స్వరూపము గలట్టియు నిర్గుణ బ్రహ్మమును మనమారాధింపజాలము. నిరాకార బ్రహ్మము మనయారాధన కనుకూలమగు రీతిని సాకార మయ్యెనని చెప్పబడెను... ఈ సగుణ బ్రహ్మము స్వచ్ఛ భక్తి పూజపాత్రుడు; ఆతడు మానవకోటి భయభక్తుల కుదాసీనత వహించు ధర్మసంబంధములేని దైవముకాడు. ఆతడు రజస్సత్వ పరిపూర్ణుడై, ధర్మదయ నిధియై, సర్వజ్ఞత్వ, సర్వవాపిత్వ, సర్వశక్తి మతత్వములు గలిగి జగత్కర్తయు, భర్తయు ధర్మాధ్యక్షుడునై వ్యవహరించును" అని రాధాకృష్ణ పండితులు చెప్పిన వాక్యాలు శిరోధార్యాలు - (భా.త.శాస్త్రము- 180-181- తి.తి.డి. ప్రచురణ).

సిద్ధాంత త్రయంలో ఎన్ని పరస్పర వైరుధ్యాలున్నా భక్తి దగ్గర కొచ్చేసరికి ఏకమౌతున్నాయి. దీనికి తార్కాణం శంకరులు రచించిన భజగోవింద శ్లోకాలు, శ్రీ లక్ష్మీ నృసింహ కరావలంబన స్తోత్రం లాంటి వన్నీ త్రిమతాల వారికి ఆమోదయోగ్యం కావడమే.

పరమాత్మ అస్తిత్వాన్ని నిరూపించిన తర్వాత శ్రీ మధ్వులు ఆయన్ను చేరుకొనే మార్గం భక్తి అని చెప్పారు. మరి ఆ భక్తి ఎలా

జనిస్తుంది? అంటే పరమాత్మను దర్శించాలనే జిజ్ఞాస బలంగా ఉండాలన్నారు. మరి ఆ జిజ్ఞాస ఎలా వస్తుంది అంటే అది మనం సంపాదించగలం అని అనుకోకూడదు. దానికి భగవంతుని అనుగ్రహం కావాలని విశ్వసించి, ఆయనకు సంబంధించిన ఆధ్యాత్మ గ్రంథ శ్రవణం చెయ్యాలి, వాటిమీద మనసు, నిదిధ్యాస చెయ్యాలి. ఈ ప్రక్రియల ద్వారా జిజ్ఞాస, వైరాగ్యం, భక్తి వరుసగా వస్తాయి. అంటే ప్రయత్నం ద్వారానే పరమాత్మ అనుగ్రహం పొందగలం అని అర్థం. వైరాగ్యం వచ్చిన తర్వాత ఐహిక అనుబంధాల మీద ఆసక్తి తగ్గి పరమాత్మ వైపు పూర్తిగా దృష్టి మరలుతుంది. ఆయన మీద అచంచల విశ్వాసం, ఆయనే తనను రక్షిస్తాడనే నమ్మకం కలిగి ఆయనకు పూజాదికాలు చేస్తూ ఉంటాడు. అదే భక్తి. ఈ భక్తి రెండు విధాలుగా వ్యక్తమవుతూ ఉంటుంది. అది పరమాత్మ గురించిన విషయాలు అధ్యయనం చెయ్యడం, తాను తెలుసుకున్నవి ప్రవచనం చెయ్యడం, ఎప్పుడైతే అధ్యయన, అధ్యాపనాలు ఉన్నాయో జ్ఞానం ఉన్నట్లే కదా! అందుచేత శ్రీ మధ్వుల భక్తి, జ్ఞానంతో మిళితమైనదే అనేది నిర్వివాదాంశం.

శ్రీ మధ్వులు భాగవతంలోని భక్తిని ప్రవచించారు. అది తొమ్మిది విధాలని ఆయన చెప్పారు. దానికి ప్రహ్లాదో పాఖ్యానంలోని పోతన్నగారి ఈ ప్రసిద్ధ పద్యం చూడండి.

**మ. తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా**
**ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం**
**బను తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స**
**జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా.**
**(7.167)**

సర్వాంతర్యామియైన శ్రీహరిని నమ్మి, మనోవాక్కాయాలచే ఆయన్ని ప్రేమించడం, ఆయన లీలలు వినడం, ఆయనకు దాసుడుగా ఉండడం, మ్రొక్కడం, పూజించడం, సేవించడం, తనలో ఎఱుక గలిగి ఉండడం, కీర్తించడం, ధ్యానం చెయ్యడం అనే తొమ్మిది భక్తి మార్గాలలో ఆ పరమాత్మను నమ్మి ఉండడం శ్రేయస్కరం అంటుంది భాగవతం. ఈ తొమ్మిది భక్తి మార్గాలనే శ్రీ మధ్వులు ప్రవచించారు.

భక్తికి ఇంద్రియ నిగ్రహం, ఏకాగ్రత ప్రధానం గనుక ఏకాదశి వ్రతాన్ని, చాతుర్మాస వ్రతాన్ని శ్రీమధ్వులు తప్పకుండా పాటించాలని ప్రవచించారు. మడి, ఆచారాలు కూడా ఆయన ఎక్కువగా పాటించారు.

"నామకరణం పుత్రాదీనాం కేశవాదినామ్నా వ్యవహారః సర్వదా తన్నామానుస్మరణార్థమ్'' పుత్రాదులకు కేశవాది భగవన్నామాలు పెట్టడడం వల్ల సదా విష్ణు నామ స్మరణం జరుగుతుందని ఆయన చెప్పారు.

**శ్లో॥ దక్షిణేకరే విప్రో బిభృయాద్వై సుదర్శనం ।**
**సవ్యేన శంఖం బిభృయాత్ ఇతి బ్రహ్మ విదో విదుః ॥**

మధ్వబ్రాహ్మణులు కుడి భుజమునందు చక్రమును, ఎడమ భుజమునందు శంఖమును ధరించ వలెనని వేదవేత్తలు చెప్పుచున్నారు. ఇవి ధరించేడప్పుడు పఠించవలసిన మంత్రాలు ఆగ్నేయ పురాణంలో ఉన్నాయి. ఈవిషయాలను సాయణ మాధవార్యులు చెప్పారు. (చూ. సర్వదర్శన సంగ్రహం- ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు. పేజి 247)

శ్రీ మధ్వులు నిత్య సంధ్యావందనం, దేవతార్చన, నైవేద్యం మొదలైన సదాచారాలను ప్రోత్సహించారు. ఇవి ఇప్పటికి మధ్వులు పాటిస్తున్నారు. శ్రీ మధ్వులు చెప్పినట్లు మన పిల్లలకు మన హిందూ దేవుళ్ళ పేర్లు పెట్టడం ఎంతైన అవసరం. ఈ సంప్రదాయం యాభై సంవత్సరాల క్రితం వరకు తప్పకుండా పాటించేవారు. ఇపుడు ఎవరికి అర్థంకాని, ఉచ్చరించలేని వికృతమైన నామకరణాలు చెయ్యడం సర్వసాధారణమై పోయింది. ఈ దుస్సంప్రదాయం పోవాలి.

## 7. మోక్షం

మోక్షం అంటే స్వర్గ సుఖం అని కొందరు అనుకుంటారు. స్వర్గసుఖం వేరు, మోక్షానందం వేరు. 'సుఖం' అంటే భౌతికమైనది. 'ఆనందం' అంటే మనో బుద్ధులను గూడా అధిగమించిన బ్రహ్మానందం. ఇది భౌతికంకాదు. స్వర్గ సుఖాలు భౌతికమైనవి. మనం చేసిన పుణ్యానికి ఎంత సుఖం వస్తుందో అంతే. తరువాత మళ్ళీ జన్మనెత్తవలసిందే – క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి. అంటే మనం సంపాదించిన పుణ్యాన్ని స్వర్గంలో ఖర్చు పెట్టేస్తున్నామన్నమాట. అందుచేత ఆ సుఖం అశాశ్వతం. అలాగే పాపకృత్యాల వల్ల నరకం సంభవిస్తుంది. పాప ఫలాన్ననుభవించిన తర్వాత మళ్ళీ జన్మ సంభవిస్తుంది. మానవుడుగా పుట్టి కర్మలు చెయ్యకుండా ఉండలేం గనుక వాటి ఫలితాలననుభవించి మళ్ళీ జన్మిస్తూంటాం. జీవుడు శాశ్వతం, శరీరం అశాశ్వతం. ఇలాంటి జనన మరణ క్లేశాలు లేని శాశ్వతానంద స్థితే మోక్షం అంటే. అది

భక్తివల్ల, శ్రీ మన్నారాయణుడి కృప వల్ల సంభవిస్తుంది. అపుడు కలిగేది అపరోక్ష జ్ఞానం – భగవంతుణ్ణి ప్రత్యక్షంగా దర్శించడం, ఈ అపరోక్షానుభూతే మానవుని గమ్యం.

ముక్త జీవులు వైకుంఠం చేరుకుంటారు. 'మధ్వవిజయం' లో నారాయణ పండితులు వైకుంఠాన్ని వర్ణించారు. భాగవత పురాణంలో ఈ వర్ణన ఉంది. ధర్మం మూర్తీభవించిన శ్రీ మన్నారాయణుడు తన దివ్య మంగళ స్వరూపంతో అక్కడ ఉంటాడు. భక్తులక్కడ దివ్య విమానాలలో విహరిస్తూంటారు. పూదోటలతోను, తులసి వనాలతోనూ, పక్షుల స్వరాలతోనూ శోభాయమానంగా ఉంటుంది. ముక్తులు అక్కడ శ్రీ మహావిష్ణువును కీర్తిస్తుంటారు. ఆయన చెంత శ్రీదేవి ఉంటుంది.

స్వరూపానుభవం ప్రాకృత శరీరంలో ఉన్నపుడు అవరోధించబడుతుంది. దీపానికి చుట్టూ ధూమం ఆవృతమైతే దీప ప్రకాశం గోచరించదు. అలాంటిదే ప్రాకృత శరీరం. ఇది కర్మలతో వస్తుంది. మోక్షదశలో శ్రీ మన్నారాయణుని అనుగ్రహంతో ఈ అవరోధం (ప్రాకృత శరీరం) పోతుంది. అపుడు వైకుంఠంలో స్వరూపానుభవం కలుగుతుంది.

మోక్షానుభవంలో తరతమ భేదాలున్నాయి. అవి సాలోక్యము, అంటే వైకుంఠములోనే ఉంటూ యథేచ్ఛగా విహరిస్తూ భోగాలననుభవించడం, సామీప్యము, అంటే భగవంతుని సమీపంలో ఉంటూ పరమానందాన్ని అనుభవించడం. సారూప్యము, అంటే

చతుర్భుజ శంఖచక్రాలతో భోగాలననుభవించడం, సాయుజ్యం అంటే భగవంతుని శరీర ప్రవేశం చేసి భోగముల ననుభవించడం.

విశిష్టాద్వైతంలో మోక్షానుభవం ముక్త పురుషులందరికి సమానంగానే ఉంటుంది. కాని ద్వైతంలో తారతమ్యం ఉంటుంది. ఇదొక ప్రధానమైన భేదం. జీవిత కాలంలో చేసిన భక్తి విశేషాలలో, సాధనలో ఉపాసనలలో ఉన్న తారతమ్యం మోక్షంలో కూడా ప్రతిబింబిస్తుంది. దేవతలు, ఋషులు, మనుష్యులు అందరు ఉపాసన చేస్తారు; అయితే దేవతల ఉపాసన అధికం, ఋషుల ఉపాసన అంతకంటే తక్కువ, మానవుల ఉపాసన ఇంకా తక్కువ. వీరిలో కూడా అందరి ఉపాసన ఒకే మాదిరిగా ఉండదు. ఉపాసకుని సాధనలో నున్న ఎక్కువ తక్కువల కనురూపంగానే భగవంతుని అనుగ్రహం కూడా ఉండడం న్యాయమే కదా!

ద్వైత సిద్ధాంతంలో మరొక ముఖ్యమైన విషయం లింగ భేదం మోక్షదశలో కూడా ఉండడం. స్త్రీలు స్త్రీలుగా, పురుషులు పురుషులుగా మోక్షదశలో కూడా ఉంటారు.

మోక్షదశలో తరతమ భేదాన్ని పురస్కరించుకొని రాధాకృష్ణ పండితులు "వ్యవహార ప్రపంచ భేదములను మనము పరమార్థ ప్రపంచమునకు కూడ ననుసంధించుటవలన నిట్టి సిద్ధాంతము లుదయించును" అని విమర్శించారు గాని మధ్వ సిద్ధాంతంమీద అపార పరిశ్రమ చేసిన డా॥ బి.ఎన్.కె. శర్మగారు వేరే విధంగా అభిప్రాయపడ్డారు. ఆయన దృష్టిలో 'ఈ అసమానత్వం మోక్షదశను వ్యవహార ప్రపంచ స్థాయికి దిగజార్చదు. వ్యవహార ప్రపంచంలో

అసమానతలు ఈర్ష్యాసూయలకు దారితీస్తాయి. మోక్షదశలో అలాంటి ఈర్ష్యాసూయలు ఉండవు' అని అభిప్రాయ పడ్డారు. ఈ విషయాన్ని శ్రీ పి. నాగరాజారావుగారు చెప్పారు. (ఇంట్రడక్షన్ టు ఇండియన్ ఫిలాసఫీ పే. 193). ఏ ఇద్దరు జీవులూ ఒకలా ఉండరనడం ద్వైతంలోని ప్రధానాంశం. పంచభేదాలలో ఇది వివరించబడింది గనుక ఇది మోక్షదశలో కూడా దీన్ని వర్తించడంలో తప్పులేదు. దానికి కారణం సాధనలోని తారతమ్యం గనుక న్యాయంకూడా ఉంది.

## 8. లక్ష్మీదేవి

జ్ఞానమార్గాన్ని ప్రతిపాదించిన అద్వైతంలో శ్రీ లక్ష్మి ప్రసక్తేరాదు. భక్తిమార్గాన్ని ప్రతిపాదించిన విశిష్టాద్వైతంలోను, ద్వైతంలోనూ శ్రీ మహాలక్ష్మికి ప్రత్యేక స్థానం ఉంది. విశిష్టాద్వైతంలో ఆ తల్లి స్థానం అద్వితీయం, ఆమె శ్రీ మన్నారాయణుని వక్షస్థలంలోనే స్థిరనివాసం ఏర్పరచుకొని ఉంటుంది. పరమ దయామయి. ఆమె భక్తులను చేరదీసి శ్రీ మన్నారాయణుని కృపకు పాత్రులుగా చేయడంలో ఆమెది ప్రధాన పాత్ర. దీన్ని పురుషకారం అంటారు. ద్వైతంలో ఇలాంటి స్థానం ఆమెకు లేదు.

అయితే లక్ష్మీనారాయణులిద్దరు నిత్యముక్తులే, ప్రకృతి సంబంధంలేని వారే కాని పరమాత్మ సర్వ స్వతంత్రుడు. శ్రీ లక్ష్మీదేవి ఆయన ఆధీనంలోనే ఉంటుంది. ఆయనకంటె జ్ఞానం ఆమెకు కొంచెం తక్కువగా ఉంటుంది. ఆమె పరమాత్మకంటె వేరైనా, ఆయనతో ఆమెకూడా సర్వత్ర సంచరిస్తుంది. ముక్తి పొందిన జీవులు కూడా

ఒకప్పుడు సంసారంలో ఉన్న వాళ్ళే గనుక వారికంటె నిత్యముక్తురాలైన శ్రీ లక్ష్మీదేవి ఎక్కువ, ఆమెకంటె శ్రీ మన్నారాయణుడు ఎక్కువ. ఆమెది ప్రాకృత శరీరంకాదు. శ్రీహరి దివ్యత్వాన్ని ఆమెకు ప్రసాదించడంచేత ఏ రూపాన్నైనా ఆమె ధరించగలదు. ఆమె జీవులను, ప్రకృతిని శాసించగలదు.

## 9. ప్రమాణములు

జ్ఞాన సాధనాలనే ప్రమాణాలంటారు. వీటివల్ల తెలుసుకొనే వాటిని ప్రమేయాలంటారు. శ్రీ మధ్వులు ప్రత్యక్ష, అనుమాన, ఆగమ ప్రమాణాలను అంగీకరించారు. ఇందులో ప్రత్యక్షానికి ఆయన పెద్ద పీట వేశారు. కారణం ప్రత్యక్షంగా కనిపించే విశ్వం ఎట్టి పరిస్థితులలోనూ మిథ్య అనడానికి వీలులేదు గనుక. జీవుడు తన ఆత్మజ్యోతి నుండి వెలువడిన శక్తితో విశ్వాన్ని చూసి సాక్షీభూతుడవుతున్నాడు. గనుక ప్రత్యక్షానికి తిరుగులేదు, మిథ్యకు తావులేదని శ్రీ మధ్వుల సిద్ధాంతం. చిరుచీకటిలో త్రాడుమీద ఆరోపితమైన సర్పభ్రమను ప్రత్యక్షంగా కనిపించే విశ్వానికి అన్వయించడం అసంబద్ధం. అసలు పాము లేనే లేదు సరికదా ఆ భ్రమ కూడా త్రాడుమీద కాంతిపడగానే తొలగిపోతూంది. ఈ మిథ్యాజ్ఞానాన్ని 'అభినవ అన్యధాఖ్యాతి' అంటారు. మిథ్య విషయంలో శ్రీ మధ్వుల అభిప్రాయాన్ని సమీక్షిస్తూ రాధాకృష్ణ పండితులిలా అన్నారు.

"మిథ్యా దృశ్యములోని విషయాంశములు మిథ్యకావు. అవి

అనుభూత సత్యాంశములే. కొన్ని లోపములచే మనము చూచు వస్తువును సమగ్రముగా చూడక, దాని లక్షణములు కొన్నిగల వేరొక వస్తువు జ్ఞాపకమునకు వచ్చి, అదే ఇదియని పొరపడుదుము. ప్రతి మిథ్యాదృశ్యమునందును రెండంశము లుండును. ఒకటి యథార్థమైనది, రెండవది భావించబడినది. జగన్మిథ్యాభావమున కర్థమేమనగా నిజమైనదొకటి యుండగా దాని స్థానమున నింకొకటి చూచుచుంటిమనియే కాని, నిజమైన దేదియు లేదని యర్థము కాదు." (భారతీయ తత్త్వశాస్త్రము Vol. 5 P. 290. తి.తి.దే. ప్రచురణ). ఇలా మిథ్యావాద తిరస్కరణకు ఎక్కువ ప్రాధాన్యం ప్రత్యక్ష ప్రమాణం ఇస్తుంది గనుక శ్రీ మధ్వులు దానికి ప్రథమ స్థానం ఇచ్చారు.

దూరంగా కొండమీద పొగ కనిపిస్తే అక్కడ నిప్పు ఉందని ఊహిస్తున్నాం. మనం ఇంతకు ముందు నిప్పు నుండి పొగరావడం ప్రత్యక్షంగా చూశాం గనుక మన ప్రత్యక్ష అనుభవం మీదే ఆధారపడి ఉండడం వల్ల దీన్ని అనుమాన ప్రమాణం అంటున్నాం. ఈ అనుమానానికి ఆధారం మన పూర్వానుభవమే గనుక ఈ ప్రమాణాన్ని శ్రీ మధ్వులు అంగీకరించారు.

ఇక మన జ్ఞానేంద్రియాలకు గోచరించని విషయాలకు ఆగమ ప్రమాణమే శరణ్యం. అందుచేత శ్రీ మధ్వులు వేద ప్రమాణానికి అత్యంత ప్రాధాన్యం ఇచ్చారు. అయితే వేదంలో నిరాకార నిర్గుణ బ్రహ్మాన్ని సూచించి వ్యావహారిక సత్యాన్ని సమర్థించే పాఠాలను శ్రీ మధ్వులు 'ఉపజీవికలు' అంటే ఇంకొక దాని మీద ఆధారపడినవి అన్నారు. సాకార, సగుణ బ్రహ్మాన్ని సూచించే పాఠాలను

'ఉపజీవ్యములు' అంటే ఆధారభూతములు అన్నారు. ఉపజీవికలు, ఉపజీవ్యాలమీద ఆధారపడి ఉంటాయి గనుక వాటికి సంజ్ఞా మాత్రమైన ప్రాధాన్యమే ఉంటుంది. ప్రత్యక్షంగా అనేకత్వంగా గోచరించే ఈ విశ్వాన్ని ఈ ఉపజీవికలు ఒప్పుకోవు. అయితే ఇది సాంకేతికమే, బహుత్వంలో ఏకత్వం సూచించడానికే అంటారు శ్రీ మధ్వులు. ఎప్పుడైతే ఏకత్వం అంటున్నారో బహుత్వం ఉన్నట్టు ఒప్పుకున్నట్టే కదా అంటారు విమర్శకులు.

## 10. ప్రమేయాలు

శ్రీ మధ్వుల సత్యవిచారం (ontology), పది ప్రమేయాలను ఒప్పుకుంటుంది. అది ద్రవ్యం (substance), గుణం (quality), కర్మ (activity), సామాన్య(class character), విశేష (particularity), విశిష్ట (the qualified), అంశి(the whole), శక్తి (power), సాదృశ్య (similarity), అభావం (negation).

1. ద్రవ్యం అంటే వ్యక్తమయ్యే ఉపాదాన కారణమైన ప్రకృతికి, ఆవిర్భవించే బ్రహ్మమునకు జీవుడు మొదలైనవాటికి ఆధారభూతమైనది. దీన్ని ఆరు విధాలుగా విభజించారు. అవి: విష్ణువు, లక్ష్మి, జీవులు, అవ్యక్తాకాశము, ఉపాదాన కారణమైన జడ ప్రకృతి, త్రిగుణాలు.

2. గుణాలు అనేకం – అవి భౌతికం మానసికం కూడా. పరమాత్మ మాత్రం అనంత కళ్యాణ గుణ సమన్వితుడు. ఆయనలో దోషాలుండవు.

3. కర్మ రెండు విధాలు, పాప కర్మ, పుణ్య కర్మ – వీటి ఫలితాలు వరుసగా దుఃఖం, సుఖం.

4. సామాన్యం అంటే అనేక వస్తువులలో ఉండే సామాన్య ధర్మం.

5. విశేషం – అనేది శ్రీ మధ్వుల ప్రత్యేక సిద్ధాంతం. ఒక బల్ల మరొక బల్లకంటె వేరు, బల్ల నేల కంటే వేరు – ఇలా ద్వైతాన్ని ఆయన సమర్థించడానికి ఆయన ప్రవేశపెట్టిన సిద్ధాంతం.

6. విశిష్టం – ఒక వస్తువు విశేష్యం. దాని గుణం విశేషణం, రెండు కలిస్తే విశిష్టం.

7. అంశి–అనేక భాగాలు కలిగిన వస్తువు అంశి. అనేక దారాలు గల వస్త్రం అంశి. పరమాత్మ అంశి, జీవాత్మ భిన్నాంశి.

8. శక్తి నాలుగు విధాలు. ఊహించ నలవికాని పరమాత్మ శక్తి, అర్చామూర్తిలో మంత్రపూతంగా ప్రవేశపెట్టబడిన శక్తి, కొన్ని అతీంద్రియ శక్తులు (త్రిమతా చార్యులకు ఇలాంటి శక్తులుండేవి) శాపానుగ్రహ శక్తుల వంటివి– వాక్శుద్ధి అనవచ్చు.

9. సాదృశ్యం – రెండు వస్తువుల మధ్య పోలిక.

10. అభావం – లేదనటం – ఇది నాలుగు విధాలన్నారు. ప్రాగ్భావం – ఒక వస్తువు పుట్టకముందు లేకపోవడం, ప్రధ్వంస భావం, ఒక వస్తువు నాశనమైన తరువాత లేకపోవడం, అన్యోన్యాభావం ఒక వస్తువులోని గుణం మరొక వస్తువులో లేకపోవడం, అత్యంతాభావం – అసలే లేకపోవడం.

# 11. ప్రకృతి

మూల ప్రకృతి సూక్ష్మదశలో ఇరువది నాలుగు తత్త్వాలను ఇమిడ్చుకుని ఉంటుంది. ఇవి, మహత్తు, అహంకారము, బుద్ధి, మనస్సు, పంచకర్మేంద్రియాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచేంద్రియ విషయాలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు), పంచభూతాలు (ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి). జీవేశ్వర ప్రవృత్తి వల్ల ఈ అవ్యక్త ప్రకృతి విశ్వంగా వ్యక్తమవుతుంది. ముందు ప్రకృతిలో గల త్రిగుణాలు తరువాత ఇరువది నాలుగు తత్త్వాలుగా వ్యక్తమవుతాయి. అందుచేత విశ్వంలో గల వస్తుజాలం అంతా జడ ప్రకృతి నుండి పుట్టినవే. ఈశ్వరుడు ఈ వస్తుజాలానికి రూప కల్పన చేసి వాటిలో అంతర్యాతంగా ఉంటాడు. అందుచేత ప్రకృతి ఉపాదాన కారణం అని ద్వైతం చెప్తుంది. అలా ప్రకృతి వ్యక్తమైనపుడు బహుత్వంగా, అవ్యక్తంలో ఏకరూపంగా ఉంటుంది.

ప్రకృతి విశ్వానికి ఉపాదాన కారణం గనుక, కార్యకారణ సంబంధాన్ని గురించి ద్వైత సిద్ధాంతం ఏమి చెప్తుందో కొంత తెలుసుకోవలసి ఉంది. మట్టి కుండగా మారుతుంది. అంటే కుండ మట్టిలో ఉంది కాని రూపు దిద్దుకోలేదు. కార్యం కారణంలోనే ఉంది. మట్టి కుండగా మారడాన్ని సత్కార్యవాదం అంటారు. న్యాయవైశేషికులు మాత్రం కార్యం కారణంలో ఉండదంటారు. దీన్ని అసత్కార్యవాదం అంటారు. సాంఖ్యులు కార్యం, కారణంలో సూక్ష్మరూపంలో ఉంటుందంటారు. అందుచేత సత్కార్యవాదాన్ని

అంగీకరించినట్లే. అయితే ఈ రెండు వాదాలను తిరస్కరించి ద్వైతులు 'సత్-అసత్-కార్యవాదాన్ని' ప్రవేశపెట్టారు. ఈ సిద్ధాంతం ప్రకారం కార్యం సత్ (ఉన్నది), అసత్ (లేదు) రెండూ కూడా నిజమే- అయితే ఒకే సమయంలో కాదు. కుండ తయారు కాకముందు మట్టి రూపంలో కారణంగానే ఉంది గాని కార్యంగా లేదు. తయారయిన తర్వాత అది కార్యంగానే ఉంటుంది తప్ప కారణంగా మాత్రం కాదు. అయితే ద్వైతం ఇతర సిద్ధాంతాల వలె నిమిత్త కారణాన్ని అంగీకరించింది.

## 12. ద్రవ్యములు - వాటి గుణములు

ద్వైతం అంటేనే భేదం. ఇంతకు ముందు పంచ భేదాలను వివరించడం జరిగింది. అయితే ద్వైతం ఒక అభేదాన్ని మాత్రం ఒప్పుకుంటుంది. ఒక ద్రవ్యం, ఉదాహరణకి సాంబ్రాణ ఉందనుకోండి దాని వాసన, పొగ సాంబ్రాణి కాదు – అవి సాంబ్రాణ నుండి వేరు అని ఇతర శాస్త్రకర్తలు అంటారు. అయితే ద్వైతులు ద్రవ్యం, దాన్ని ఆశ్రయించిన గుణ కర్మలు ద్రవ్యం కంటె వేరు కావంటారు. ఇవి ద్రవ్యంలోనే అంతర్భూతంగా ఉంటాయి గనుక వాటిని ద్రవ్యం నుండి వేరుగా చూడకూడ దంటారు. ఇదే సిద్ధాంతానన్నుసరించి శ్రీహరి, ఆయన దివ్యమంగళ స్వరూపం, ఆయన అనంత కళ్యాణ గుణాలు, బలైశ్వర్యాలు, అన్నీ ఆయన కంటె వేరు కావంటారు. శాస్త్ర రీత్యా ద్రవ్యం అధారం, దానిగుణ క్రియాదులు సంబంధిత ద్రవ్యాన్ని ఆశ్రయించి ఉంటాయి గనుక ఆధేయాలు. ఇలా ద్రవ్యానికి దాని గుణక్రియాదులకు ఆధారాధేయ సంబంధం

ఉంది గనుక అవి రెండు వేరుగాని ఒకటి కాదని శాస్త్రం. అలాంటప్పుడు ద్రవ్యం దాని గుణక్రియాదులు ఒకటే అనడం శాస్త్ర విరుద్ధం కదా అంటే దానికి సమాధానంగా ద్వైతులు సృష్టించబడిన ప్రతి వస్తువులో విశేషమనే సూక్ష్మ పదార్థం ఉంటుంది. గులాబీ పువ్వు తీసుకుందాం. దానిలోని ఎరుపురంగు, సువాసన విశేషాలు. అవి పువ్వుతోనే పుట్టాయి. అయితే ఈ విశేషాలను చూసి అవి పువ్వుకంటె వేరని అనుకుంటే అది పొరపాటు. పువ్వులేనిదే అవి లేవు, అవిలేకుండా పువ్వు ఉండదు. ఇది సృష్టి విశేషం గనుక ద్రవ్యం దాని గుణ క్రియాదులు విశేష పదార్థాలుగా నిత్య పదార్థం (గులాబీ పువ్వు)లోనే విడదీయ రానివిగా ఉంటాయి అని సిద్ధాంతీకరించారు.

## 13. శ్రీ మధ్వులు - ఒక వాస్తవ వాది

శ్రీ మధ్వుల కాలం నాటికే క్రైస్తవ మిషనరీలు ఉధృతంగా మత ప్రచారం చేస్తూ మత మార్పిడిలు చేస్తున్నారు. దీనికి తోడు తురుష్కుల దండయాత్రలలో వారి దౌర్జన్యం, హింస వర్ణనాతీతం. ఈ పరిస్థితులలో ఒక బలమైన మత విశ్వాసం ప్రజలలో కలిగించి, వారికి కూడా తమకంటె వేరైన, ఆర్తిలో రక్షించే, సగుణ సాకార దైవం ఉన్నాడని, ఆయన మీద భక్తి తమను కాపాడుతుందనే విశ్వాసం కలిగించాలి. ఇలాంటి విశ్వాసం వేద విహితమైనదే గాని వేద బాహ్యం కాదు. నిర్గుణ, నిరాకార బ్రహ్మోపాసన బలమైన సామూహిక మత విశ్వాసాన్ని, అవసరమైన ప్రతిఘటనా భావాలను కలిగించలేదు. బాల గంగాధర తిలక్ సామూహిక వినాయక ఉత్సవాల ద్వారా

హిందూమత ఐక్యతకు దోహదపడ్డారన్నది అక్షర సత్యం. దాన్ని ఇప్పుడు అనేక చోట్ల నిర్వహిస్తున్నారు. మతం ప్రమాదంలో పడినప్పుడు, ధ్యానం పనికి రాదు, పరమాత్మమీద అచంచల భక్తితో శివాజీ మహరాజ్‌లా ముందుకు సాగాలి. భక్తి మాత్రమే ఈ ఆవేశాన్ని ఐక్యతను కలుగజేస్తుంది గాని జ్ఞానం మాత్రం కాదు. జ్ఞానమార్గం ఒక వ్యక్తికి పరిమితమౌతుంది. భక్తిమార్గం సమాజాన్ని ఏకంచేసి సామూహికంగా ఉత్సవాలను నిర్వహించడం ద్వారా సమాజాన్ని మతపరంగా ఐక్యం చేస్తుంది. శ్రీ మధ్వులు సమకాలీన పరిస్థితులలో ఈ ఐక్యత చాల అవసరం అని గుర్తించి ఉండవచ్చు. వేదాన్ని పరమ ప్రమాణంగా గ్రహించినా ఆయన పురాణేతి హాసాల మీద ఎక్కువగా ఆధారపడి, వీటిమధ్య సమన్వయం తీసుకు రావడానికి భారత, భాగవత, భగవద్గీతల మధ్య తాత్పర్య నిర్ణయ గ్రంథాలను రచించారు. యజ్ఞాలలో పశుబలిని నిషేధించారు. ఇలా వేద విహితమైన, బలమైన సిద్ధాంతాన్ని ప్రవచించి హిందూ సమాజాన్ని బలమైన శక్తిగా మార్చడం ఎంతైనా అవసరం అని గుర్తించారు. అయితే ఆయన మానవుని ఆధ్యాత్మిక ప్రగతికి, నైతిక ప్రవర్తనకి కూడా భక్తిమార్గమే ఏకైక మార్గం అని బోధించారు. అందుచేత ఆయన ఒక నవీనమైన, సృజనాత్మకమైన సిద్ధాంతాన్ని సృజించి అనూహ్య విజయం సాధించారు.

భక్తిమార్గం, జ్ఞానమార్గానికేవిధంగాను తీసిపోదని, నిజానికి భక్తిమార్గమే సామాన్య జనులకు అనుసరణీయమైన ఏకైక మార్గమని,

అదే సమాజాన్ని ఇతర మతాల దాడులను సమర్థవంతంగా ఎదుర్కోవడానికి సమాయత్త పరస్తుందని ఆయన దృఢ నిశ్చయం. వీరి కృషి ఫలితం పురందరదాసు వంటి వారు సృష్టించిన దాససాహిత్యం, వల్లభాచార్యుల వారి కృష్ణభక్తి, చైతన్య మహాప్రభు వంటి మహాభక్తుల కృష్ణతత్వ ప్రచారం – ఇదంతా భక్తిని హిందూమత సమైక్యతను సాధించాయి. ఇది సామాన్యమైన విజయం కాదు.

## 14. మధ్వ సిద్ధాంత సారస్వతం

మధ్వ సిద్ధాంతం మీద అపారమైన సారస్వతం ఉంది. శ్రీ పూర్ణప్రజ్ఞులే 37 గ్రంథాలను రచించారు. –వీటిని సర్వమూల గ్రంథాలంటారు. వాటిని మూడుగా వర్గీకరించారు– (1) వ్యాఖ్యానాలు, (2) స్వతంత్ర రచనలు, (3) కీర్తనలు. ఆయన భగవద్గీత మీద, ఉపనిషత్తుల మీద వ్యాఖ్యానాలు రచించారు. బ్రహ్మసూత్రాల మీద నాలుగు వ్యాఖ్యానాలు రచించారు. మొదటిది సూత్రభాష్యం, రెండవది అనువ్యాఖ్యానం. ఇది 1,900 శ్లోకాల గ్రంథం. దీనిలో ఆయన ఇతర సిద్ధాంతాలను ఖండించారు. అనుభాష్యం మూడవది – ఇది నిత్యం పారాయణ కనువుగా ఉండేలా సంక్షిప్తం చేసిన సూత్రభాష్యం. భగవద్గీత మీద, భారత, భాగవతాల మీద వ్రాసిన తాత్పర్య నిర్ణయ గ్రంథాలు ప్రసిద్ధాలు, ఋగ్భాష్యం, విష్ణుతత్త్వ నిర్ణయం, మాయావాద ఖండనం ఇతర గ్రంథాలు.

తరువాత జయతీర్థుల శ్రీ మధ్వులు బ్రహ్మసూత్రాల మీద వ్రాసిన అనువ్యాఖ్యానం మీద 'న్యాయసుధ' అనే గ్రంథం, బ్రహ్మసూత్ర

భాష్యం మీద తత్త్వ ప్రకాశిక, గీతాతాత్పర్య నిర్ణయం మీద న్యాయదీపిక, గీతాభాష్యం మీద ప్రమేయ దీపిక అనే వివరణ గ్రంథాలను రచించారు.

తరువాత వ్యాసరాయుల వారు న్యాయామృతం, తర్కతాండవం అనే గ్రంథాలు వ్రాశారు. శ్రీ రాఘవేంద్ర స్వామి న్యాయ సుధాపరిమళం అనే గ్రంథం వ్రాశారు.

మధ్వ సిద్ధాంతం మీద అపార సారస్వతం ఉంది. ఇక్కడ కొన్ని గ్రంథాలను మాత్రమే ప్రస్తావించడం జరిగింది.

## 15. ఇతర మధ్వ సిద్ధాంత కర్తలు

శ్రీ మధ్వుల అనంతరం అనేకమంది పీఠాధిపతులుగా, పండిత–రచయితలుగా ప్రసిద్ధి పొందారు. వారిలో ముఖ్యమైన వారి గురించి క్లుప్తంగా వివరించాలి. కారణం వారి కృషి ఫలితంగానే ఇప్పటికి మధ్వ సిద్ధాంతం బహుళ ప్రచారంలో ఉంది.

### 1) శ్రీ జయతీర్థులు

శ్రీ మధ్వులు తరువాత అంతటి ప్రాముఖ్యం గలవారు శ్రీ జయతీర్థులు. వీరు క్రీ.శ. 1340వ సంవత్సరంలో పండరిపురానికి చేరువలో గల 'కాగని' నది ఒడ్డున గల 'మంగళవేఢ' గ్రామంలో ఒక సంపన్న కుటుంబంలో జన్మించారు. తండ్రి రఘునాథరాయ దేశ్‌పాండె. చిన్నతనంలో గుఱ్ఱపుస్వారి చేస్తూ విలాసవంతమైన జీవితం గడిపారు. ఆయనకు సుమారు ఇరవై సంవత్సరముల

వయస్సులో శ్రీ మధ్వుల పరివ్రాజక శిష్యులలో ఒకరైన అక్షోభ్యతీర్థుల సాంగత్యం లభించింది. దీనితో ఆయన జీవిత దృక్పథం పూర్తిగా మారింది. అక్షోభ్యతీర్థుల ఆశ్రమంలోనే ఉంటూ సన్న్యసించి, ఆయన అంతరంగ శిష్యుడయ్యాడు. ఆయన వద్ద విద్యనభ్యసించి గురువును మించిన శిష్యుడయ్యాడు. అక్షోభ్యతీర్థుల అనంతరం ఆయన పీఠాన్ని జయతీర్థులే అలంకరించారు.

శ్రీ మధ్వులు బ్రహ్మసూత్రాల మీద రచించిన అనువ్యాఖ్యానికి అందరికి బోధపడేలా 'న్యాయసుధ' అనే వ్యాఖ్యానాన్ని, బ్రహ్మసూత్ర భాష్యానికి 'తత్త్వప్రకాశిక' అనే వ్యాఖ్యాన్ని అలాగే శ్రీ మధ్వుల 'గీతా తాత్పర్య నిర్ణయాని'కి 'న్యాయదీపిక', 'గీతాభాష్యా' నికి 'ప్రమేయదీపిక' అనే వ్యాఖ్యానాలను వ్రాశారు. వీటిలో న్యాయసుధకు అపారఖ్యాతి వచ్చింది. శ్రీ జయతీర్దులను 'టీకాచార్య' అనికూడా అంటారు. అది ఆయనకు బిరుదు కావచ్చు. 'ప్రమాణ పద్ధతి', 'వేదావళి', 'పద్యమాల' అనేవి ఆయన స్వతంత్ర రచనలు.

మధ్వ సిద్ధాంతంలోని ప్రధాన సూత్రాలను సుబోధకంగా, సరళమైన భాషలో (సంస్కృతం) వివరించడంలో ఆయనకాయనే సాటి అనే ఖ్యాతి సంపాదించుకున్నారు.

ఆయన శ్రీ విద్యారణ్య స్వామికి సమకాలికులు. క్రీ.శ. 1388లో ఆయన ప్రాకృత శరీరాన్ని విడిచారు.

గుల్బార్గా జిల్లాలోని 'మల్‌ఖేడ్'లో ఆయన బృందావనం ఉంది. అది మధ్వుల పుణ్యక్షేత్రంగా ప్రసిద్ధి పొందింది.

## శ్రీ వేదభారతి

వేదశబ్ద పరిరక్షణకు, వేదవిజ్ఞాన ప్రచారానికి ఏర్పడిన ధార్మిక సంస్థ శ్రీవేదభారతి.

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం అని పిలవబడే నాలుగు వేదాలకు సుమారు 1131 శాఖలు ఉండేవని మన ప్రాచీన గ్రంథాల ద్వారా తెలుస్తోంది. కాని నేడు 13 వేదశాఖలు మాత్రమే లభిస్తున్నాయి. ఈ 13 శాఖలలోను, 7 శాఖలకు మాత్రమే గురుశిష్యపరంపర కొనసాగుతోంది. మిగిలిన 6 శాఖలు పాక్షికంగా మాత్రమే లభిస్తున్నాయి. ఈ విధంగా మన ప్రాచీన భారతీయ విజ్ఞానంలో 99% పైగా పోగొట్టుకున్నాము.

వేద విజ్ఞానాన్ని అత్యవసరంగా పరిరక్షించుకోవడానికి శ్రీ వేదభారతి ఆధునిక కంప్యూటర్ టెక్నాలజీని ఎన్నుకొంది. అందులో - రికార్డింగ్ ద్వారా వేద మంత్ర ఉచ్చారణను జాగ్రత్త చేయడానికి కృషిచేస్తోంది. మిగిలి ఉన్న వేదశబ్దాన్ని రికార్డింగ్ చేస్తే సుమారు 3,000 గంటలు కావచ్చునని అంచనా వేయగా, ఇప్పటికి సుమారు 900 గంటలు పూర్తి అయింది. 200 పైగా ఆడియో/మల్టీమీడియా సిడిలరూపంలో అందుబాటులోనికి తీసుకొనివచ్చింది.

వేదాలపై శాస్త్రీయ పరిశోధన & ప్రచురణ :

వేదాలలో ఆధునిక శాస్త్రీయ సాంకేతిక విషయాలను వెలుగులోనికి తీసుకువచ్చే ప్రయత్నంలో "వేదంలో కంప్యూటర్ విజ్ఞానం", "వేదశాస్త్రాలలో ఆధునిక శాస్త్రీయ రహస్యాలు", "భూ కంపాలను ముందుగా పసిగట్ట గల్గుట సాధ్యమా?" మొదలైన అత్యున్నత శ్రేణి పరిశోధనా గ్రంథాలతో బాటు, "వేదగణితం" వంటి సిడి/డివిడిలను కూడా శ్రీవేదభారతి వెలువరించడం జరిగింది.

వైదిక గణితం బోధన :

టి.టి.డి. మరియు భక్తి టీ.వి. ఛానల్స్ ద్వారా లక్షలాదిమంది విద్యార్థులకు వేదగణితం, వేదవిజ్ఞానం వంటి విషయాలు పరిచయం చేయబడుతున్నాయి. విద్యార్థులకు అందుబాటులో ఉండేట్లుగా వైదిక గణితం ప్రచురించడం జరిగింది. ఈ కృషిని గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం **"బంగారు నంది"** బహుమతిని అందించింది.

అభ్యర్థన :

శ్రీ వేదభారతి చేస్తున్న కృషికి అందరూ చేయూతనందించవలసిందిగా ప్రార్థన!!!

# భగవద్గీత
# సంక్షిప్త పరిచయం
## (యువత వ్యక్తిత్వ వికాసానికి)


**ఎల్.వి. గంగాధర శాస్త్రి**

వ్యవస్థాపకులు, భగవద్గీతా ఫౌండేషన్, హైదరాబాద్

"సంస్కృత మిత్ర"

**డా॥ రేమెళ్ళ అవధానులు**

M.Sc.(Nuclear Physics), M.A., Ph.D.(Sanskrit), M.A., Ph.D.(Jyotisha)

Dy. Director(Computers), (Retd)., NIMS, Hyderabad.



**శ్రీ వేదభారతి**

**హైదరాబాద్**

**2013**

# భగవద్గీత సంక్షిప్త పరిచయం
## (యువత వ్యక్తిత్వ వికాసానికి)

**ఎల్.వి. గంగాధర శాస్త్రి**

**డా॥ రేమెళ్ళ అవధానులు**

ప్రథమ ముద్రణ : డిసెంబర్, 2013



వెల : **రూ. 25/-**

ప్రతులకు :

**1. శ్రీ వేద భారతి**
"H" Block-34, Madhuranagar, Hyderabad - 500
Ph. : 040-23812577, Cell : 098494 59316
e-mail : shrivedabharathi@gmail.com
www.shrivedabharathi.in
www.shrivedabharathi.org

**2. భగవద్గీతా ఫౌండేషన్**
# 3-1-74/3/A, Rama Sankar Nagar,
Ramanthapur, Hyderabad-500 013.
Ph: 040-27036545, Cell: 9848911223.
e-mail : singadhar@yahoo.co.in
www.bhagavadgitafoundation.org

ముద్రణ : సంహిత గ్రాఫిక్స్
అమీర్‌పేట్, హైదరాబాద్ – 500 016.
ఫోన్: 040–23731620, 23741620

# కృతజ్ఞతలు

శ్రీ వేదభారతి చేపట్టిన వేదశబ్ద పరిరక్షణ

కార్యక్రమానికి అపూర్వముగా స్పందించి,

ఆర్థిక సహాయాన్ని, వాక్సహాయాన్ని అందిస్తున్న

"మహాసహస్రావధాని"

**డా॥ గరికిపాటి నరసింహారావు** గారికి

వారి సతీమణి **శ్రీమతి శారద** గారికి

సాదరముగా కృతజ్ఞతలు తెలియజేస్తూ,

వారికి, వారి చిరంజీవులు **శ్రీశ్రీ, గురజాడ**లకు,

వారి కుటుంబ సభ్యులకు, పరమేశ్వరుడు పరిపూర్ణ అనుగ్రహమును

ప్రసాదించుగాక! అని ప్రార్థిస్తున్నాము.

**ఎల్.వి. గంగాధర శాస్త్రి**

**డా॥ రేమెళ్ళ అవధానులు**

శ్రీ వేదభారతి

భగవద్గీతా ఫౌండేషన్

"విజయ గీతా జయంతి"

13. 12. 2013

# భగవద్గీత సంక్షిప్త పరిచయం

## విషయసూచిక

ముందుమాట

**1వ భాగం** **1**

భగవద్గీత గురించి

**2వ భాగం** **9**

వ్యక్తిత్వ వికాసానికి ఉపదేశాలు

**3వ భాగం** **39**

సందేహాలు – సమాధానాలు

# ముందుమాట

ప్రపంచంలోని అత్యధిక ప్రాంతం అజ్ఞానాంధకారంలో మునిగిపోయి ఉన్న సమయంలో భారతదేశం ఆధ్యాత్మిక విద్యా కేంద్రంగా విరాజిల్లింది. "అధ్యాత్మము" అంటే "తనను గురించిన విశ్లేషణ" అని స్థూలంగా అర్ధము. "అధ్యాత్మవిద్య" అంటే "తనను గురించి చెప్పే విద్య", లేక, వ్యక్తి యొక్క నిజ స్వభావాన్ని తెలియజేసే విద్య అని అర్ధం. ఇంకా సరళంగా చెప్పాలంటే – మనము ఎవరము? మన నిజ స్వరూపం ఏమిటి? ఎక్కడి నుండి వచ్చాము? ఎక్కడికి వెళ్ళుతున్నాము? ఎక్కడికి వెళ్ళాలి? అందుకు ఏమి చెయ్యాలి? ఈ ఆధ్యాత్మిక విషయాలను సూటిగా చెప్పే ఉపనిషత్తుల సంక్షిప్త స్వరూపమే భగవద్గీత!

అర్జునుని విషాదం వలన కృష్ణ పరమాత్మ గీతను బోధించవలసి వచ్చింది. యుద్ధంలో తన వాళ్ళందరూ మరణిస్తారన్నది అర్జునుని విషాదానికి మొదటి కారణం. ఇది మమకారానికి చిహ్నం. తానే వారందరినీ చంపవలసి వస్తుందని భావించడం విషాదానికి రెండవ కారణం. ఇది అహంకారానికి చిహ్నం. వీటి పర్యవసానంగా "యుద్ధం చెయ్యడం" అనే తనకు విధించబడిన ధర్మాన్ని చేయనని అన్నాడు. అంతే కాదు తనకు విధించబడని "భిక్షాచర్య" రూపమైన అధర్మాన్ని చేస్తానని అన్నాడు. ఈ పరిస్థితులలో అర్జునునికి ధర్మాధర్మాలను వివరించి, అతని కర్తవ్యాన్ని తెలియజేసి, అతని స్వాభావికమైన ధార్మిక ప్రవృత్తిని పునరుద్ధరించడానికి శ్రీకృష్ణుడు

చేసిన ప్రయత్నమే భగవద్గీత. పైగా, జరుగుతున్న యుద్ధం వ్యక్తుల మధ్య కాదని, ధర్మానికి అధర్మానికి మధ్య అని, చనిపోయేది శరీరమే గాని ఆత్మ కాదని, శాశ్వతమైన ఆధ్యాత్మిక తత్త్వాన్ని గీతా రూపంలో బోధించాడు.

ఒక కాలానికి, ఒక ప్రాంతానికి చెందిన, పరిమితమైన మనుష్యులయొక్క అభివృద్ధిని కోరుకుంటూ తగిన మార్గాలను బోధించేవాడు గురువు అవుతాడు. సర్వ దేశాలకు, సర్వ కాలాలకు, సర్వ జాతులకు వర్తించే విధంగా జగత్తులోని ప్రతి మానవుణ్ణి ఉద్దేశించి ఇహపర లోకాలలోని అభివృద్ధికి మార్గాలను మహోదాత్తమైన పద్ధతిలో, విశ్వజనీనమైన రూపంలో ఉపదేశిస్తే జగద్గురువు అవుతాడు. ఈ విధమైన ఉపదేశాన్ని అందించడం ద్వారా శ్రీకృష్ణుడు జగద్గురువు అయ్యాడు.

ఏది చదుకున్న తర్వాత, ఇంకా చదువుకోవడానికి మిగిలి ఉంటుందో అది విజ్ఞానం. ఏది తెలుసుకున్న తర్వాత, మరొకటి తెలుసుకునేందుకు మిగిలి ఉండదో అది జ్ఞానము. అదే ఆధ్యాత్మిక జ్ఞానం. భగవంతుడు మన కోరికలను బట్టి ఫలాలను ఇవ్వడు. మన అర్హతను బట్టి ఇస్తాడు. శరణాగతి చేసిన వానిని అనుగ్రహిస్తాడు. అందుకే అర్జునునికి జ్ఞానాన్ని గీతోపదేశ రూపంలో ప్రసాదించాడు.

**అసలు భగవద్గీత ఏమి చెబుతోంది?**

ధర్మాధర్మాలను గురించి చెబుతుంది.

కర్తవ్యం గురించి చెబుతుంది.

కోరికలను అదుపులో పెట్టుకోమని చెబుతుంది.

ఆనందంగా జీవించడం ఎలాగో చెబుతుంది.

ఏది శాశ్వతమో, ఏది అశాశ్వతమో  చెబుతుంది.

పరమాత్మకు ఎవడు ఇష్టుడో చెబుతుంది.

ఆయనను చేరే మార్గాన్ని చూపిస్తుంది.

మనిషిని దైవంగా చూస్తుంది, చేస్తుంది.

కర్మణ్యేవాధికారస్తే.... అంటూ ఫలితంపైన దృష్టి పెట్టకుండా త్రికరణ శుద్ధిగా కర్మను ఆచరించమని చెబుతుంది.

ఉత్తమ లక్ష్య సాధన కోసం ఏ క్షణంలోనైనా, ఎలాంటి త్యాగమైనా చేయడానికి సంసిద్ధంగా ఉండాలని, అనన్యమైన భక్తితో ఫలితాన్ని పరమాత్మకు అర్పించి, భవబంధాలను వదలి, పనిచేయడం మనిషి కర్తవ్యమని బోధిస్తుంది.

న హి జ్ఞానేన సదృశం..... అని అంటూ జ్ఞానంతో సమానమైనది, పవిత్రమైనది ఈ ప్రపంచంలో మరొకటి ఏదీ లేదని, కాబట్టి జ్ఞానివి కమ్ము అని మనందరిని ఆశీర్వదిస్తుంది.

**ఇదీ గీతా సారాంశం!**

భగవద్గీతను గురించి కుతర్కాలు చేసే కొందరు, యుద్ధం ప్రారంభం కాబోయే సందర్భంలో 700 శ్లోకాలతో ఉన్న భగవద్గీతను శ్రీకృష్ణుడు బోధించడం సాధ్యం కాదని, కొన్ని మాత్రమే శ్రీకృష్ణుడు

బోధించి ఉంటాడని, ఎక్కువభాగం వ్యాసమహర్షి వ్రాసి ఇరికించి ఉంటాడని వితండవాదం చేస్తున్నారు. కాని ఈనాడు భగవద్గీతను సుమారు ఒక గంట సమయంలో మనవంటి సామాన్యులు కూడా పారాయణ చేయడం సాధ్యం అవుతున్నపుడు, సంస్కృతం మాతృభాషగా ఉన్న ఆ రోజులలో పరమాత్మ రూపంలో ఉన్న శ్రీకృష్ణుడు, సూక్ష్మగ్రాహి అయిన అర్జునునకు, అతి తక్కువ సమయంలో సంపూర్ణంగా భగవద్గీతను బోధించడం అసాధ్యం కాదు. పైన పేర్కొన్న వితండవాదం అసత్యమైన కారణంగా, దీనిని తీవ్రంగా ఖండించడం జరిగింది.

భగవద్గీతను గురించిన కొన్ని విషయాలను మూడు భాగాలుగా ఈ పుస్తకం ద్వారా అందించడం జరిగింది.

అందులో మొదటి భాగంలో, భగవద్గీతను గురించి, శ్రీకృష్ణుని గురించిన విషయాలు సంక్షిప్తంగా ఉన్నాయి.

రెండవ భాగంలో, యువతకు, విద్యార్థులకు వ్యక్తిత్వ వికాసానికి ఉపయోగపడే ఉపదేశాలను సంకలనం చేయడం జరిగింది. ఈ ఉపదేశాలతోబాటు, సాధికారికంగా వాటిని బోధించడానికి వీలుగా, సంబంధిత శ్లోకాలను, వాటి తాత్పర్యాలను ఇవ్వడం జరిగింది.

మూడవ భాగంలో, అనేక విశిష్టమైన అంశాలకు సంబంధించిన సందేహాలకు భగవద్గీతలోని సమాధానాలను పొందిక చేయడం జరిగింది.

నేటి యువతకు, విద్యార్థులకు వ్యక్తిత్వ వికాస కార్యక్రమాల పేరిట ఏవేవో నేర్పుతున్నారు. కాని, నిజానికి, కొన్ని వేల సంవత్సరాల నుండి మహాత్మాగాంధీ వంటి అసంఖ్యాకులైన మహానుభావుల వ్యక్తిత్వాలను తీర్చిదిద్దిన భగవద్గీతను సందేశాత్మకంగా బోధించాలి.

భగవద్గీత వంటి కర్తవ్య బోధనా గ్రంథం లేకపోతే ప్రపంచ వాఙ్మయం పరిపూర్ణమైనట్లు కాదు అని అంటాడు ప్రపంచ ప్రముఖ తత్త్వవేత్త ఎడ్విన్ ఆర్నాల్డ్.

విదేశాలలో దీనిని ఇప్పటికే విద్యార్థులందరికీ పాఠ్యాంశంగా చేస్తున్నారు. అధికారులకు దీని ఆధారంగా ప్రత్యేక శిక్షణా తరగతులను నిర్వహిస్తున్నారు. మనదేశంలో కూడా భగవద్గీతను అతి విస్తృతంగా ప్రచారం చేయవలసి ఉంది. శిక్షణను ఇయ్యవలసి ఉంది. శ్రద్ధతో గీతను అధ్యయనం చేసి, ఆ మార్గంలో ప్రయాణిస్తే, మన దేశాన్ని, వ్యక్తులను పట్టి పీడిస్తున్న పెను సమస్యలు వెంటనే మటుమాయమవుతాయి.

**దానికి కారణం –**

భగవద్గీత ఒక ఉత్తమ జీవన విధానం!

ఉన్నత వ్యక్తిత్వ వికాస గ్రంథం!

మానవులకు ఆశాదీపం!

సాధకులకు కల్పవృక్షం!

విద్యార్థినీ విద్యార్థులు, యువతీ యువకులు, సమాజంలోని మిగిలిన అన్ని వర్గాలవారు కూడా వారివారి అభ్యున్నతికి, గీతను గురించి కొంచెమైనా తెలుసుకోవాలి. కొన్ని అంశాలనైనా ఆచరించాలి.

ప్రశ్నలు సమాధానాల రూపంలో సిద్ధం చేయబడిన ఈ భగవద్గీతా సంక్షిప్త పరిచయం ఏ కొద్దిమందికైనా ఆ దిశలో సహాయపడితే, మా కృషి ధన్యతను పొందిందని సంతోషిస్తాము.

– ప్రకాశకులు

# 1వ భాగం
# పరిచయం

**1. ప్ర. భగవద్గీత అని దేనిని అంటారు?**

**స.** మహాభారతంలోని భీష్మపర్వంలోని 25వ అధ్యాయం నుండి 42వ అధ్యాయం వరకు ఉన్న భాగాన్ని భగవద్గీత అంటారు.

**2. ప్ర. భగవద్గీతను శ్రీకృష్ణపరమాత్మ బోధించి ఎన్ని సంవత్సరాలు అయ్యింది?**

**స.** భారత దేశానికి స్వాతంత్ర్యం (1947) వచ్చేనాటికి గీత బోధించి సుమారు 5048 సంవత్సరాలు అయ్యింది.

**3. ప్ర. గీతోపదేశం జరిగిన కురుక్షేత్రం ఏ రాష్ట్రంలో ఉంది?**

**స.** గీతోపదేశం జరిగిన కురుక్షేత్రం హర్యానా రాష్ట్రంలో ఉంది.

**4. ప్ర. భగవద్గీతలో పాత్రధారులు ఎవరు?**

**స.** భగవద్గీతలో పాత్రధారులు – శ్రీకృష్ణపరమాత్మ, అర్జునుడు, ధృతరాష్ట్రుడు, సంజయుడు.

**5. ప్ర. గీతను ఎవరు, ఎవరికి ఉపదేశించారు? ఎందుకు చెప్పారు?**

**స.** భగవద్గీతను శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి ఉపదేశించాడు. మహాభారత యుద్ధానికి సిద్ధమై వచ్చిన అర్జునునికి

ఎదుటిపక్షంలో తండ్రులు, తాతలు, గురువులు, మేనమామలు, సోదరులు, స్నేహితులు, ఇతర బంధువులు కనిపించిన వెంటనే మనస్సు వికలమయ్యింది. ఆ సమయంలో తనకు కర్తవ్య బోధనను చేయవలసినదిగా అర్జునుడు ప్రార్థించినపుడు, మార్గనిర్దేశనం చేస్తూ శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతను ఉపదేశించాడు.

**6. ప్ర. గీతోపదేశాన్ని ప్రత్యక్షంగా వినిన వారెవరు?**

**స.** గీతోపదేశాన్ని ప్రత్యక్షంగా వినిన వారు – అర్జునుడు, అర్జునుని రథపతాకంపై ఉన్న హనుమంతుడు, వ్యాసమహర్షి, సంజయుడు.

**7. ప్ర. శ్రీకృష్ణుని జన్మస్థలం, పెరిగిన స్థలం ఏమిటి? స్థిర నివాసం చేసుకొన్న స్థలం ఏమిటి?**

**స.** శ్రీకృష్ణుని జన్మస్థలం – మధుర

పెరిగిన స్థలం – వ్రేపల్లె, బృందావనం.

స్థిరనివాసం చేసుకొన్న స్థలం – ద్వారక.

**8. ప్ర. శ్రీకృష్ణుని అవతార జీవితకాలం ఎంత?**

**స.** శ్రీకృష్ణుని అవతార జీవితకాలం – 125 సంవత్సరాల 7 నెలల 8 రోజుల 30 ఘడియలు.

**9. ప్ర. గీతను బోధించే సమయానికి శ్రీకృష్ణుని వయస్సు ఎంత?**

**స.** గీతను బోధించే సమయానికి శ్రీకృష్ణుని వయస్సు – సుమారు 87 సంవత్సరాలు.

**10.** ప్ర. **గీతలో శ్రీకృష్ణపరమాత్మను ఏయే పేర్లతో సంబోధించడం జరిగింది?**

**స.** మధుసూదన, గోవింద, హృషీకేశ, మాధవ, అరిసూదన, మహాత్మా, కృష్ణా, జనార్దన, మహాబాహో, కేశినిషూదన మొ॥లగు పేర్లతో సంబోధించడం జరిగింది.

**11.** ప్ర. **శ్రీకృష్ణుని సైన్యం పేరు ఏమిటి?**

**స.** శ్రీకృష్ణుని సైన్యం పేరు నారాయణి సైన్యం.

**12.** ప్ర. **గీతాజయంతి అంటే ఏమిటి?**

**స.** శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి గీతను బోధించిన రోజును గీతాజయంతి అంటారు.

**13.** ప్ర. **గీతాజయంతిని ఎప్పుడు చేస్తున్నారు?**

**స.** గీతాజయంతిని మార్గశిర శుద్ధ ఏకాదశినాడు చేస్తున్నారు.

**14.** ప్ర. **గీత దేని సారం?**

**స.** ఉపనిషత్తుల సారమే భగవద్గీత.

**15.** ప్ర. **భగవద్గీతలో ఎన్ని శ్లోకాలు, ఎన్ని అధ్యాయాలు ఉన్నాయి?**

**స.** భగవద్గీతలో 700 శ్లోకాలు 18 అధ్యాయాలలో ఇమిడి ఉన్నాయి.

**15.** ప్ర. **గీతలోని 18 అధ్యాయాల పేర్లు ఏమిటి?**

| **స.** | 1. అర్జున విషాద యోగము | – 47 శ్లోకములు |
|---|---|---|
| | 2. సాంఖ్య యోగము | – 72 శ్లోకములు |
| | 3. కర్మ యోగము | – 43 శ్లోకములు |
| | 4. జ్ఞాన యోగము | – 42 శ్లోకములు |
| | 5. కర్మ సన్న్యాస యోగము | – 29 శ్లోకములు |
| | 6. ఆత్మ సంయమ యోగము | – 47 శ్లోకములు |
| | 7. విజ్ఞాన యోగము | – 30 శ్లోకములు |
| | 8. అక్షర పరబ్రహ్మ యోగము | – 28 శ్లోకములు |
| | 9. రాజవిద్యా రాజగుహ్య యోగము | – 34 శ్లోకములు |
| | 10. విభూతి యోగము | – 42 శ్లోకములు |
| | 11. విశ్వరూప సందర్శన యోగము | – 55 శ్లోకములు |
| | 12. భక్తి యోగము | – 20 శ్లోకములు |
| | 13. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము | – 34 శ్లోకములు |
| | 14. గుణత్రయ విభాగ యోగము | – 27 శ్లోకములు |
| | 15. పురుషోత్తమ ప్రాప్తి యోగము | – 20 శ్లోకములు |
| | 16. దైవాసుర సంపద్విభాగ యోగము | – 24 శ్లోకములు |
| | 17. శ్రద్ధాత్రయ విభాగ యోగము | – 28 శ్లోకములు |
| | 18. మోక్ష సన్న్యాస యోగము | – 78 శ్లోకములు |

**17.ప్ర. భగవద్గీతను ఎన్ని షట్కాలుగా (ఆరేసి చొప్పున) విభజించారు? అవి ఏమిటి?**

**స.** భగవద్గీతలోని 18 అధ్యాయాలను ఆరేసి అధ్యాయాల చొప్పున మూడు షట్కాలుగా విభజించారు. అవి 1. కర్మ షట్కము, 2. భక్తి షట్కము, 3. జ్ఞాన షట్కము.

**18.ప్ర. భగవద్గీతకు గల 18 పేర్లు ఏమిటి?**

**స.** భగవద్గీతకు గల 18 పేర్లు –

| | | |
|---|---|---|
| 1. గీత | 2. గంగ | 3. గాయత్రి |
| 4. సీత | 5. సత్య | 6. సరస్వతి |
| 7. బ్రహ్మావిద్య | 8. బ్రహ్మావల్లి | 9. త్రిసంధ్య |
| 10. ముక్తిగేహిని | 11. అర్ధమాత్ర | 12. చిదానంద |
| 13. భవఘ్ని | 14. భ్రాంతినాశిని | 15. వేదత్రయి |
| 16. పర | 17. అనంత | |

18. తత్త్వార్థజ్ఞానమంజరి.

**19.ప్ర. ఒక అక్షౌహిణి సైన్యంలో ఏమి ఉంటాయి?**

**స.** ఒక అక్షౌహిణి సైన్యంలో.....

| | |
|---|---|
| ఏనుగులు | 21,870 |
| రథములు | 21,870 |
| గుఱ్ఱములు | 65,610 |
| కాల్బంట్లు | 1,09,350 |

**20. ప్ర. 18 అక్షౌహిణులలోని సైన్యం ఎంత?**

**స.** ఏనుగులు 3,93,660

రథములు 3,93,660

గుఱ్ఱములు 11,80,980

కాల్బంట్లు 19,68,300

వీరుగాక ఏనుగులకు, గుఱ్ఱాలకు దాణా ఏర్పాటు చేసేవారు, యుద్ధంలో పాల్గొంటున్న సైనికులకు ఆహార పానీయాలను ఏర్పాటు చేసేవారు, విరిగిన ఆయుధాలను బాగుచేసేవారు, ఇంకా అనేక రకాల సేవలను అందించేవారు – వీరందరూ కలిపి సుమారు ఒక కోటి మంది పైన ఉండి ఉంటారు. ఈ విషయాన్నే మహాభారత యుద్ధం అయిన తర్వాత ధర్మరాజు ధృతరాష్ట్రునితో చెబుతాడు.

**21. ప్ర. మహాభారత యుద్ధం ఎన్నిరోజులు జరిగింది?**

**స.** మహాభారత యుద్ధం 18 రోజులు జరిగింది.

**22. ప్ర. భగవద్గీత బాహ్య ప్రపంచానికి ఎప్పుడు తెలిసింది?**

**స.** మహాభారత యుద్ధం ప్రారంభమయిన తర్వాత 10వ రోజున భీష్ముడు అంపశయ్యపై కూలబడిన తరువాత, ఆ వార్తను తెలియజేయడానికి సంజయుడు ధృతరాష్ట్రుని వద్దకు జేరతాడు. ఆ సందర్భంలో యుద్ధం మొదటినుండి జరిగిన విశేషాలను అన్నింటిని తెలియజేయమని అడిగిన ధృతరాష్ట్రునికి సంజయుడు, యుద్ధ విశేషాలకు ముందుగా

భగవద్గీతను తెలియజేస్తాడు. ఆ విధంగా భగవద్గీత బాహ్య ప్రపంచానికి తెలియడం ప్రారంభమయ్యింది.

**23. ప్ర. గీతోపదేశం ఏ అధ్యాయంలో ప్రారభమవుతుంది? ఎక్కడ ముగుస్తుంది?**

**స.** గీతోపదేశం 2వ అధ్యాయంలో 11వ శ్లోకం (అశోచ్యా నన్వశోచస్త్వం..... )తో ప్రారంభమవుతుంది. 18వ అధ్యాయంలో 72వ శ్లోకం (కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ.. )తో ముగుస్తుంది.

**24. ప్ర. గీతాసారం లేక సంక్షిప్త గీత అని ఏ అధ్యాయాన్ని అంటారు?**

**స.** గీతాసారం లేక సంక్షిప్త గీత అని 18వ అధ్యాయమైన "మోక్ష సన్న్యాస యోగము' ను అంటారు.

**25. ప్ర. గీతలో పలుమార్లు ప్రస్తావించబడిన "బ్రహ్మము" అనే పదానికి అర్థం ఏమిటి?**

**స.** బ్రహ్మము అనగా పరమాత్మ అని అర్థము. బ్రహ్మ, బ్రహ్మము, పరబ్రహ్మ, ఆత్మ, పరమాత్మ – ఇవన్నీ పర్యాయపదాలు. సంస్కృతభాషలో "బ్రహ్మ" అని వ్రాస్తారు, పలుకుతారు.

సంస్కృతంలో ఈ పదాన్ని పోలిన పదం ఇంకొకటి ఉంది. అది "బ్రహ్మో" అనే పదము. ఈ పదానికి త్రిమూర్తులలో ఒకరైన, సరస్వతీదేవికి భర్తయైన, చతుర్ముఖ

బ్రహ్మ అని అర్థము. ఈ రెండు పదాలకు భేదాన్ని గుర్తుంచుకోవాలి.

**26. ప్ర. దివ్యదృష్టి అంటే ఏమిటి? దివ్యదృష్టిని సంజయునికి ఎవరు ప్రసాదించారు? దాని ప్రభావం ఏమిటి?**

**స.** సర్వకాలాలకు, సర్వదేశాలకు, సర్వ విషయాలకు, సర్వజనులకు సంబంధించిన జ్ఞానాన్ని గ్రహించే శక్తిని దివ్య దృష్టి అంటారు.

దివ్యదృష్టిని సంజయునికి వ్యాసమహర్షి ప్రసాదించారు. దివ్యదృష్టి సహాయంతో సంజయుడు యుద్ధరంగంలోని సన్నివేశాలన్నింటిని ప్రత్యక్షంగా చూడగలడు, వినగలడు, తెలుసుకోగలడు. ముందుగాని, వెనుకగాని, పగటియందుగాని, రాత్రియందుగాని, రహస్యమైనదిగాని, ప్రకటితమైనదిగాని, క్రియారూపమున పరిణమించినదిగాని, మనస్సునందు ఉండునదిగాని బోధపడగలదు. విషయాలన్నింటిని యథాతథముగా తెలుసుకోగలడు. ఇతని శరీరమును ఏ ఆయుధము స్పృశించలేదు. అతనికి ఏ విధమైన బడలికయు ఉండదు.

# 2వ భాగం
# ఉపదేశాలు

భగవద్గీత నుండి యువతరం అర్థం చేసుకొని ఆచరించవలసిన ప్రధానమైన విషయాలను ఎంపిక చేసి, వాటిని ఇక్కడ సులభశైలిలో, సంక్షిప్తంగా పొందుపరచడం జరిగింది. వీటికి సంబంధించిన మూల శ్లోకాలను తాత్పర్యాలతో కూడా అందించడం జరుగుతోంది. వ్యక్తిత్వ వికాసానికి, ఉన్నత శిఖరాలను చేరుకోవడానికి ఈ శ్లోకాలు, తాత్పర్యాలు, వచనాలు ఎంతగానో ఉపయోగపడతాయి.

శ్రీకృష్ణభగవానుడు చూపిన గీతామార్గంలో నడుద్దాం! ఇతరులకు ఆదర్శమై, పరమాత్ముని అనుగ్రహానికి పాత్రులమవుదాం!

## 1. "లక్ష్యం పైన దృష్టి సారించు"

**సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥ 1-21**
**యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।**
**కైర్మయా సహ యోద్ధవ్యమ్ అస్మిన్ రణసముద్యమే ॥ 1-22**

కృష్ణా! రణరంగమునందు నిలిచియున్న ప్రతిపక్ష యోధులను పరికించి, వారిలో ఎవరితో నేను యుద్ధము చేయవలసియున్నదో గమనించునంత వరకు రథమును ఇరు సేనల మధ్య నిలిపియుంచుము.

## 2. "అధైర్యాన్ని వదిలిపెట్టి ధైర్యంతో ముందుకుసాగు"

**క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥ 2-3**

పార్థా! అధైర్యము పొందకుము. పరంతపుడవగు నీకు ఇది తగదు. నీచమగు ఈ మనో దౌర్బల్యమును వీడి యుద్ధమునకు సంసిద్ధుడవై లెమ్ము! అని జాగృతునిజేయ ప్రయత్నించిన శ్రీకృష్ణునితో అర్జునుడు...

## 3. “అనవసరమైన విషయాలను గురించి బాధపడకు”

**అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।**
**గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః ॥ 2-11**

దుఃఖింపదగని వారిని గూర్చి దుఃఖించుచుంటివి. పండితుని వలెనూ పలుకుచుంటివి. జీవించియున్న వారిని గూర్చిగాని, మరణించిన వారిని గూర్చిగాని పండితులు దుఃఖింపరు.

## 4. “ఆత్మజ్ఞానాన్ని తెలుసుకో”

**న జాయతే మ్రియతే వా కదాచిత్ నాయం భూత్వా భవితా వా నభూయః।**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే॥ 2-20**

ఆత్మ జరామరణములు లేనిది. ఇది ఒకప్పుడుండి మరియొకప్పుడు లేకపోవుట అనునదిలేదు. ఇది జన్మరహితము, నిత్యము, శాశ్వతము, సనాతనమూ అయినది. చంపబడునది శరీరమేకాని ఆత్మకాదు.

## 5. "గౌరవం కలవానికి అపకీర్తి మరణం కంటే దారుణమైనది"

**అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽ వ్యయామ్ ।**
**సంభావితస్య చాకీర్తిః మరణాదతిరిచ్యతే ॥ 2-34**

నీ అపకీర్తిని గూర్చి లోకులు చిరకాలము చెప్పుకొందురు. గౌరవము కలవానికి అపకీర్తి మరణముకన్నా అధికమైనది.

## 6. "జయాపజయాలతో ప్రమేయం లేకుండా ధర్మం కోసం పోరాడు"

**సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।**
**తతో యుద్ధాయ యుజ్యస్య నైవం పాపమవాప్స్యసి॥ 2-38**

సుఖదుఃఖములను, లాభాలాభములను, జయాపజయములను సమముగా నెంచి యుద్ధమునకు సంసిద్ధుడవుకమ్ము. అట్లు చేయదువేని నీవు పాపమును పొందవు.

## 7. "బాగుగా ఆలోచించి స్థిరమైన నిర్ణయానికి రా!"

**వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన ।**

**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽ వ్యవసాయినామ్ ॥ 2-41**

కురునందనా! కర్మయోగానుష్ఠానమున నిశ్చయముతో కూడిన బుద్ధి ఒకటియే ఉండును. నిశ్చయము లేని వారి బుద్ధులు పలు విధములై అనంతములైయుండును.

## 8. "ఫలితం కోసం ఎదురు చూడకుండా నీవు చేయవలసిన పనిని చేసుకుంటూ వెళ్ళు!"

**కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।**

**మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోఽ స్త్వకర్మణి ॥ 2-47**

కర్మాచరణమునందే నీకధికారము కలదు. కాని, దాని ఫలితముపైన ఎన్నడునూ లేదు. నీవు కర్మ ఫలమునకు కారణము కారాదు. అట్లని కర్మలను మానుటయందాసక్తుడవు కావలదు.

## 9. "పనిలో నైపుణ్యాన్ని పెంచుకో"

**బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।**
**తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥ 2-50**

సమత్త్వబుద్ధిగలవాడు పుణ్యపాపములను రెండింటిని ఈ లోకమునందే త్యజించును. కావున సమత్త్వబుద్ధితో నిష్కామ కర్మయోగముమ కొరకు ప్రయత్నింపుము. నిష్కామముగా, సమత్త్వబుద్ధితో కర్మలనాచరించుటయే నైపుణ్యము. కర్మాచరణము నందు నైపుణ్యమే యోగము.

## 10. "అనవసరమైన ఆలోచనలు మాని ఏకాగ్రచిత్తంతో పనిచేయి"

**శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।**
**సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥ 2-53**

నానావిధములగు విషయముల శ్రవణముచే విచలితమైన నీ అంతఃకరణము ఎపుడు పరమాత్మ ధ్యానమందు స్థిరముగా నిలిచి యుండునో అపుడు నీవు యోగమును పొందగలవు.

## 11. "ఎలాంటి పరిస్థితులు ఎదురైనా స్థితప్రజ్ఞుడిగా ఉండు"

**దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।**
**వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 2-56**

దుఃఖములు కలిగినప్పుడు దిగులు చెందని వాడును, సుఖముల యందు ఆసక్తిలేనివాడును, రాగము, భయము, క్రోధము తొలగిన వాడును అయిన ముని స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

## 12. "ఉత్తమ జీవితం గడపాలంటే ఇంద్రియాలను అదుపులో పెట్టుకో"

**యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।**
**ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ 2-60**
**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 2-61**

ఓ కౌంతేయా! వివేకియైనవాడు నిగ్రహింప ఎంత ప్రయత్నించినను, ప్రబలమైన ఇంద్రియములు వాని మనస్సును విషయములవైపు ఆకర్షించుచునేయుండును. కావున సర్వేంద్రియములను నిగ్రహించి, ఏకాగ్రచిత్తముతో, మత్పరాయణుడై యుండవలెను. ఇంద్రియములను స్వాధీనమొనర్చుకొనువాని బుద్ధి స్థిరముగా నుండును.

## 13. "అథః పతనానికి దారితీసే స్వార్థపరమైన కోరికల విషవలయంలో చిక్కుకోకు"

**ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే ।**
**సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥ 2-62**
**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।**
**స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 2-63**

విషయ వాంఛలను గూర్చి సదా మననము చేయువానికి వానియందు అనురాగమధికమై అది కామముగా మారి చివరకు క్రోధమగును. క్రోధము వలన అవివేకము కలుగును. అవివేకము వలన మనుజుడు సత్ప్రవర్తనను విస్మరించి, దాని ఫలితముగా బుద్ధిని కోల్పోయి, చివరకు అధోగతి చెందును.

## 14. "శాంతమున్నవానికే సౌఖ్యం లభిస్తుంది"

**నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।**
**న చాభావయతః శాంతిః అశాంతస్య కుతః సుఖమ్ ॥ 2-66**

ఇంద్రియములు, మనస్సు వశమునందుండని వానికి ఆత్మ విషయక బుద్ధి ఉండదు. అట్టి అయుక్తునకు ఆత్మస్వరూప భావన కలుగదు. ఆత్మచింతన లేనివానికి శాంతి లభించదు. శాంతిలేనివానికి సుఖమెట్లు లభించును?

## 15. “లోక కళ్యాణం కోసం అలోచించే జ్ఞానిలా జీవించు”

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ 2-69**

సమస్త ప్రాణులకు ఏది రాత్రియైయున్నదో, దానియందు స్థితప్రజ్ఞుడైన యోగి మేల్కొని యుండును. దేనియందు ప్రాణులు మేల్కొని యున్నచో అది పరమార్థ తత్త్వజ్ఞానికి రాత్రియైయుండును.

## 16. “విషయ భోగాలపై ఆసక్తి ఉన్నవాడు శాంతిని పొందలేడు”

**ఆపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి యద్వత్।**
**తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే స శాంతిమాప్నోతి న కామకామీ ॥ 2-70**

అనంత జలరాశితో అలరారుచున్న సముద్రములోనికి నదులన్నియూ వచ్చిచేరి, ఆ సముద్రములో లీనమగునట్లు - ఎట్టి వికారములూ కలిగింపకయే సమస్తభోగములూ స్థితప్రజ్ఞునిలో లీనమగుచున్నవి. ఆ పురుషుడే పరమశాంతిని పొందును. భోగాసక్తుడు శాంతిని పొందజాలడు.

## 17. "నీకు విధించబడిన కర్తవ్యాన్ని జాగ్రత్తగా ఆలోచించి జీవనాన్ని సాగించు"

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ 3-8**

నీవు శాస్త్రవిహితమైన కర్మను ఆచరింపుము. కర్మలనాచరింప కుండుటకంటే కర్మాచరణమే శ్రేష్ఠము. కర్మలను చేయకుండుట వలన నీకు శరీరయాత్ర కూడా సిద్ధింపదు.

## 18. "నీకు విధించబడిన పనిని పవిత్రమైన భావనతో చెయ్యి"

**కర్మబ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।**
**తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ 3-15**

కర్మ వేదము వలన కలుగును. వేదము పరమాత్మ వలన ఉద్భవించెను. కావున సర్వవ్యాపి అయిన బ్రహ్మము సర్వదా యజ్ఞమునందు ప్రతిష్ఠితమై యున్నది.

## 19. “నీవు చేయవలసిన పనిని, ఫలితం గురించి మథనపడకుండా చెయ్యి”

**తస్మాదసక్తఃసతతంకార్యంకర్మసమాచర ।**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ 3-19**

అర్జునా! ఫలాపేక్షారహితముగా నీవు చేయవలసిన కర్మలనాచరించుము. అట్లాచరించు మనుజుడు మోక్షము నొందును.

## 20. “నీవు చేయవలసిన పనిని లోకహితం కోసం చెయ్యి’

**కర్మణైన హి సంసిద్ధిమాస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 3-20**

జనకుడు మున్నగు వారు నిష్కామ కర్మచేతనే మోక్షమును పొందిరి. కావున అర్జునా ! నీవునూ లోకహితార్థమై కర్మల నాచరించుటయే సముచితము.

## 21. "నీవు చేయవలసిన పనిని ఇతరులకు ఆదర్శం అగునట్లుగా చెయ్యి"

**యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ 3-21**

ఉత్తములైన వారు దేనినాచరింతురో దానినే ఇతరులునూ ఆచరింతురు. ఉత్తములు దేనిని ప్రమాణముగా అంగీకరింతురో లోకమంతయూ దానినే అనుసరించును.

## 22. "నీ పనిని నేర్పుతో, లోక కళ్యాణం కోసం చేస్తూ, ఇతరులచేత కూడా చేయించు"

**న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినామ్ ।**
**జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తఃసమాచరన్॥ 3-26**

జ్ఞానియైనవాడు కర్మాసక్తులైన అజ్ఞానుల బుద్ధిని చలింపజేయరాదు. తాను నిష్కామముగా నేర్పుతో కర్మల నాచరించుచు, వారి చేత ఆచరింపజేయవలెను.

## 23. “కర్మఫలాన్ని పరమాత్మకు అర్పించి, జీవన పోరాటాన్ని సాగించు”

**మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా ।**
**నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వవిగతజ్వరః ॥ 3-30**

అర్జునా! వివేకబుద్ధితో సమస్త కర్మలనూ నాయందు సమర్పించి, నిష్కాముడవై, మమకారములేనివాడవై, సంతాపమును వదలి యుద్ధము చేయుము.

## 24. “రాగద్వేషాలకు వశంకాకుండా పనిచెయ్యి”

**ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ 3-34**

అర్జునా! ఇంద్రియ విషయములన్నింటిలోను రాగద్వేషములు వ్యవస్థితములై యుండును. మనుజుని శ్రేయోమార్గమునకు ప్రబలశత్రువులైన ఆ రాగద్వేషములకు వశముకావలదు.

## 25. “నీకు విధించబడిన ధర్మాన్నే ఆచరించు”

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 3-35**

చక్కగా అనుష్ఠింపబడిన పరధర్మము కన్నా – గుణము లేనిదైననూ స్వధర్మమే మేలు. అట్టి స్వధర్మాచరణమున మరణము సంభవించిననూ మేలే! పరధర్మము భయంకర మైనది.

## 26. “కోరికలను తప్పనిసరిగా జయించు”

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥ 3-43**

బుద్ధికంటే అత్యంత ఉత్కృష్టమైనదే ఆత్మ. కావున మహాబాహో! ఈ విషయమును గ్రహించి బుద్ధిచేత మనస్సును వశపరచుకొని దుస్సాధ్యమైన కామమనెడి శత్రువును జయింపుము.

## 27. “అధర్మాన్ని చెయ్యకు! దేవుడు శిక్షిస్తాడు!”

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ 4-7**

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ 4-8**

ఏ కాలమున ధర్మమునకు హాని కలుగునో, అధర్మము వృద్ధినొందునో, ఆయా సమయములయందు, శిష్టరక్షణ, దుష్టశిక్షణ, ధర్మ సంరక్షణముల కొరకు ప్రతీ యుగమున అవతారము దాల్చుచుందును.

## 28. “భగవంతుణ్ణి ఏ దృష్టితో సేవిస్తే, ఆ విధంగా అనుగ్రహిస్తాడు”

**యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ ।**
**మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ 4-11**

ఎవరెవరు ఏ విధముగా నన్ను సేవించుచుందురో వారిని ఆ విధముగా అనుగ్రహింతును. పార్థా! మనుజులు సర్వవిధములా నా మార్గమునే అనుసరించుచుందురు.

## 29. "గుణ కర్మలను బట్టి నాలుగు వర్ణాల వ్యవస్థను పరమాత్మ ఏర్పాటు చేశాడు."

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।**
**తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ 4-13**

గుణకర్మల విభాగముననుసరించి నాలుగు వర్ణములు నాచే సృష్టింపబడినవి. ఆ సృష్టికి నేను కర్మనైనప్పటికి, నన్ను అకర్తనుగనూ, నాశరహితునిగనూ ఎరుంగుము.

## 30. "పూర్వులు నడిచిన కర్మ మార్గంలోనే ప్రయాణించు"

**ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।**
**కురు కర్మైవ తస్మాత్ త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥**
**4-15**

అర్జునా ! ఈ విధముగా తెలిసికొని ప్రాచీనులైన ముముక్షువులు కర్మలనాచరించిరి. కావున నీవునూ ప్రాచీనులచే పూర్వమనుష్ఠింప బడిన కర్మనే ఆచరింపుము.

## 31. "నిస్వార్థబుద్ధితో పనులను చెయ్యి! నీకు ఏ పాపము అంటదు"

**నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్ నాప్నోతి కిల్బిషమ్ ॥ 4-21**

కోరికలను త్యజించి, ఇంద్రియములను నిగ్రహించుకొని, సమస్త భోగవస్తువులను విడనాడి, కేవలము శరీర యాత్రకు అవసరమైన కర్మలను మాత్రమే ఆచరించు యోగి ఏ పాపమునూ పొందదు.

## 32. "కర్మలోని ప్రతి అంశము పరబ్రహ్మ స్వరూపమే"

**బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।**
**బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ 4-24**

యజ్ఞపాత్రము బ్రహ్మము, హోమద్రవ్యము బ్రహ్మము, అగ్ని బ్రహ్మము, హోమము చేయువాడు బ్రహ్మము, బ్రహ్మకర్మ సమాధిచేత పొందదగు ఫలము కూడా బ్రహ్మమనియే తలంచవలయును.

## 33. "పవిత్రమైన భావనతో పనులు చెయ్యి లేకపోతే జీవితం వృధా"

**యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ।**
**నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥ 4-31**

ఓ కురుసత్తమా! యజ్ఞములాచరింపగా మిగిలిన అమృతరూపమైన అన్నమును భుజించువారు శాశ్వత పరబ్రహ్మమును పొందుదురు. యజ్ఞము చేయనివానికి ఇహ లోకమే లేదు. పరలోకమెక్కడిది?

## 34. "భక్తిశ్రద్ధలతో గురువును సేవించు, వారు జ్ఞానాన్ని తప్పక ఉపదేశిస్తారు"

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ 4-34**

వినయపూర్వకమైన ప్రశ్నలచేతను, సేవచేతను అర్థించినచో, తత్త్వవేత్తలగు జ్ఞానులు నీకు జ్ఞానమునుపదేశించగలరు.

**35. “జ్ఞానంతో సమానమైనది, పవిత్రమైనది ఇంకొకటి లేదు”**

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**

**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥ 4-38**

ఈ లోకమున జ్ఞానముతో సమానమైనది, పవిత్రమైనది మరియొకటి లేదు. అట్టి జ్ఞానమును యోగి కాలక్రమమున స్వయముగా పొందును.

**36. “జ్ఞానాన్ని సాధించడానికి శ్రద్ధ, ఇంద్రియ నిగ్రహము అత్యవసరము”**

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః ।**

**జ్ఞానం లబ్ధ్వా పరామ్ శాంతిమచిరేణాధిగచ్ఛతి ॥ 4-39**

శ్రద్ధ, పట్టుదల, ఇంద్రియ నిగ్రహము గలవాడు జ్ఞానమును పొందును. అట్టి జ్ఞానమును బడసి అతడు శీఘ్రముగా ఉత్కృష్టమైన మోక్షమును పొందును.

## 37. "జ్ఞానంలేకపోయినా, శ్రద్ధలేకపోయినా, నిశ్చయాత్మకత లేకపోయినా జీవితంలో ఏమీ సాధించలేము"

**అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।**
**నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥**
**4-40**

జ్ఞానశూన్యుడు, శ్రద్ధారహితుడు, సంశయాత్ముడు వినాశమునే పొందును. సంశయాత్మునకు ఇహలోకము, పరలేకము, సౌఖ్యమూ లేవు.

## 38. "లే! సందేహిస్తూ కూర్చోక, కార్యరంగంలోకి దూకు!"

**తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।**
**ఛిత్త్వైనం సంశయం యోగమ్ ఆతిష్ఠోత్తిష్ఠ భారత ॥ 4-42**

'ఓ భారతా! లెమ్ము.... నీ హృదయమందున్న అజ్ఞానజనితమైన సందేహమును జ్ఞానమను ఖడ్గముతో ఖండించి, కర్మయోగమునాచరింపుము' అని కృష్ణ భగవానుడు అర్జునుని జాగృత పరచెను.

## 39. "ఫలితాన్ని పరమాత్మకు వదిలిపెట్టి పనులు చేసేవాడికి పాపపుణ్యాలు అంటవు"

**బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।**
**లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥ 5-10**

ఎవడు ఫలాసక్తిని విడచి బ్రహ్మార్పణముగా కర్మల నాచరించునో, తామరాకుపై నీటిబిందువులు అంటనిరీతిగా అతనిని పాపములంటవు.

## 40. "నీవు చేసిన పాపపుణ్యాలతో పరమాత్మకు సంబంధం లేదు. నీవే అనుభవించాలి"

**నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥ 5-15**

ఎవని పాపపుణ్యములనూ పరమాత్మ స్వీకరింపడు. అజ్ఞానముచే జ్ఞానము కప్పబడియుండుట వలన మనుజులు మోహము నొందుచున్నారు.

## 41. "జ్ఞానం సూర్యుని వంటిది. అందుచేత పరమార్థతత్త్వం స్పష్టంగా బోధపడుతుంది"

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 5-16**

ఎవరి అజ్ఞానము జ్ఞానము చేత నశింపజేయబడునో, వారికి జ్ఞానము సూర్యునివలె పరమార్థ తత్త్వమును ప్రకాశింపజేయుచున్నది.

## 42. "పరమాత్మే సర్వమని నమ్మినవానికి మోక్షం తప్పక లభిస్తుంది"

**తద్బుద్ధయస్తదాత్మానః తన్నిష్ఠాస్తత్పరాయణాః ।**
**గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ 5-17**

పరమాత్మయందే బుద్ధిని, మనస్సును నిలిపినవారు, పరమాత్మయందే నిష్ఠగలవారు, ఆ పరమాత్మయే పరమగతియని నమ్మినవారు, జ్ఞానసాధనతో పాపరహితులై పునరావృత్తిరహితమైన మోక్షమును పొందుదురు.

## 43. “సర్వజీవులయందును సమదృష్టికలవాడే పండితుడు”

**విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ 5-18**

విద్యావినయసంపన్నుడగు బ్రాహ్మణుని యందును, గోవునందును, ఏనుగునందును, శునకమునందునూ, శునక మాంసము వండుకొని తినువాని యందునూ పండితులు సమదృష్టి కలిగియుందురు.

## 44. “ఆనందంగా జీవించాలంటే ఉద్వేగాలను అణచుకోవాలి”

**కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।**
**అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ 5-26**

కామక్రోధ వివర్జితులు, మనో నిగ్రహము కలవారు, ఆత్మ జ్ఞానులు అయిన యతులకు ఎల్లప్పుడునూ బ్రహ్మానందమే.

## 45. “వృద్ధి, పతనాలు నీ చేతిలోనే ఉన్నాయి, నిన్ను నువ్వే ఉద్ధరించుకో”

**ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।**
**ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః ॥ 6-5**

ఈ లోకమునందు మనుజుడు తనకు తానే మిత్రుడునూ, శత్రువునూ గాన, అధోగతి నొందక తనను తానే ఉద్ధరించు కొనవలెను.

## 46. “ఉత్తముల లక్షణాలను అలవరుచుకో”

**సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు ।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ 6-9**

సుహృదులను, మిత్రులను, శత్రువులను, తటస్థులను, మధ్యస్థులను, ద్వేషింపదగినవారిని, బంధువులను, సాధువులను, పాపులను సమభావముతో చూచువాడు ఉత్తముడు.

## 47. “నియమాలను పాటించి ఏకాగ్రతను పెంచుకో”

**యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ 6-17**

మితమైన ఆహారవిహారములు, కర్మాచరణములు, మితమైన నిద్ర, మెలకువ కలవానికి దుఃఖనాశకమగు ధ్యానయోగము సిద్ధించును.

## 48. “అభ్యాసంతో మనస్సును నిగ్రహించుకో”

**అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 6-35**

మహాబాహో! నిస్సందేహముగా మనస్సు చంచలమైనది. నిగ్రహించుటకు దుస్సాధ్యమైనది. అయిననూ దానిని అభ్యాస, వైరాగ్యములచేత నిగ్రహింపవచ్చును.

## 49. "నువ్వు చేసే మంచిపనులే నిన్ను రక్షిస్తాయి"

**పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।**
**న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి ॥ 6-40**

పార్థా! యోగస్థితిని పొందజాలని వానికి ఇహపరలోకము లందు వినాశముకలుగదు. నాయనా! మంచిపనులు చేయువాడెవ్వడును దుర్గతిపాలుగాడు.

## 50. "నీకు విధించబడిన కర్తవ్యాన్ని ఆచరించడమే ఉత్తమోత్తమం"

**తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ 6-46**

యోగియైనవాడు, తాపసులకంటెను, జ్ఞానులకంటెను, కర్మ నిష్ఠులకంటెను శ్రేష్ఠుడని తలంపబడుచున్నాడు. కావున అర్జునా! నీవు యోగివి కమ్ము !

## 51. ‘నిరంతరం పరమాత్మకోసం ప్రయత్నిస్తూనే ఉండు”

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 7-3**

వేలకొలదీ జనులలో ఏ ఒక్కడో జ్ఞానసిద్ధి కొరకు ప్రయత్నించును. అట్లు ప్రయత్నించు వారిలో ఏ ఒకడు మాత్రమే నన్ను యథార్థముగా తెలిసికొనగలుగును.

## 52. “పరమాత్మ సర్వవ్యాపి అని తెలుసుకో”

**మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 7-7**

అర్జునా! నాకంటే శ్రేష్ఠమైనది మరియేదియునూ లేదు. సూత్రమున మణులవలె నాయందు ఈ జగమంతయూ కూర్చబడియున్నది.

## 53. "పరమాత్మను చేరడమే అంతిమ గమ్యంగా పెట్టుకో"

**అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।**
**దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి ॥**

**7-23**

అల్పబుద్ధులు పొందు ఫలము నశ్వరము. దేవతల నారాధించువారు దేవతలను, నా భక్తులు నన్నూ పొందుదురు.

## 54. "కనిపించనంత మాత్రాన దేవుడు లేడనుకోకు, యోగమాయ కారణంగా దేవుడు కనిపించడు."

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥**

**7-25**

యోగమాయచే ఆవరించబడి నేనందరకును గోచరింప కున్నాను. ఈ మూఢ లోకము నన్ను జన్మరహితునిగను, శాశ్వతునిగనూ తెలియజాలకున్నది.

## 55. “అభ్యాసంతో, ఏకాగ్రతతో పనిచేసేవాడు పరమలక్ష్యాన్ని జేరతాడు”

**అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థనుచింతయన్॥ 8-8**

అర్జునా! అభ్యాసయోగముమతో ఏకాగ్ర చిత్తమున దివ్యరూపుడైన పరమపురుషుని స్మరించువాడు అతనినే చెందును. ఆ పరమపురుషుడే సర్వజ్ఞుడు, పురాణ పురుషుడు, సర్వపోషకుడు, అనూహ్యామైనరూపము కలవాడు, సూర్యకాంతి సదృశ తేజోమయుడు, అజ్ఞానాంధకారమునకు ఆవలివాడు.

## 56. “ఉన్నతమైన లక్ష్యాన్ని చేరడానికి అనన్యభక్తి, శ్రద్ధ అవసరం”

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥ 11-54**

పరంతపా! ఇట్టి నా విశ్వరూపమును దర్శించుటకు, యథార్థముగా గ్రహించుటకు, చేరుటకు అనన్యభక్తిచేతనే సాధ్యమగును.

**57. “మనం చేసే పనుల్ని పరమాత్మ గమనిస్తున్నాడని తెలుసుకో”**

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్ ।**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 13-13**

ఆ పరమాత్ముని చేతులు, పాదములు, నేత్రములు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములై ఉన్నాయి. అతడు సర్వాన్ని ఆవరించి ఉన్నాడు.

**58. “మంచి లక్షణాలను అలవాటు చేసుకో! వృద్ధిలోకి వస్తావు!”**

**దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ।**
**మా శుచః సంపదం దైవీమ్ అభిజాతోఽసి పాండవ ॥ 16-5**

ఓ అర్జునా! దైవీ సంపద ముక్తిదాయకము. ఆసురీసంపద బంధహేతువు. నీవు దైవీసంపదతో పుట్టినవాడవు. కనుక శోకింపకుము.

# 3వ భాగం

# సందేహాలు - సమాధానాలు

**1. ప్ర. భగవద్గీతలోని మొదటి శ్లోకం ఏ పదముతో ప్రారంభమవుతుంది?**

**స.** భగవద్గీతలోని మొదటి శ్లోకం ధర్మము అనే పదముతో ప్రారంభమవుతుంది.

"ఓ సంజయా! యుద్ధసన్నద్ధులై, ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునకు జేరియున్న నా కుమారులును, పాండవులును ఏమి చేసిరి?"

**ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।**
**మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥ 1-1**

**2. ప్ర. కృష్ణార్జునుల శంఖముల పేర్లు ఏమిటి?**

**స.** శ్రీకృష్ణుని శంఖము పేరు - పాంచజన్యము
అర్జునుని శంఖము పేరు - దేవదత్తము
భీముని శంఖము పేరు - పౌండ్రము
ధర్మరాజు శంఖము పేరు - అనంత విజయము
నకులుని శంఖము పేరు - సుఘోషము
సహదేవుని శంఖము పేరు - మణి పుష్పకము

**పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।**
**పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥ 1-15**

**అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।**
**నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ ॥ 1-16**

**3.** ప్ర. **దుర్యోధనుడు ఏ రకమైన వ్యక్తి?**

**స.** దుర్యోధనుడు ఒక ఆతతాయి.

**4.** ప్ర. **ఆతతాయి అంటే ఎవరు?**

**స.** **అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిః ధనాపహః ।**
**క్షేత్రదారాపహర్తా చ షడేతే ఆతతాయినః ॥**

ఇళ్ళకు నిప్పుపెట్టువాడు, విషాన్ని ప్రయోగించేవాడు, స్వార్థ బుద్ధితో నిరాయుధులను భయపెట్టడానికి ఆయుధాలను ధరించేవాడు, పరుల ధనాన్ని అపహరించేవాడు, పరుల భూములను, వనితలను, భార్యలను అపహరించువాడు – ఈ ఆరుగురిని ఆతతాయులు అంటారు.

**5.** ప్ర. **అర్జునుడు శిష్యునిగా తనను గ్రహించి, ఉపదేశించ వలసిందిగా శ్రీకృష్ణుని కోరిన శ్లోకం ఏది? (లేక) గీతలో శరణాగతి శ్లోకం అని దేనిని అంటారు?**

**స.** భగవద్గీతలోని 2వ అధ్యాయంలోని 7వ శ్లోకాన్ని శరణాగతి శ్లోకం అంటారు.

"కార్పణ్యదోషము (పిరికితనము)నకు లోనై నా స్వభావమును కోల్పోయి గిలగిలలాడుచున్నాను. ధర్మాధర్మముల విచక్షణకు దూరమై నా కర్తవ్యమును నిర్ణయించుకొనలేకున్నాను. నాకు నిజముగా శ్రేయస్కరమైన దానిని తెలుపుము. నేను నీకు

శిష్యుడను, శరణాగతుడను, ఉపదేశింపుము”

**కార్పణ్య దోషోప హత స్వభావః పృచ్ఛామి త్వాం ధర్మ సంమూఢ చేతాః**
**యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్య స్తే హం శాధిమాం త్వాం ప్రపన్నమ్**

**6.** ప్ర. **తత్త్వజ్ఞాని అంటే ఎవరు?**

**స.** అనిత్యమైనదానికి ఉనికి లేదని, నిత్యమైనది ఎల్లప్పుడూ ఉంటుందని (దానికి లేకుండుట లేదని) తెలిసినవాడే తత్త్వజ్ఞాని.

**నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।**
**ఉభయోరపి దృష్టోంఽ తః త్వనయోస్తత్త్వదర్శిభిః 2-16**

**7.** ప్ర. **భగవద్గీతలో ఆత్మతత్త్వ విచారణ ఎక్కడ కనిపిస్తుంది?**

**స.** భగవద్గీతలో ఆత్మతత్త్వ విచారణ 2వ అధ్యాయము (సాంఖ్య యోగం) లోని 12వ శ్లోకం నుండి 30వ శ్లోకం వరకు కనిపిస్తుంది.

**8.** ప్ర. **ఆత్మ ఎటువంటిది?**

**స.** ఛేదించడానికి, దహించడానికి, తడపడానికి, శోషింప జేయడానికి సాధ్యముకానిది ఆత్మ. ఇది నిత్యము, సర్వవ్యాపి, అచలము, స్థిరమైనది, శాశ్వతమైనది.

వ్యక్తంచేయడానికి, ఊహించడానికి, మార్చడానికి సాధ్యం కానిది ఆత్మ.

**అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ యమ్ అక్లేద్యోఽ శోష్య ఏవ చ ।**
**నిత్యః సర్వగతః స్థాణుః అచలోఽ యం సనాతనః ॥ 2-24**

**అవ్యక్తోఽ యమచింత్యోఽ యమ్ అవికార్యోఽ యముచ్యతే।**
**తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥ 2-25**

**9. ప్ర. ఆత్మకు శాంతి చేకూరాలని భగవంతుణ్ణి ప్రార్థించడం సరియేనా?**

**స.** ఆత్మ ఎల్లప్పుడూ ఆనందంగా ఉంటుంది. "ఆత్మ"కు ఏదీ అంటదు. దానికి శాంతి కలగాలని కోరుకోవడం సరియైన పని కాదు. కాని మరణించిన ఏ జీవికైనా సద్గతులు రావాలని ప్రార్థించవచ్చు.

"ఆత్మ జరామరణములు లేనిది. ఇది ఒకప్పుడుండి మరొయొకప్పుడు లేకపోవుట అనునదిలేదు. ఇది జన్మరహితము, నిత్యము, శాశ్వతము, సనాతనమూ అయినది. చంపబడినది శరీరమేకాని ఆత్మకాదు."

**న జాయతే మ్రియతే వా కదాచిత్**

**నాయం భూత్వా భవితా వా న భూయః ।**

**అజో నిత్యః శాశ్వతోఽ యం పురాణో**

**న హన్యతే హన్యమానే శరీరే ॥**

**10. ప్ర. మరణం కంటే దారుణమైనది ఏది?**

**స.** గౌరవం కలవానికి అపకీర్తి మరణంకంటే దారుణమైనది.

**అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽ వ్యయామ్ ।**
**సంభావితస్య చాకీర్తిః మరణాదతిరిచ్యతే ॥ 2-34**

**11.** ప్ర. **స్థితప్రజ్ఞుడు అంటే ఎవరు?**

**స.** దుఃఖాలు కలిగినప్పుడు దిగులు చెందని వాడును, సుఖాలపై ఆసక్తిలేనివాడును, రాగము, భయము, క్రోధము తొలగిన వాడును, స్థిరమైనబుద్ధికలవాడును అయిన వ్యక్తిని స్థితప్రజ్ఞుడు అంటారు.

**దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।**
**వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 2-56**

**12.** ప్ర. **స్థితప్రజ్ఞుని లక్షణం ఏమిటి?**

**స.** తాబేలు అన్నివైపుల నుండి తన అవయవాలను ముడుచు కొనునట్లుగా, స్థితప్రజ్ఞుడు విషయాల నుండి ఇంద్రియాలను ఉపసంహరించుకొని జ్ఞానాన్ని స్థిరంగా ఉంచుకుంటాడు.

**యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 2-58**

**13.** ప్ర. **మనిషి పతనం ఎట్లా జరుగుతుంది?**

**స.** విషయ వాంఛలను గూర్చి ఎప్పుడూ మననం చేసేవానికి వానియందు అనురాగం అధికమై, అది కామంగా మారి, చివరకు క్రోధం అవుతుంది. క్రోధం వలన అవివేకం కలుగుతుంది. అవివేకం వలన మనుజుడు సత్ప్రవర్తనను విస్మరించి, దాని ఫలితంగా బుద్ధిని కోల్పోయి, చివరకు అధోగతి చెందుతాడు.

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే ।
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే॥

2-62

క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 2-63

**14.** ప్ర. ఎవనికి శాంతి లభిస్తుంది?

**స.** ఎవడు కోరికలనన్నింటినీ త్యజించి, వాటియందు ఆసక్తిని విడిచిపెట్టి "నాది" అనే భావాన్ని వదులుకొని, అహంకారాన్ని విడిచిపెట్టి ప్రవర్తిస్తాడో, అతడు నిశ్చయంగా శాంతిని పొందుతాడు.

విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః।
నిర్మమో నిరహంకారః స శాంతిమధిగచ్ఛతి ॥ 2-71

**15.** ప్ర. మిథ్యాచారుడు ఎవరు?

**స.** ఎవడు కర్మేంద్రియాలను బలవంతంగా నియంత్రించి, మనస్సులో మాత్రం విషయాలను గూర్చి చింతిస్తూ ఉంటాడో, అట్టివాడు మూఢచిత్తుడైన కపట వర్తనుడు. అతనినే మిథ్యాచారుడు అని అంటారు.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే॥ 3-6

**16.** ప్ర. కర్మ మార్గంలో మోక్షాన్ని పొందినవారెవరైనా ఉన్నారా?

**స.** జనకుడు మొదలైన వారు నిష్కామ కర్మ ద్వారా మోక్షాన్ని పొందారు.

**కర్మణైవ హి సంసిద్ధిమ్ ఆస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 3-20**

**17. ప్ర. జ్ఞానులకు నిత్య శత్రువు ఏది?**

**స.** ఎన్నటికీ చల్లారని అగ్ని వంటి కామమే జ్ఞానులకు నిత్య శత్రువు.

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥ 3-39**

**18. ప్ర. పునర్జన్మ ఎవనికి ఉండదు?**

**స.** ఎవడు పరమాత్మయొక్క దివ్యమైన జన్మ కర్మలను గూర్చి యథార్థముగా తెలుసుకుంటాడో, అతడు దేహాన్ని విడిచిన పిమ్మట పరమాత్మనే చేరతాడు. అతనికి పునర్జన్మ ఉండదు.

**జన్మ కర్మ చ మే దివ్యమ్ ఏవం యో వేత్తి తత్త్వతః ।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥ 4-9**

**19. ప్ర. పండితుడని ఎవరిని అంటారు?**

**స.** ఎవడు సర్వకర్మలను, కోరికలు, సంకల్పాలు లేకుండా చేస్తాడో, ఎవని సర్వకర్మలు జ్ఞానం మాత్రమే ఆధారంగా ఉంటాయో, అట్టివానిని పండితుడని అంటారు.

**యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।**
**జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః॥ 4-19**

**20.ప్ర. భోజనానికి ముందు పఠించవలసిన శ్లోకములు ఏమిటి?**

**స. బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।**
**బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ 4–24**

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥15-14**

**21.ప్ర. యజ్ఞాలు ఎన్ని రకాలు?**

**స.** యజ్ఞాలు చాలా రకాలుగా విభజించబడ్డాయి. అందులో కొన్ని – యోగ యజ్ఞాలు, ద్రవ్యయజ్ఞాలు, తపోయజ్ఞాలు, స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాలు మొదలైనవి. వీటిని సన్న్యాసులు దృఢవ్రతులై, ప్రయత్నశీలురై ఆచరిస్తున్నారు.

**ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే ।**
**స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః॥ 4–28**

**22.ప్ర. కర్మసన్న్యాసం, కర్మయోగం–ఈ రెండింటిలో ఏది శ్రేష్ఠమైనది?**

**స.** కర్మసన్న్యాసం, కర్మయోగం – రెండూ కూడా మోక్షప్రదాలే. అందులో, కర్మసన్న్యాసంకంటే కర్మయోగమే శ్రేష్ఠమైనది.

**సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।**
**తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే॥ 5–2**

**23.** ప్ర. **నిత్య సన్న్యాసి అంటే ఎవరు?**

**స.** రాగద్వేషాలకు అతీతుడై ఉండేవానిని నిత్య సన్న్యాసి అని అంటారు. అట్టి ద్వంద్వరహితుడు సులభంగా సంసార బంధంనుండి ముక్తుడౌతాడు.

**జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।**
**నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ ప్రముచ్యతే॥ 5-3**

**24.** ప్ర. **మనం చేసే పాపాలను, పుణ్యాలను పరమాత్మ స్వీకరిస్తాడా?**

**స.** మనం చేసే పాపాలను, పుణ్యాలను పరమాత్మ స్వీకరించడు.

**నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః॥ 5-15**

**25.** ప్ర. **అనందమయుడని ఎవరిని అంటారు?**

**స.** కామక్రోధాల వలన కలిగే ఉద్వేగాలను సహించే వ్యక్తిని ఆనందమయుడు అంటారు.

**శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః॥ 5-23**

**26.** ప్ర. **నిత్యముక్తుడంటే ఎవరు?**

**స.** ఇంద్రియమనోబుద్ధులను స్వాధీనం చేసుకొని, మోక్షాసక్తుడై, నిత్యం మననం చేస్తూ, కోరికలు, భయం, కోపం లేకుండా ఎవడు ఉంటాడో అట్టివానిని నిత్యముక్తుడు అంటారు.

**యతేంద్రియమనోబుద్ధిః మునిర్మోక్షపరాయణః ।**
**విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః ॥ 5-28**

**27. ప్ర. యోగారూఢుడని ఎవరిని అంటారు?**

**స.** ఇంద్రియ విషయాలయందు, కర్మలయందు ఆసక్తిని వదలి, సర్వసంకల్పాలను పరిత్యజించిన వానిని యోగారూఢుడు అంటారు.

**యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।**
**సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే ॥ 6-4**

**28. ప్ర. ప్రతి వ్యక్తికి బంధువు ఎవరు? శత్రువు ఎవరు?**

**స.** దేహాన్ని, ఇంద్రియాలను, మనస్సును తీవ్ర ప్రయత్నంతో జయించినవాడు తానే తనకు బంధువు. అట్లు జయింపనివాడు తానే తనకు శత్రువు.

**బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।**
**అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ 6-6**

**29. ప్ర. యోగ సిద్ధిని పొందినవాడు ఎట్లా ఉంటాడు?**

**స.** యోగసిద్ధిని పొందినవాడు బాగా నిగ్రహింపబడిన తన చిత్తాన్ని ఆత్మయందే లగ్నం చేసి, సమస్త విషయవాంఛల నుండి నివృత్తుడయి ఉంటాడు.

**యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।**
**నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ 6-18**

**30.** ప్ర. **మనస్సును ఏ విధంగా నిగ్రహించుకోవచ్చును?**

**స.** నిస్సందేహంగా మనస్సు చంచలమైనది. నిగ్రహించడానికి దుస్సాధ్యమైనది. అయినా, దానిని అభ్యాస, వైరాగ్యాలచేత నిగ్రహించవచ్చు.

**అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 6-35**

**31.** ప్ర. **ప్రకృతి ఎన్ని విధాలు? అవి ఏమిటి?**

**స.** ప్రకృతి రెండు రకాలు - అపరా ప్రకృతి, పరా ప్రకృతి. అందులో మొదటిదైన అపరా ప్రకృతి - భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, అని ఎనిమిది విధాలుగా విభజింపబడియుంది.

దీనికంటే వేరైనది, జీవరూపమైనది, జగత్తును ధరించేది అయిన మరియొక ప్రకృతిని పరాప్రకృతి అని అంటారు. ఈ రెండు ప్రకృతులలోను పరా ప్రకృతి శ్రేష్ఠమైనది.

**భూమిరాపోऽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ 7-4**

**అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।**
**జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ 7-5**

**32.** ప్ర. **పరమాత్మను ఎవరెవరు సేవిస్తారు?**

**స.** బాధలలోనుండి బయటపడాలని కోరుకునేవాడు (ఆర్తుడు), పరమాత్మను తెలుసుకోవాలని కోరుకునేవాడు (జిజ్ఞాసువు),

వివిధ విషయములకు చెందిన కోరికలను కోరుకునేవాడు (అర్థకాముడు), పరమాత్మను తెలుసుకొనినవాడు (జ్ఞాని) అను నాలుగు విధాలైన పుణ్యాత్ములు పరమాత్మను సేవిస్తూ ఉంటారు.

**చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున ।**
**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ 7-16**

**33. ప్ర. మన కోరికలను తీర్చే దేవతలకు ఆ శక్తి ఎవరి నుండి లభించింది?**

**స.** మన కోరికలను తీర్చే దేవతలకు ఆ శక్తి పరమాత్మ నుండి లభించింది.

......

**స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధనమీహతే ।**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ॥ 7-22**

**34. ప్ర. బ్రహ్మము, అధ్యాత్మము, అధిభూతము, అధి దైవము, అధి యజ్ఞము అంటే ఏమిటి?**

**స.** నాశనం లేనిది, అన్నింటికంటే గొప్పది అయినది బ్రహ్మము.

దేహంలో జీవరూపంలో ఉన్నది అధ్యాత్మము.

ఉత్పత్తి, నాశనము లక్షణంగాగల పదార్థం అధిభూతము.

సమస్త ప్రాణుల ఇంద్రియాలకు శక్తిని ప్రసాదిస్తూ, సూర్యలోకంలో నివసించే హిరణ్యగర్భుడు అధిదైవము.

సమస్త యజ్ఞములకు అధిష్ఠాత అయి, ఈ శరీరమందు ఉండు పరమాత్మ (విష్ణువు) అధియజ్ఞము.

**అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।**
**భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 8-3**

**అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।**
**అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥ 8-4**

**35.** ప్ర. **బ్రహ్మచారి అనగా ఎవరు?**

**స.** బ్రహ్మ అనగా వేదము అని అర్థము. వేదోక్తములైన నియమములను ఆచరించువానిని బ్రహ్మచారి అంటారు.

**36.** ప్ర. **మోక్షం అంటే ఏమిటి?**

**స.** పరమాత్మను జేరుకోవడాన్ని మోక్షం అంటారు.

**37.** ప్ర. **ఎవరికి మోక్షం లభిస్తుంది?**

**స.** సర్వేంద్రియాలను నిగ్రహించి, మనస్సును హృదయము నందు నిలిపి, ప్రాణమును శిరస్సునందు స్థిరముగా ఉంచి, ధ్యానమునందు నిమగ్నుడై "ఓం"కారాన్ని ఉచ్చరిస్తూ, పరమాత్మను స్మరిస్తూ, దేహాన్ని త్యాగం చేసేవానికి మోక్షం తప్పక లభిస్తుంది.

**సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమ్ ఆస్థితో యోగధారణామ్ ॥ 8-12**

**38.** ప్ర. **చివరి ప్రయాణ కాలంలో ఏమి చేసుకోవాలి?**

**స.** "ఓం"కారాన్ని ఉచ్చరిస్తూ, పరమాత్మను స్మరిస్తూ, దేహత్యాగం చెయ్యాలి. అప్పుడు అతనికి మోక్షం తప్పక లభిస్తుంది.

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।**
**యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్॥ 8-13**

**39.** ప్ర. **ఎవరికి పునర్జన్మ ఉండదు?**

**స.** పరమసిద్ధిని పొందిన మహాత్ములు పరమాత్మను జేరిన పిదప, వారికి పునర్జన్మ ఉండదు.

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।**
**నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ 8-15**

**40.** ప్ర. **పునరావృత్తి ఎవరికి ఉంటుంది?**

**స.** బ్రహ్మ లోకము లగాయతు సమస్త లోకములకు, వాటన్నిటిలోని జీవులకు పునర్జన్మ ఉంటుంది.

**ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।**
**మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥ 8-16**

**41.** ప్ర. **యుగములయొక్క కాలప్రమాణం ఎంత?**

**స.** కృతయుగము - 17,28,000 సం॥లు

త్రేతాయుగము - 12,96,000 సం॥లు

ద్వాపరయుగము - 8,64,000 సం॥లు

కలియుగము – 4,32,000 సం॥లు

మొత్తం = 1 మహాయుగము = 43,20,000 సం॥లు

1 మన్వంతరము = 71 మహాయుగములు +

1 కృతయుగము

= 30,84,48,000 సం॥లు.

1 కల్పము = 14 మన్వంతరములు + 1 కృతయుగము

= 4,32,00,00,000 సం॥లు

**42.ప్ర. బ్రహ్మగారి పగలు, రాత్రి – కాలప్రమాణం ఎంత?**

**స.** బ్రహ్మగారి 1 పగలు = 1 కల్పము

= 1000 మహాయుగములు

= 4,32,00,00,000 సం॥లు

బ్రహ్మగారి 1 రాత్రి = 1 కల్పము

= 1000 మహాయుగములు

= 4,32,00,00,000 సం॥లు

బ్రహ్మగారి ఒక రోజు = 1 పగలు + 1 రాత్రి

= 8,64,00,00,000 సం॥లు

బ్రహ్మదేవుని పగటికాలపు ప్రారంభంలో సృష్టి జరుగుతుంది.

బ్రహ్మదేవుని రాత్రికాలపు ప్రారంభంలో ప్రలయము సంభవిస్తుంది.

**సహస్రయుగపర్యంతమ్ అహర్యద్బ్రహ్మణో విదుః ।**
**రాత్రిం యుగసహస్రాంతాం తేఽ హెూరాత్రవిదో జనాః ॥ 8-17**

**43. ప్ర. పరమపురుషుని ఏ విధంగా పొందవచ్చును?**

**స.** పరమాత్మను అనన్యమైన భక్తితోనే పొందగలరు.

**పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।**
**యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥ 8-22**

**44. ప్ర. పునర్జన్మ, జన్మరాహిత్యము ఎప్పుడు సంభవిస్తాయి?**

**స.** విశ్వంలో శుక్లము, కృష్ణము అని రెండు మార్గాలు ఉన్నాయి. కృష్ణమార్గములో గతించిన వారికి పునర్జన్మ ఉంటుంది. శుక్ల మార్గములో గతించిన వారికి పునర్జన్మ ఉండదు.

**శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।**
**ఏకయా యాత్యనావృత్తిమ్ అన్యయావర్తతే పునః ॥ 8-26**

**45. ప్ర. ఎవరి యోగక్షేమాలను పరమాత్మ వహిస్తాడు?**

**స.** అనన్య చిత్తంతో పరమాత్మను గూర్చి ఆలోచిస్తూ, నిరంతరం ధ్యానిస్తూ ఉపాసన చేసేవారి యోగక్షేమాలను పరమాత్మ వహిస్తాడు.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ 9-22**

**46.** ప్ర. **కోరికలతో కామ్య దేవతలను పూజించడం సబబేనా?**

**స.** కోరికలతో కామ్య దేవతలను పూజించడం అత్యుత్తమం కాదు.

**యే౨ ప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః।**
**తే౨ పి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్ ॥ 9–23**

**47.** ప్ర. **పరమాత్మ వేటిని ప్రీతితో స్వీకరిస్తాడు?**

**స.** నిర్మలమైన బుద్ధిగల భక్తుడు భక్తితో సమర్పించే పత్రాన్నిగాని, పుష్పాన్నిగాని, ఫలాన్నిగాని, ఉదకాన్నిగాని పరమాత్మ ప్రీతితో స్వీకరిస్తాడు.

**పత్రం పుష్పం ఫలంతోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః ॥ 9-26**

**48.** ప్ర. **వేటిని పరమేశ్వరార్పణముగా చేయాలి?**

**స.** భక్తుడు తాను చేసే ప్రతి పనిని, భుజించే ప్రతి ఆహారాన్ని, హోమం చేసే ప్రతి ద్రవ్యాన్ని, అర్పించే ప్రతి దానాన్ని, ఆచరించే ప్రతి తపస్సును పరమేశ్వరార్పణంగా చేయాలి.

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।**
**యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ 9–27**

**49.** ప్ర. **పరమాత్మను పొందటానికి ఏమి చేయాలి?**

**స.** పరమాత్మయందు మనస్సును లగ్నం చేయాలి. భక్తి కలిగి ఉండాలి. పరమాత్మను పూజించాలి. పరమాత్మకు నమస్కరించాలి. ఆత్మను పరమాత్మయందే నిలిపి ఉంచాలి.

ఈ విధంగా చేసినవాడు పరమాత్మను తప్పక జేరగలడు.

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవమ్ ఆత్మానం మత్పరాయణః 9-34**

**50.** ప్ర. **సర్వపాపాల నుండి విముక్తి ఎవరికి లభిస్తుంది?**

**స.** పరమాత్మను జన్మరహితునిగను, సనాతనునిగను, సర్వలోక మహేశ్వరునిగను తెలుసుకొను జ్ఞానికి సర్వపాపాల నుండి విముక్తి లభిస్తుంది.

**యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।**
**అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 10-3**

**51.** ప్ర. **సరైన భక్తులు ఏ విధంగా ప్రవర్తిస్తారు?**

**స.** భక్తులు పరమాత్మయందు లగ్నమైన మనస్సు కలిగియుంటారు. పరమాత్మయందే తమ ప్రాణాలను నిలిపి ఉంచుతారు. పరమాత్మను గూర్చి ముచ్చటించుకుంటూ, ఒకరికొకరు ఉపదేశాలు గావించుకుంటూ బ్రహ్మానందాన్ని అనుభవిస్తూ ఉంటారు.

**మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్ ।**
**కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ॥ 10-9**

**52.** ప్ర. **ఏ వస్తువునైనా పరమాత్మ అంశానికి చెందినదిగా ఏ విధంగా గుర్తించవచ్చు?**

**స.** కాంతివంతమై, శక్తివంతమై, ఐశ్వర్యయుక్తమైన, లోకంలో ప్రతి వస్తువూ పరమాత్మ తేజస్సులోని అంశం వలన ఉద్భవించినదిగా గుర్తించవచ్చు.

**యద్యద్విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశసంభవమ్ ॥ 10-41**

**53.ప్ర. అర్జునుడు విశ్వరూపాన్ని ఎప్పుడు చూడగల్గాడు?**

**స.** అర్జునుడు స్థూలనేత్రాలతో విశ్వరూపాన్ని దర్శింపలేడని చెప్పి, శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి దివ్యదృష్టిని ప్రసాదిస్తాడు. దీని సహాయంతో విశ్వరూపాన్ని చూడగల్గాడు.

**న తు మాం శక్యసే ద్రష్టుమ్ అనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్॥ 11-8**

**54.ప్ర. పరమాత్మ సాక్షాత్కారం దేనివలన మాత్రమే సాధ్యం అవుతుంది?**

**స.** పరమాత్మ సాక్షాత్కారం అనన్యమైన భక్తివలన మాత్రమే సాధ్యమవుతుంది.

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రుష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥ 11-54**

**55.ప్ర. పరమాత్మకు అత్యంత ప్రీతిపాత్రుడు ఎవరు?**

**స.** ఎల్లప్పుడు సంతోషంగా ఉండేవాడును, పరమేశ్వ

రార్పణముగా కర్మలను చేయువాడును, మనో నిగ్రహము కలిగి ఉండి స్థిరమైన, నిశ్చయాత్మకమైన స్వభావము కలిగి, మనస్సును, బుద్ధిని పరమేశ్వరునికి అర్పించిన భక్తుడు పరమాత్మకు అత్యంత ప్రీతి పాత్రుడు.

స్నేహితులను, శత్రువులను, గౌరవమును, అగౌరవమును, చలిని, వేడిని, సుఖమును, దుఃఖమును, నిందలను, పొగడ్తలను, సమానముగా భావించువాడు పరమాత్మకు అత్యంత ప్రీతిపాత్రుడు. అంతేగాక సంసార బంధములలో చిక్కుకొననివాడును, మౌనముగా ఉండువాడును, లభించిన దానితో సంతుష్టిని చెందువాడును, నిత్యమూ ఒకేచోట ఉండనివాడును, మనస్సు చలించనివాడును, పరమాత్మయెడల భక్తిప్రపత్తులుగల మానవుడు పరమాత్మకు అత్యంత ప్రీతిపాత్రుడు.

**సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తస్స మే ప్రియః ॥ 12-14**

**సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।**
**శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః ॥ 12-18**

**తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।**
**అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 12-19**

**56.** ప్ర. క్షేత్రం అంటే ఏమిటి? క్షేత్రజ్ఞుడని ఎవరిని అంటారు?

**స.** దేహాన్ని క్షేత్రమని అంటారు. ఈ దేహాన్ని సంపూర్ణముగా తెలిసినవానిని (ఆత్మను) క్షేత్రజ్ఞుడని అంటారు.

**ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 13-2**

**57. ప్ర. ఇంద్రియములు, అంతఃకరణము, ప్రాణములు – అవి ఏవి?**

**స.** **కర్మేంద్రియములు - 5 :** 1. వాక్కు 2. చేతులు 3. పాదములు 4. మూత్రనాళము 5. మలవిసర్జకము.

**జ్ఞానేంద్రియములు - 5 :** 1. చర్మము 2. నేత్రములు 3. చెవులు 4. జిహ్వ (నాలుక) 5. ముక్కు.

**అంతఃకరణము - 4 :** 1. మనస్సు 2. బుద్ధి 3. చిత్తము 4. అహంకారము.

**ప్రాణములు – 5 :** 1. ప్రాణము 2. అపానము 3. వ్యానము 4. ఉదానము 5. సమానము.

**58. ప్ర. యథార్థదర్శి అని ఎవరిని అంటారు?**

**స.** ఆయా ప్రాణుల శరీరాలు నశించిననూ, సమస్త జీవులలోను వ్యాపించి ఉండే పరమాత్మను నాశరహితునిగా చూసేవానిని యథార్థదర్శి అంటారు.

**సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥ 13-28**

**59.** ప్ర. **జీవుడు దేని ఆధారంగా శరీరంలో ఉంటాడు?**

**స.** సత్త్వరజస్తమో గుణాల ఆధారంగా జీవుడు శరీరంలో బంధించబడి ఉంటాడు.

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।**
**నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్॥ 14-5**

**60.** ప్ర. **సత్త్వగుణం జీవుని ఏ విధంగా బంధిస్తుంది?**

**స.** సత్త్వగుణం నిర్మలమైనది, ప్రకాశకమైనది, దోషరహితమైనది. సుఖమునందును, జ్ఞానమునందును ఆసక్తి ద్వారా అది జీవుని బంధిస్తుంది.

**తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమనామయమ్ ।**
**సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥ 14-6**

**61.** ప్ర. **రజోగుణం జీవుని ఏ విధంగా బంధిస్తుంది?**

**స.** రజోగుణము కోరికలకు, ఆసక్తికి కారణము. కర్మలయందు ఆసక్తి ద్వారా అది జీవుని బంధిస్తుంది.

**రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ ।**
**తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ॥ 14-7**

**62.** ప్ర. **తమోగుణం జీవుని ఏ విధంగా బంధిస్తుంది?**

**స.** తమోగుణము అజ్ఞానము నుండి పుడుతుంది. అలసత్వము, నిద్ర ద్వారా జీవుని బంధిస్తుంది.

**తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।**
**ప్రమాదాలస్యనిద్రాభిః తన్నిబధ్నాతి భారత ॥ 14-8**

**63.** ప్ర. **గుణాతీతుడు ఎవరు?**

**స.** సుఖమును, దుఃఖమును సమానముగా గ్రహించువాడును, ఇష్టమైనదానిని, అనిష్టమైనదానిని సమానముగా స్వీకరించువాడును, నిందలకు, పొగడ్తలకు సమానముగా స్పందించువాడును, మట్టిపెళ్ళ, రాయి, బంగారము మొదలైన అన్నిటియందును సమదృష్టి కలిగిన వాడును, నిత్యము ఆత్మ తత్త్వమునందు లగ్నమైనవాడును అగు ధీరుడే గుణాతీతుడు.

మానావమానములయందును, శత్రుమిత్రపక్షముల యందును సమభావము కలిగిన సర్వకర్మపరిత్యాగిని గుణాతీతుడంటారు.

**సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।**
**తుల్యప్రియాప్రియో ధీరః తుల్యనిందాత్మసంస్తుతిః ॥ 14-24**
**మానావమానయోస్తుల్యః తుల్యో మిత్రారిపక్షయోః ।**
**సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥ 14-25**

**64.** ప్ర. **పరమపదం యొక్క లక్షణం ఏమిటి?**

**స.** పరమపదాన్ని సూర్యుడు,చంద్రుడు, అగ్ని మొదలైన

తేజోమూర్తులెవరును ప్రకాశింపచేయలేరు. పరమపదాన్ని జేరినవారికి పునర్జన్మ ఉండదు.

**న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।**
**యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ 15-6**

**65.** ప్ర. **పునర్జన్మ సమయంలో ఏమి జరుగుతుంది?**

**స.** వాయువు పరిమళాలను ఒక ప్రదేశమునుండి ఇంకొక ప్రదేశానికి తీసుకొనిపోవునట్లు, జీవుడు ఒక దేహాన్ని విడిచి మరొక దేహాన్ని పొందునపుడు, తనవెంట ఇంద్రియాలను, మనస్సును తీసుకొని ప్రయాణిస్తాడు.

**శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।**
**గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥ 15-8**

**66.** ప్ర. **మన శరీరంలో ఉండే జఠరాగ్నినికి అధిదేవత ఎవరు?**

**స.** మన శరీరంలో ఉండే జఠరాగ్నికి అధిదేవత వైశ్వానరుడు అనే పేరుతో ఉన్న పరమాత్మ.

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥15-14**

**67.** ప్ర. **వైశ్వానరుని రూపంలో ఉన్న పరమాత్మ ఏ రకమైన ఆహారాలను జీర్ణం చేస్తాడు?**

**స. వైశ్వానరుని రూపంలో ఉన్న పరమాత్మ నాలుగు విధాలైన ఆహారాలు జీర్ణం చేస్తాడు. అవి –**

భక్ష్యములు – దంతములతో నమిలి తినేవి
(అన్నము, రొట్టె మొ॥నవి.)

భోజ్యములు – నమలకయే నేరుగా స్వీకరించేవి
(పాలు, పెరుగు మొ॥నవి.)

లేహ్యములు – నాలుకతో ఆస్వాదించేవి
(తేనె, పచ్చళ్ళు మొ॥నవి.)

చోష్యములు – పీల్చుచూ ఆరగించేవి
(పండ్లు, చెఱకు మొ॥నవి.)

**68. ప్ర. క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు ఎవరు?**

**స.** సమస్త భూతములను "క్షరుడు" అని అంటారు. పరమేశ్వరుని మాయాశక్తిని "అక్షరుడు" అంటారు. పరమాత్మను పురుషోత్తముడు అంటారు.

**ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽ క్షర ఉచ్యతే ॥ 15-16**
**ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృత ః ।**
**యో లోకత్రయామావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ 15-17**

**యస్మాత్ క్షరమతీతోఽ హమ్ అక్షరాదపి చోత్తమః ।**
**అతోఽ స్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ 15-18**

**69.** ప్ర. దైవీ సంపద ఏమిటి?

**స.** నిర్భయత్వము, అంతఃకరణశుద్ధి, జ్ఞానయోగనిష్ఠ, దాతృత్వము, బాహ్యేంద్రియ నిగ్రహము, యజ్ఞము, వేదాధ్యయనము, తపస్సు, ఋజుత్వము. అహింస, సత్యము, క్రోధరాహిత్యము, త్యాగబుద్ధి, శాంత స్వభావము, పరనింద చేయకుండుట, భూతదయ, విషయముల యందనాసక్తి, మృదుత్వము, లజ్జ, నిశ్చలబుద్ధి వంటి సుగుణములు, ప్రతిభ, ఓర్పు, ధైర్యము, శుద్ధి, ఇతరులను వంచింపకుండుట, అహంకారములేకుండుట, మొదలగు గుణములు – వీటిని దైవీ సంపద అంటారు.

**అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥ 16-1**
**అహింసా సత్యమక్రోధః త్యాగః శాంతిరపైశునమ్ ।**
**దయాభూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥ 16-2**
**తేజః క్షమా ధృతిః శౌచమ్ అద్రోహో నాతిమానితా।**
**భవంతి సంపదం దైవీమ్ అభిజాతస్య భారత ॥ 16-3**

**70.** ప్ర. ఆసురీ సంపద ఏమిటి?

**స.** డాంబికము, గర్వము, అభిమానము, క్రోధము, పరుషత్వము, అవివేకము మొదలగు గుణములను ఆసురీ సంపద అంటారు.

**దంభో దర్పోభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥ 16-4**

**71.** ప్ర. **నరకానికి ద్వారాలు ఏమిటి?**

**స.** కామక్రోధలోభాలు మనుజుని నాశనం చేస్తాయి. అందుచేత ఆ మూడింటిని నరకానికి ద్వారాలు అంటారు.

**త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।**
**కామః క్రోధస్తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ 16-21**

**72.** ప్ర. **శరీరంతో చేసే తపస్సు ఏమిటి?**

**స.** దేవతలను, ద్విజులను, గురువులను, జ్ఞానులను పూజించుట, పవిత్రత, ఋజుత్వము, బ్రహ్మచర్యము, అహింస – వీటిని శరీరంతో చేసే తపస్సు అంటారు.

**దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ ।**
**బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ 17-14**

**73.** ప్ర. **వాక్కుతో చేసే తపస్సు ఏమిటి?**

**స.** ఇతరుల మనస్సులను నొప్పింపకుండుట, సత్యమును, ప్రియమును హితమును పలుకుట, వేదములను అధ్యయనము చేయుట, వేదములను శిష్యులకు బోధించుట – వీటిని వాక్కుతో చేసే తపస్సు అంటారు.

**అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయమ్ తప ఉచ్యతే ॥ 17-15**

**74.ప్ర. మనస్సుతో చేసే తపస్సు ఏమిటి?**

**స.** చిత్తప్రసన్నత, శాంత స్వభావము, మౌనము, ఆత్మనిగ్రహము, అంతఃకరణశుద్ధి – వీటిని మనస్సుతో చేసే తపస్సు అని అంటారు.

**మనఃప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।**
**భావసంశుద్ధిరిత్యేతత్ తపో మానసముచ్యతే ॥ 17-16**

**75.ప్ర. సాత్త్విక దానం అంటే ఏమిటి?**

**స.** దానం చేయుట తన కర్తవ్యంగా భావించి, దేశకాల పాత్రాలకు అనుగుణంగా, తనకు ఉపకారం చేయనివారికి కూడా ఇచ్చే దానాన్ని సాత్త్విక దానమని అంటారు.

**దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥ 17-20**

**76.ప్ర. రాజస దానం అంటే ఏమిటి?**

**స.** ప్రత్యుపకారాన్ని ఆశించి గాని, ఫలాపేక్షతో గాని, అతి కష్టముతో గాని ఇచ్చే దానాన్ని రాజస దానమని అంటారు.

**యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ 17-21**

**77.ప్ర. తామసిక దానం అంటే ఏమిటి?**

**స.** దానమునకు యోగ్యముకాని ప్రదేశమునందును,

కాలమునందును, అగౌరవముగాను, అనాదర భావముతోను, అపాత్రులకు ఇచ్చే దానాన్ని తామస దానము అంటారు.

**అదేశకాలే యద్దానమ్ అపాత్రేభ్యశ్చ దీయతే ।**
**అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥ 17-22**

**78.** ప్ర. **పరబ్రహ్మను ఏయే పదాలతో సూచించవచ్చు?**

**స.** ఓం, తత్, సత్ అను మూడు పదములతో పరబ్రహ్మను సూచించవచ్చును.

**ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।**
**బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 17-23**

**79.** ప్ర. **సన్న్యాసానికి, త్యాగానికి భేదం ఏమిటి?**

**స.** జ్యోతిష్టోమాది కామ్యకర్మలను పరిత్యజించడాన్ని సన్న్యాసము అని అంటారు. సర్వకర్మఫలములను త్యజించడాన్ని త్యాగమని అంటారు.

**కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।**
**సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ 18-2**

**80.** ప్ర. **మనిషిని పవిత్రం చేసేవి ఏమిటి?**

**స.** యజ్ఞములు, దానములు, తపస్సు మనిషిని పవిత్రం చేస్తాయి. అందుచేత వాటిని అనుష్ఠించవలసినదే.

**యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 18-5**

**81.** ప్ర. **జీవన విధానం ఎట్లా ఉండాలని గీత బోధిస్తోంది?**

**స.** ఆదర్శవంతమైన జీవనాన్ని గడపాలని కోరుకునేవాడు నిర్మలమైనబుద్ధిని కలిగియుండాలి. ధైర్యంతో మనస్సును నిగ్రహించుకొని, విషయ సుఖాలను పరిత్యజించి, రాగద్వేషాలను విసర్జించి, ఒంటరిగా ఉంటూ, మితాహారియై, మనోవాక్కాయములను అదుపులో ఉంచుకొని, నిరంతరము ధ్యానయోగములో ఉంటూ, విరాగియై, అహంకార, బల, దర్ప, కామ, క్రోధములు లేనివాడై, లౌకికమైన విషయములయందు ఆసక్తిని విడిచిపెట్టి, "నాది" అను భావము లేనివాడై, శాంతచిత్తుడై, జీవితమును గడపవలెను.

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ।**
**శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ 18-51**

**వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ 18-52**

**అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।**
**విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే॥ 18-53**

**82.ప్ర. శరణాగతి వలన ఏమి లభిస్తుంది?**

**స.** పరమాత్మను శరణు కోరినవానికి పరమశాంతి, మోక్షము లభిస్తాయి.

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥ 18-61**

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 18-62**

**83.ప్ర. గీతోపదేశం అయిన తర్వాత అర్జునుడు ఏమి అన్నాడు?**

**స.** శ్రీకృష్ణపరమాత్మ యొక్క అనుగ్రహము వలన, తన యొక్క అవివేకము తొలగినదనియు, జ్ఞానము లభించినదనియు, సందేహములన్నియూ తీరినవనియు, పరమాత్మ ఆజ్ఞను శిరసావహించెదననియు అన్నాడు.

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।**
**స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ 18-73**

**84.ప్ర. ఏకశ్లోకీ గీత అని ఏ శ్లోకాన్ని అంటారు? దీనిద్వారా సంజయుడు చెప్పిన గీతా సారాంశం ఏమిటి?**

**స.** 18వ అధ్యాయంలోని 78వ శ్లోకాన్ని ఏకశ్లోకీ గీత అంటారు.

'యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడు, ధనుర్ధారియగు అర్జునుడు ఎక్కడ ఉంటారో, అక్కడ సంపద, విజయము, ఐశ్వర్యము, స్థిరమగు నీతి ఉంటాయి. ఇది సంజయుడు చెప్పిన గీతాసారాంశము.

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ ॥ 18–78**



---

**"త్వదీయం వస్తు గోవింద! తుభ్యమేవ సమర్పయే ॥"**

"హే గోవింద! నీ వస్తువును నీకే సమర్పిస్తున్నాను."

## శ్రీ వేదభారతి

వేదశబ్ద పరిరక్షణకు, వేదవిజ్ఞాన ప్రచారానికి ఏర్పడిన ధార్మిక సంస్థ శ్రీవేదభారతి.

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం అని పిలవబడే నాలుగు వేదాలకు సుమారు 1131 శాఖలు ఉండేవని మన ప్రాచీన గ్రంథాల ద్వారా తెలుస్తోంది. కాని నేడు 13 వేదశాఖలు మాత్రమే లభిస్తున్నాయి. ఈ 13 శాఖలలోను, 7 శాఖలకు మాత్రమే గురుశిష్యపరంపర కొనసాగుతోంది. మిగిలిన 6 శాఖలు పాక్షికంగా మాత్రమే లభిస్తున్నాయి. ఈ విధంగా మన ప్రాచీన భారతీయ విజ్ఞానంలో 99% పైగా పోగొట్టుకున్నాము.

వేద విజ్ఞానాన్ని అత్యవసరంగా పరిరక్షించుకోవడానికి శ్రీ వేదభారతి ఆధునిక కంప్యూటర్ టెక్నాలజీని ఎన్నుకొంది. అందులో – రికార్డింగ్ ద్వారా వేద మంత్ర ఉచ్చారణను జాగ్రత్త చేయడానికి కృషిచేస్తోంది. మిగిలి ఉన్న వేదశబ్దాన్ని రికార్డింగ్ చేస్తే సుమారు 3,000 గంటలు కావచ్చునని అంచనా వేయగా, ఇప్పటికి సుమారు 900 గంటలు పూర్తి అయింది. 200 పైగా ఆడియో/మల్టీమీడియా సిడిలరూపంలో అందుబాటులోనికి తీసుకొనివచ్చింది.

వేదాలపై శాస్త్రీయ పరిశోధన & ప్రచురణ :

వేదాలలో ఆధునిక శాస్త్రీయ సాంకేతిక విషయాలను వెలుగులోనికి తీసుకువచ్చే ప్రయత్నంలో "వేదంలో కంప్యూటర్ విజ్ఞానం", "వేదశాస్త్రాలలో ఆధునిక శాస్త్రీయ రహస్యాలు", "భూ కంపాలను ముందుగా పసిగట్ట గల్గుట సాధ్యమా?" మొదలైన అత్యున్నత శ్రేణి పరిశోధనా గ్రంథాలతో బాటు, "వేదగణితం" వంటి సిడి/డివిడిలను కూడా శ్రీవేదభారతి వెలువరించడం జరిగింది.

వైదిక గణితం బోధన :

టి.టి.డి. మరియు భక్తి టీ.వి. ఛానల్స్ ద్వారా లక్షలాదిమంది విద్యార్థులకు వేదగణితం, వేదవిజ్ఞానం వంటి విషయాలు పరిచయం చేయబడుతున్నాయి. విద్యార్థులకు అందుబాటులో ఉండేట్లుగా వైదిక గణితం ప్రచురించడం జరిగింది. ఈ కృషిని గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం **"బంగారు నంది"** బహుమతిని అందించింది.

అభ్యర్థన :

శ్రీ వేదభారతి చేస్తున్న కృషికి అందరూ చేయూతనందించవలసిందిగా ప్రార్థన!!!

Graphics ✆ 040-23731620